ఫ్యాషన్ ప్రపంచంలో సాటిలేని చీరలు,
కరిష్మా శారీస్.




ప్రముఖ క్లాత్ షాపులలో

# న్యూఢిల్లీ లేఖ

డా. జయ్ దుబాష్



రాజీవ్‌గాంధీ పతనం ప్రారంభమయింది. చాలా పెద్దదీ, అత్యంత నిరుత్సాహకరమైనదీ అయిన ఈ పతనానికి మద్రాసు కాంగ్రెసు సమావేశాల్లో నాంది జరిగింది. ఎందుకంటే ఏ విధంగా చూసినా సరే రాజీవ్ అమ్మకానికి పనికిరాని సరుకయిపోయాడు. మళ్ళీ అన్నిటినీ చక్కదిద్దేందుకు ఆయన సహచరులకు భూమి మీద ఉన్న లీరాలూ, డాలర్లూ అన్నీ కావాలి.

మద్రాసులో ఆమోదించిన మూడు తీర్మానాలు ఎంత నిరాశాపూరితంగా ఉన్నాయో గమనించండి. ఆర్థిక పరిస్థితిపై తీర్మానం గత సంవత్సరపు ఆర్థికసర్వేను తిరగ రాసినట్టున్నది. దాన్ని నారాయణదత్ తివారీ ఆర్థిక మంత్రిత్వ శాఖలో ఎవరో ఒక సెక్షన్ అధికారి రాసినట్టున్నది. అటువంటి సర్వేలన్నీ ఉన్నట్టుగానే ఆ తీర్మానంలో కూడా పడికట్టు మాటలు ఎక్కువ, విధాన నిర్ణయాలు తక్కువ ఉన్నాయి. పార్టీ సోషలిజంనే వాంఛిస్తుందట. కాని ధనికులు సొమ్ము చేసుకోవడంపై అవరోధాలు విధించే సోషలిజంను కాదట. పార్టీ ప్రభుత్వరంగానికి అనుకూల మేనట. అంటే దాదాపుభగవంతునికి అనుకూలంగా ఉన్నట్టన్న మాట. కాని ప్రభుత్వరంగం సవ్యంగా పనిచేసే దాకా ఈ అనుకూలత అమలులోకి రాదట. సవ్యంగా పని చేయడమంటే ఎవరి ప్రయోజనాలు కాపాడటం? పన్నుల ద్వారా తన ఖర్చునంతా భరించే ప్రజల ప్రయోజనాలు కాపాడడమా? లేక కొన్నిసార్లు బోఫోర్సు వంటి కంపెనీల ద్వారా, బహుశా ఇంకా ఎక్కువ క్రమబద్ధంగా స్వామ్ ప్రోగెట్టి వంటి దేశీకంపెనీల ద్వారా ఎప్పటికి అప్పుడు ముడుపులు పొందే రాజకీయ నాయకుల ప్రయోజనాలు కాపాడడమా? పార్టీ ప్రణాళికా విధానానికి కట్టుబడి ఉంటుందని తీర్మానం ప్రకటించింది. కాని ప్లానింగ్ కమిషన్ నిపుణులను ఎన్నోసార్లు విదూషకులలాగ చిత్రించారు. ఇప్పటిదాకా ఎవరూ రాజీనామా చేయలేదు గనుక వాళ్ళంతా కూడా సిగ్గూ ఎగ్గూ లేని బృందం లాగే ఉన్నారు. ఇక రైతుల గురించి అక్కడ ఎవరు మాట్లాడతారో మీకు తెలుసా? ఒకప్పుడు పాడీ పంటా ఉన్న రైతు భజన్‌లాల్ కాదు. జయంతి పట్నాయక్ మాట్లాడింది. ఆమె భర్త ముఖ్యమంత్రిగా ఉన్న రాష్ట్రంలో గత సంవత్సరంలో వందకన్నా ఆకలి చావులు సంభవించాయి. చనిపోయిన వాళ్ళందరూ రైతులు, వ్యవసాయ కూలీలు. వాళ్ళను కరువు, జె. బి. పట్నాయక్ రాజకీయాలు చంపేశాయి.

ప్రస్తావిస్తుంది. ఇంకెవరి గురించీ ప్రస్తావన లేదు. వాళ్ళు మాత్రమే చెప్పుకోదగిన కాంగ్రెసు వాదులయినట్టు, మిగిలిన వాళ్ళందరూ ఎందుకూ కొరగానట్టూ అనిపిస్తుంది. అంతేగాక ప్రతి వాక్యంలోనూ ఒక ముసుగు వేసిన పిడికిలి ఉంది. సరిగ్గా హిట్లర్ ఉపన్యాసాలలో వాడిన పిడికిలి లాంటిదే అది. అత్యవసర పరిస్థితి విధించడానికి ముందు రోజుల్లో శ్రీమతి ఇందిరాగాంధీ అనుసరించినటువంటి శైలి అదే. కాంగ్రెస్‌కు అంతిమ ఆయుధాలుగా ఎప్పుడూ బలప్రయోగం, హింస ఉంటూనే ఉన్నాయి. 1975 లోనూ అంతే. ఇది కాంగ్రెసు వాదులు ఎంత నిరాశలో కూరుకుపోయి ఉన్నారో తెలియజేస్తుంది.




ఇక మీరు దాన్ని ఆ పేరుతో పిలవదలుచుకుంటే రాజకీయ తీర్మానం అనేది ఉంది. అది టూత్ పేస్టునో, పాన్ మసాలానో అమ్ముకోవడానికి ప్రచార రచయితలు రాసే ప్రకటనలా ఉంది. ప్రతిపక్షం అధికారం కోసం పాకులాడుతున్నది, అలా పాకులాడడం ఏదో తప్పు పని అయినట్టు ఈ తీర్మానం రాసింది. ప్రతిపక్షం అలా చేస్తే బాగుండుననే నేను అనుకుంటున్నాను. పంజాబ్‌లో పాకిస్తాన్ జోక్యం గురించి తన స్వంత ప్రజల మీదనే నమ్మకం ఉంచకపోయినప్పటికీ ఈ తీర్మానం పంజాబ్ వ్యవహారంలో జోక్యం చేసుకోవద్దని పాకిస్తాన్‌ను హెచ్చరించింది. ఆ తీర్మానం నెహ్రూను, శ్రీమతి ఇందిరాగాంధీని అనంతంగా, పదే పదే

నేను వారిని తప్పు పట్టడం లేదు. వాళ్ళు ఇప్పటికే దక్షిణాదిని పోగొట్టుకున్నారు. తమిళనాడులో ఎం జి ఆర్ దయవల్ల ఉన్న కొద్దిపాటి స్థానాన్ని కూడా వచ్చే నెలలో ఎన్నికల ఫలితాలు వచ్చేసరికి పోగొట్టుకుంటారు. ఎ ఐ సి సి సమావేశాలకు చాలా తక్కువమంది హాజరయ్యారు. హాజరయిన కొద్ది వందల మందిని లెక్కించడంలో పాత్రికేయులు నిమగ్నులయ్యారు. టెలివిజన్‌లో చూసినా పందిళ్ళలోనూ బైటా ఎకరాలకొద్దీ ఖాళీలు కనబడ్డాయి. ఉచితంగా ఆహారం అందించిప్పటికీ హాజరయినవారి సంఖ్య ఇది. కాంగ్రెసు పార్టీ అనేది ఒక పెద్ద వేళాకోళమై పోయింది. అతి మామూలు దక్షిణ భారతదేశపు రైతు కూడా ఈ వేళాకోళాన్ని గుర్తించగలిగాడు.

రాజీవ్‌గాంధీ అండ్ కంపెనీని రెండు విషయాలు కదిలించి ఉంటాయి. మామూలుగా సంచలనాత్మకంగా ఉండని 'హిందూ' పత్రిక జెనీవా నుంచి హిందుజాల గురించి వచ్చిన వార్తను మద్రాసులో కాంగ్రెసు సమావేశాలు ప్రారంభమయిన మొదటి రోజున మొదటి పేజీలో అచ్చు వేసింది. రెండో విషయం ఔరంగాబాద్‌లో శివసేన విజయం. మొత్తం 60 స్థానాలలో శివసేన 50 స్థానాలకు పోటీ చేసి 27 స్థానాలను గెలుచుకుంది. కాంగ్రెసు అతి తక్కువ స్థానాలతో రెండో స్థానంలో ఉండగా, చాలా ఇతర పార్టీలు, తుడిచి పెట్టుకుపోయాయి. అది ఒక క్లిష్టమయిన ఎన్నిక. శివసేన స్పష్టంగా హిందూ

( 8 వ పేజీ చూడండి)

# పెరుగుదలకి ఒక రుచికరమైన మార్గం గురించి రాశిఫలం చెప్తోంది ఫారెక్స్




మీకు రాశిచక్రాలలో నమ్మకముంటే, సింహరాశిలో జన్మించిన పాప స్వభావతః సంతోషంగా వుంటుందని భావించవచ్చు. ఎప్పుడూ నవ్వుతూ, కేరింతలు కొడ్తూ ఉల్లాసంగా వుంటుంది. అందరి దృష్టి ఆకట్టుకోవాలనీ, తన మాటే నెగ్గించుకోవాలనీ ఇష్టం. పదుగురిలో ఒక నాయకురాలిలాగా ముఖ్య పాత్ర వహించే పాపకు అదుపు, అజమాయిషీ పుట్టుకతో వచ్చిన గుణాలు. తియ్యటి చిరు నవ్వుతో అందరి మనసులు దోచి వేస్తుంది. పాపపట్ల మీ మమత మమకారం చూపండి. పాప పెరిగి ఒక అభిమానవంతురాలైన సబల నాయకురాలిగా తయారవుతుంది. మీకు రాశిచక్రాలలో నమ్మకం వున్నా లేకపోయినా పోషకాహారం విషయా- నికి వస్తే మీరు నమ్మదగినది ఒకటి వుంది - అదే ఫారెక్స్!

**4** నెలల నుంచీ మీ పాపకి 'పాలతో కూడిన ఫారెక్స్ సీరియల్' యివ్వండి. సమగ్రమైన గోధుమ సీరియల్‌తోనూ, సంపూర్ణమైన పాలతోనూ తయారు చేసిన దీనిలో కాల్షియం, మినరల్స్, విటమిన్లు మరియు ప్రోటీన్లు వుండి శీఘ్రంగానూ, అన్ని విధాలా మీ పాప పెరగడానికి కావలసిన పోషకత్వం అవి అంద చేస్తాయి.

**6** నెలల నుంచీ రకరకాల రుచుల కోసమే కాక పూర్తి పోషకత్వం కోసమూ పాప తీసుకునే ఆహారానికి 'ఫారెక్స్-వెజ్' కలిపి యివ్వండి.









**వెరుగుదల కోసం రుచికరమైన విధానం.**

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు : (1938-1972)

29.7.88; 5.8.88

శ్రీ విభవ నామ సం. ఆషాఢ పౌర్ణిమ; ఐ. అష్టమి

సంపుటము 80 : సంచికలు 49; 50

ముఖ్య సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు :

మతుకుమల్లి మాధవరావు

విడి ప్రతి వెల రు. 3.00

పోస్టులో 6 నెలల చందా రు. 87.10

పోస్టులో 12 నెలల చందా రు. 174.20

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక





## ఉత్తరాలు

### ముఖచిత్రం

గత వారం (3–10) ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం అందాల నటి "కల్పన" చాల ఆకర్షణీయంగా వుంది.

– నక్క రామకృష్ణ, కొండపల్లి

### కథలు

కథ అంటే ఎలా వుండాలో కాకాని కమలకే తెలుసు. "గతం గతః" భవిష్యత్ సౌధానికే పునాది రాయి. ఉత్తమ మైన కథలు అందించే ఘనత ఆది నుంచి ఆంధ్రపత్రికదే అనటం అతిశయోక్తి కాదు. రచయిత్రికి ప్రత్యేక అభినందనలు.

– ఆర్. సర్వేశ్వర శర్మ, హైదరాబాద్

* * *

కల్పన ముఖచిత్రంతో వెలువడిన "ఆంధ్ర సచిత్ర వారపత్రిక" ఎంతో బావుంది. తిరుమలశ్రీ గారి "చట్టం విధించని శిక్ష" కథ సింప్లీ సూపర్బ్. ఈ దేశంలో ప్రతి స్త్రీ" వాసంతి"లా తిరగబడితే "నరేంద్ర" లాంటి దేశ ద్రోహుల ఆట కట్టించ వచ్చు. ఈ కథ "నరేంద్ర" లాంటి దేశ ద్రోహులకు చక్కని గుణపాఠం. రచయితకు నా కృతజ్ఞతలు.

– కూసంపూడి ప్రభాకరరావు, యన్. కె. గాలిబ్ షహీద్, సత్తుపల్లి

* * *

కల్పన ముఖచిత్రం గల పత్రిక ఆకర్షణీయంగా ఉన్నది. కథలలో "గతం గతః" చాలా బాగుంది. త్రిపుర పాత్ర చక్కగా వర్ణించినారు. రచయిత్రికి నా అభివందనలు.

– కె. ఎన్. వి. రవికుమార్, మైలవరం

* * *

కల్పన ముఖచిత్రంతో వెలువడిన ఈ వారం పత్రిక మనోరంజకంగా వుంది. కథల్లో "చట్టం విధించని శిక్ష" హృద్యంగా వుంది. మిగతా ఫీచర్లు అన్నీ బాగుంటున్నాయి.

– సి. వి. నరసింహదాసు, విజయనగరం

* * *

"కల్పన" ముఖచిత్రంతో వెలువడిన సంచికలో కాకాని కమల గారి కలం నుండి వెలువడిన కథ "గతంగతః" ఎంతో వాస్తవంగా వుంది. త్రిపుర వేసిన తప్పటడుగుతో దాక్షాయని చనిపోవటం, లలితమ్మ పిచ్చిది కావటం ఎంతో సహజంగా అనిపించాయి. ఈ స్థితిలో విశ్వనాథ శాస్త్రి పాత్రను రచయిత్రి చిత్రించిన తీరు, ఆయన మనోవేదనను వ్యక్తం చేసిన తీరు ఎంతగానో బాగున్నాయి. కథ చివరలో జీర్ణ వస్త్రాలతో, చంటి బిడ్డను చంకన వేసుకుని, యాచకురాలిగా కన్న తండ్రి ఇంటిముందే "అమ్మా" అంటూ పట్టెడు మెతుకుల కోసం పరితపిస్తున్న త్రిపురను, ఆమెను తన కూతురిగా గుర్తించ లేకపోయిన తల్లిని చూస్తుంటే గుండె తరుక్కుపోయింది. అయినా విశ్వనాథ శాస్త్రి కొండంత మనసు[illegible]న్ని [illegible] త్రిపురకు తన ఇంట [illegible] కర్తవ్య సంపూర్ణతను ఇచ్చింది. [illegible] తమకు తోచిన నిర్ణయాలు తీసుకుని, పండంటి జీవితాలను బలి చేసుకునే పడతులకు ఈ కథ ఒక చక్కని గుణపాఠం!

– వక్కలంక రామారావు, అనపర్తి

### వ్యాసాలు

3–6–88 సంచికలో ఇద్దరు స్వామీజీల వాదోపవాదాలు ప్రచురింపబడ్డాయి. ఇది ఎలుకకు ప్రాణ సంకటం పిల్లికి చెలగాటంగా ఉంది. శాస్త్రాలలో ఉందా లేదా అన్నదికాదు ముఖ్యం. ఒక నిండు ప్రాణాన్ని బలిఇవ్వటం తగునా అన్నది ప్రశ్న. ఒకవేళ స్త్రీ ఇష్టపడ్డా అది ఆత్మ హత్యానేరం అవుతుంది. భర్తను ప్రేమించే భార్యలేకాని భార్యని ప్రేమించే భర్తలు లేరా? వాళ్ళని గురించి శాస్త్రాలలో ఏమీ లేదా హిందూ ధర్మశాస్త్రం అంటే ఆడవాళ్ళకేనా?

కె. రామారావు, హైదరాబాద్

### శీర్షికలు

ఈ వారం ప్రచురించిన స్పెల్లింగ్ పోటీలో ఉయ్యూరు "రత్న" ప్రభను అమెరికాలో యుండే ఆ విధముగా తీర్చి దిద్దినందులకు వారి తల్లి దండ్రులుకు నా ధన్యవాదములు. "సతి" ఆచారంపై ఇద్దరు స్వాములు వాదోపవాదాలతో కూడినది ప్రచురించిన "ఆంధ్ర సచిత్ర వారపత్రిక" వార్కి నా అభి వందనలు. స్వామి "అగ్నివేష్" వాదన సరైనది నేను వారి వాదననే ఏకీభవిస్తున్నాను. మా కుటుంబంలో వారంతా కూడా చదువుతుంటే వారి వాదననే నచ్చునది అంటున్నారు.

వ్యక్తిగతంలో శ్రీమతి కిరణ్‌బేడీ గారిని నిజాయితిగా పనిచేస్తున్న ఒక ఐ. పి. ఎస్. అధికారిని బదిలీ చేసినందులకు చాలా బాధకలిగినది. వారిని వేరే చోటుకు మార్చారు తప్ప, వారి మనస్సులో యున్న నిజాయితీని మార్చలేరు కదా!!

కుడుపూడి ప్రసాద్, సత్యవతి, దుర్గ, దుర్గాప్రసాద్, (పాట్నా)

### దూరదర్శనం

."రామాయణ్" సీరియల్‌లో రామలక్ష్మణులు నాగపాశ బద్ధులవటం గోస్వామి తులసీదాసు రచించిన రామచరితమానస్‌లో చిత్రాలతో సహా ఉన్నది. శ్రీమతి లతగారు రామనంద్‌సాగర్ సమర్థించు కొన్నారని, ఆనంద రామాయణంలో ఉన్నదని వ్రాసారు. విచిత్ర ఆనంద రామాయణంలోనే కాక, రామచరిత మానస్‌లో కూడా ఈ విధంగా వున్నదని. చదువుకున్న నేను తెలియ చేయు చున్నాను.

– బి. వి. రమ, కుటుంబ సభ్యులు, కాకినాడ

వేదిక మీద పోటీ చేసిందని తప్ప అది ఎందుకు గెలిచిందో మనకు ఇంకా తెలియదు. కాని చాలా జాగ్రత్తగా ప్రజాభిప్రాయాన్ని గమనించిన కొద్దిమంది స్థానిక పాత్రికేయులు మినహా ఎవరూ తీవ్రంగాపట్టించుకోని శివసేన గెలవడం, అది కూడ వరుసగా మూడు చోట్ల - మొదట బొంబాయిలో, తర్వాత థానెలో, ఇప్పుడు ఔరంగాబాద్‌లో - విజయం సాధించడం రాజీవ్‌గాంధీ అండ్ కంపెనీకి భైవభీతిని కలిగించినట్టున్నది. రానున్న, మహారాష్ట్ర శాసనసభలో శివసేన అత్యధిక బలం కలిగిన పార్టీగా గాని, పెద్ద ప్రతిపక్ష పార్టీగా గాని ఉంటుందనడంలో నాకు ఎంత మాత్రమూ సందేహంలేదు. అది గనుక తగినన్ని స్థానాలు గెలుచుకొని అత్యధిక స్థానాలు గల పార్టీగా ఉంటే, కాంగ్రెసులోని అసమ్మతి వాదులతో కలిసి ప్రభుత్వాన్నికూడా స్థాపించవచ్చు. ఆ అసమ్మతి వాదులకు ఏటు వైపు చేరడం లాభసాటో బాగానే తెలుసు. కంచె దూకేయడంలో వాళ్ళు సిద్ధహస్తులు కూడా. అలా దూకే వాళ్ళలో బహుశా శరద్‌పవార్ మొదటి వ్యక్తి అవుతారు. ఇప్పటికే ఆయన అందుకు ప్రణాళికలు వేసుకుంటూ ఉండవచ్చును. చాలామంది కాంగ్రెస్ వాదులలాగనే ఆయన దూకడంలో నిపుణుడు. కాని నేనే బాల్‌థాకరేనయి ఉంటే, మిగిలిన కాంగ్రెస్ వాదులతో పాటు శరద్‌పవార్‌ను కూడ తగినంత దూరంలో ఉంచుతాను.

( 4 వ పేజీ తరువాయి)

ప్రారంభమవుతుంది. ఎందుకంటే దక్షిణాది నుంచి ఉత్తరాదికి ప్రయాణించేటప్పుడు మహారాష్ట్ర సింహద్వారం లాంటిది. మహారాష్ట్ర తర్వాత గుజరాత్, మధ్యప్రదేశ్ పడిపోవడానికి సిద్ధంగా ఉంటాయి. ఐతే మహారాష్ట్రలో శరద్‌పవార్‌లాగనే అర్జున్‌సింగ్ కూడా గోద దూకడానికి ముందుకొస్తారని నా అనుమానం. గుజరాత్‌లో కాంగ్రెస్‌పార్టీ నామరూపాలు లేకుండా పోతుంది. ఎందుకంటే ఆ రాష్ట్రంలో అటువంటి పార్టీ ఏదీ లేదు. రాజీవ్ నాయకత్వంలో కాంగ్రెసు ఒక మహారాష్ట్రలో పతనంతో ఉత్తరాదిన కూడా రాజీవ్‌గాంధీ అండ్ కంపెనీ పతనం మాఫియాలాంటి సంస్థ అయిపోయింది. ఎన్ని అడ్డంకులు ఎదురైనా పదవికి అంటి పెట్టుకుని ఉండడమే దాని ఏకైక లక్ష్యం. పదవీ, అధికారం పోయాయంటే కాంగ్రెసు వాదులు నీటిలోంచి బైటపడిన చేపల్లా అవుతారు. ఎవరి భజన బృందంలోనైనా చేరడానికి సిద్ధంగా ఉంటారు. రాబోయే ఎన్నికల తర్వాత వాళ్ళు అంటి పెట్టుకుని ఉండడానికి ఏమీ ఉండదు గనుక వాళ్ళు ఇక పిచ్చిగా దూకుతూనే ఉంటారు.

శివసేన కార్పొరేషన్‌ను నడపలేక పోయినప్పటికీ, దాని విజయం మతతత్వానికి విజయమని, అందువల్ల లౌకిక రాజకీయాలకు దెబ్బ అనీ అనేవాళ్ళు ఉన్నారు. సరి సరి! ఎవరికి వాళ్ళు తమ మతం గురించి పోరాడడం మతతత్వం ఎట్లా అవుతుందో నాకు తెలియదు. రాష్ట్రంలో శివాజీ ఊరేగింపులను బలప్రయోగం ద్వారా అడ్డుకోవడానికి కొందరు ముస్లింలు కొందరు కాంగ్రెసువాదులతో, లౌకిక వాదులమైన 'సోషలిస్టుల'తో కలిసి ప్రయత్నించినప్పుడు వాళ్ళను ఎదిరిస్తూ శివసేన ప్రాముఖ్యం పొందింది. శివాజీ హిందువే. కాని ఆయన ఇంకా ఎక్కువ కూడా. విదేశీ మొఘల్‌లకు వ్యతిరేకంగా తిరుగబడిన మొట్టమొదటి వ్యక్తి ఆయన. మొఘల్‌లు విదేశీయులనే వాస్తవమే, వాళ్ళు ముస్లింలనే దానికన్నా ముఖ్యమైనది. లోకమాన్య తిలక్‌కు బ్రిటిష్‌వాళ్ళు ఎంత విదేశీయులో, శివాజీకి మొఘల్‌లు కూడా అంత విదేశీయులే. తిలక్ కూడా హిందువే. కాని ఆయన రాజకీయాలు మతతత్వ పూరితమయినవని ఎవరూ అనలేదు. విదేశీ మొఘల్‌లకు, విదేశీ బ్రిటిష్ వాళ్ళకు వ్యతిరేకంగా పోరాడడం ఎంత సమంజసమైనదో, శివాజీ విగ్రహాన్ని ఊరేగింపులో తీసుకు వెళ్ళడానికి అనుమతించని వాళ్ళకు వ్యతిరేకంగా పోరాడడం అంతే సమంజసమైనది. శివసేన ఇటువంటి భ్రమల రాజకీయాలను మొదటిసారిగా మహారాష్ట్రలో ఓడించింది. అందుకు వాళ్ళకు హృదయపూర్వక అభినందనలు. శివాజీ గురించి సిగ్గుపడే భారతీయులకు భారతదేశంలో ఉండే అర్హతలేదు.

సీరియల్




మల్లాది వెంకటకృష్ణమూర్తి

> జరిగినకథ– 15: నిశ్చితార్థం తప్పించుకున్న ఆదిలక్ష్మి తల్లితో కలిసి వినాయకరావుతో మాట్లాడడానికి వస్తుంది. తన మీద అభాండం వేసినందుకు కక్ష తీర్చుకుంటానని సుబ్బలక్ష్మి వినాయకరావుకు ఉత్తరం రాస్తుంది. ఆదిలక్ష్మి పెళ్ళి చెడగొట్టడానికి శాస్త్రి ఆలోచనలు చెబుతుంటాడు. కామేశానికి ఎయిడ్స్ ఉందని చెప్పాలనుకుంటారు. కామేశంతో పెళ్ళయితే ఆత్మహత్య చేసుకుంటానని, ఆ నేరం కామేశం మీదికే వస్తుందని బెదిరిస్తుంది ఆదిలక్ష్మి.

(గత సంచిక తరువాయి)

సాయంత్రం ఇంటికి రాగానే భర్తతో చెప్పింది కనకమహాలక్ష్మి.

"అమ్మాయికి ఒంట్లో నలతగా వుందిటండి".

"అరెరె! ఏమైంది?"

"జ్వరం బయటకి లేదు. నీరసం. తల తిరగటం. డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళండి".

"అలాగే. ఆచారి దగ్గరకి తీసుకెళ్తాను".

"ఆయన వూళ్ళో లేడు కదండి".

"ఎక్కడికెళ్ళాడు?" అడిగాడు రమణమూర్తి.

"రష్యాకి. మరో వారం దాకా రాడట".

"వారం దాకా ఎలా ఆగడం?" అడిగారాయన.

"ఈ సందు చివర కొత్తగా ఓ డాక్టర్ డిస్పెన్సరీ తెరిచాడు. అక్కడికి తీసుకెళ్ళండి".

"కొత్త డాక్టరా? ఏం అనుభవం వుంటుంది?" చప్పరించాడు రమణమూర్తి.

"నాకు తెలిసిన ఇద్దరు ప్రాణాలని కాపాడాడండి. మన పోస్ట్‌మేన్ నాన్నకి అపెండిసైటిస్ అని ఇట్టే పట్టేసి సర్జన్ దగ్గరకి పంపాడు. రావులపాలెం ముసలావిడకి నూటేడు దాటి మంచం దించి కబురు పంపారు. నాలుగు ఇంజక్షన్‌లతో నయం చేసి పారేసాడు."

"సరే. పదమను". బట్టలు మార్చుకుని ఆదిలక్ష్మి, చిన్నగా మూలుగుతూ, నీరసం నటిస్తూ బయటికి వచ్చింది.

"ఎలా వుందమ్మా?" అడిగారాయన ప్రేమగా.

"బాగాలేదు నాన్నగారు" చెప్పింది ఆదిలక్ష్మి.

"ఫర్లేదులే. పొద్దున్న మీ అమ్మ తెలగ ఎండ కూర చేసిందిగా అందుకయి వుండొచ్చు." చెప్పాడాయన.

తమ పథకం ప్రకారం అర గంట క్రితమే వాళ్ళు హాస్పిటల్‌కి బయలుదేరాలి. వినాయకరావు, శాస్త్రి ఆదుర్దాగా ఎదురు చూస్తున్నారు తండ్రీ కూతురు బయలుదేరడానికి.

"అవును మహా నువ్వు తీసుకెళ్ళొచ్చుగా?" అడిగాడు రమణమూర్తి అకస్మాత్తుగా.

"తీసుకెళ్ళొచ్చనుకోండి. కాని..."

"కాని?"

ఏం చెప్పాలో తెలీక ఆవిడ కూతురు వంక చూసింది, నదిలో మునిగిపోయి వాళ్ళు వడ్డున వున్న వాళ్ళ వంక చూసినట్లుగా.

"నేను అంత దూరం నడవలేను నాన్నగారు. స్కూటర్ మీద తీసుకెళ్ళండి" చెప్పింది ఆదిలక్ష్మి.

"అవునండి. నాలుగ్గంటల్లో ఎంత చిక్కిపోయిందో చూడండి. నడవలేదు" చెప్పింది కనక మహాలక్ష్మి.

"సరే. పద."

ఆయన స్కూటర్ స్టార్ట్ చేసిన శబ్దం వినగానే వినాయకరావు బయటకి వచ్చాడు. తండ్రి వెనక కూర్చున్న ఆదిలక్ష్మిని చూసి అడిగాడు గట్టిగా–

"అదేమిటి ఆదిలక్ష్మిగారు ఒక్క పూటలో అంత చిక్కిపోయారు? ఏమైంది?"

"ఒంట్లో నలతగా వుంది" చెప్పింది ఆదిలక్ష్మి.

"జాగ్రత్తగా ముందు డాక్టర్ దగ్గరకి వెళ్ళండి. ఊళ్లో మలేరియా బాగా వుందని పొద్దున రేడియోలో చెప్పారు" చెప్పాడు వినాయకరావు.

ఆ మాటలు వినగానే రమణమూర్తి భృకుటి ముడిపడింది.

"మన సందు చివర డాక్టర్‌గారొకాయన కొత్తగా వచ్చారు పేరు డాక్టర్ బిళహరి అనుకుంటాను" చెప్పాడు శాస్త్రి.

"అక్కడికో" చెప్పింది ఆదిలక్ష్మి.

స్కూటర్ బయటకి వెళ్ళగానే మిత్రులిద్దరూ దూరంగా కుర్చీలో కూర్చుని చందమామ చదువుకుంటున్న కామేశ్వరరావు వంక చూసి, తర్వాత ఒకరి మొహాలు మరొకరు చూసుకుని నర్మగర్భంగా నవ్వుతున్నారు.

స్కూటర్‌ని బయట ఆపాడు రమణమూర్తి. తండ్రీ కూతుళ్ళిద్దరు డాక్టర్ బిళహరి హాస్పిటల్‌లోకి వెళ్ళారు. డాక్టర్ బిళహరి వాళ్ళ కోసం ఎదురు చూస్తున్నాడు. ఆ రోజు పొద్దుటే కాసి వినాయకరావు వచ్చి, ఏ. జి ఆఫీసులో పని చేస్తూ, ఆ సందు చివర గదిలో అద్దెకి వుంటున్న బిళహరికి తమ పథకం వివరించి, తమకేం కావాలో కోరారు.



ముందు అతను వప్పుకోలేదు. అబద్ధం ఆడాలంటే అందరకీ ధైర్యం రాదుగా. కాని చివరికి సాయంత్రం, తేలు పార్టీ అన్నాక మెత్తబడ్డాడు, ఒక్క రమణమూర్తినే ఫూల్ చేయాలి కాబట్టి.

మధ్యాహ్నానికల్లా డాక్టర్ బిళహరి యం.బి.బి.ఎస్., ఎం.డి., ఎం.ఎస్.ఎఫ్.ఆర్.సి. ఎస్ (లండన్) అనే చాంతాడు పొడుగున్న బోర్డుని రాయించాడు. దాన్ని అంతకు అరగంట మునుపే బయట గుమ్మం మీద తగిలించాడు. అట్టే ప్రాక్టీస్‌లేని ఓ ఆర్.ఎం.పి. నించి తెల్లటి పింగాణీ బేసిన్, దాన్ని వుంచడానికి స్టాండ్, సేంపుల్ మందులు, టార్చి లైటు, మానవ దేహాన్ని మేప్‌లా చిత్రించిన పటం. డాక్టర్ ఈజ్ ఇన్/అవుట్ బోర్డులాంటివి తీసుకొచ్చి ఆ గదిలో అలంకరించేసారు. గదిలో మధ్య చిన్న తెర కట్టారు. బిళహరికి కొంత భయంగా, కొంత వుత్సాహంగా వుంది.

"డోంట్ వర్రి మై డియర్ హరి. ఇవాళ ఇది విజయవంతంగా అయాక 'నా వల్ల ఓ జంట కలిసింది' అని నీవు గర్వంగా ఎంతో కాలం ఎంతో మందికి చెప్పుకోవచ్చు" చెప్పాడు వినాయకరావు.

"రోగాన్నిచ్చిన దేముడు దాన్ని తనే కుదురుస్తాడు. ఎటొచ్చీ డాక్టరే ఫీజ్ తీసుకునేది" చెప్పాడు శాస్త్రి.

"కరెక్ట్ పేషెంట్స్ మళ్ళీ తమ దగ్గరకి రాకపోతే డాక్టర్లు వాళ్ళకి రోగం నయం అయిందనుకుంటారు కాని తమ మీద నమ్మకం పోయి రాలేదనుకోరు. యూ ఆర్ లక్కీ. నువ్వలాంటి వృత్తిలో లేవు. కేవం ఓ అర గంట పాటు నటించాలి. అంతే" చెప్పాడు వినాయకరావు.

"ఇంకో పాయింట్. ఓ అందమయిన నాజూకయిన అమ్మాయి చేతిని కాసేపు పట్టుకుని నాడి చూడటం ప్రపంచంలోకెల్లా అతి గ్లామరస్ వృత్తి. ఓ అర గంటసేపు అలాంటి వృత్తిలో నటించడం నీ అదృష్టం" చెప్పాడు శాస్త్రి.

ఆ విధంగా వినాయకరావు, శాస్త్రి సలహా ప్రకారం, రమణమూర్తికి కామేశ్వరరావు మీద అసహ్యం పుట్టి, అతనికి తన కూతురు ఆదిలక్ష్మిని ఇవ్వకూడదన్న ఆలోచన కలిగించడానికి ఆడే నాటకంలో ముఖ్య భాగంగా డాక్టర్ బిళహరి మెడలో స్టెతస్కోప్‌తో కూర్చుని వాళ్ళ కోసం ఎదురు చూడసాగాడు.

రమణమూర్తి స్కూటర్ హేండిల్ లాక్ చేసేలోగా ఆ సందులోంచి వెళ్తున్న ఓ వ్యక్తి డాక్టర్ పేరు చూసి గబగబ లోపలికి వెళ్లాడు.

ఆదిలక్ష్మితో రమణమూర్తి కోసం ఎదురు చూస్తున్న బిళహరి కొత్త వ్యక్తి రావడంతో కొద్దిగా కంగారు పడ్డాడు.

"యస్?" అడిగాడు ఆ వృద్ధుణ్ణి చూసి.

ఆయనకి అరవైదాకా వుంటుంది. పూర్తిగా తెల్ల జుట్టు సన్నగా, బక్క పలచగా, అనారోగ్యంగా వున్నాడు.

"మూడు రోజులనించి వెడం వైపు తలనొప్పి" చెప్పాడాయన.

"అలాగా?"

"కుడి వైపు కాలునొప్పి. రెండు మార్చి మార్చి వస్తున్నాయి"

"జ్వరం వుందా?" లోపల భయంగా వున్నా తన డాక్టర్ రోల్‌ని చక్కగా అభినయించాడు బిళహరి.

"పూర్తిగా లేదు."

బిళహరి ఆయన నాడి చూసి, స్టెతస్కోప్‌ని వీపు మీద వుంచాడు. ఏ శబ్దం వినపడలేదు. చెవులకి స్టెత్‌ని తగిలించడం మర్చిపోయానన్న సంగతి కూడా గుర్తు లేదతనికి.

"ఇలా మూడేళ్ళుగా వస్తోంది. నగరంలోని డాక్టర్లందరి దగ్గరకీ వెళ్లాను. ఎవరూ పూర్తిగా తగ్గించలేకపోయారు".

"మందనేది తగ్గే రోగాల్నే కుదురుస్తుంది. అయితే అన్ని వేళలా కాదు"

చెప్పాడు బిళహరి సీరియస్‌గా.

"అసలిది ఎందుకు వస్తుందంటారు?" అడిగాడు

"ఇది ఎందుకు వస్తుందంటే... ఎందుకంటే... టీ తాగే అలవాటుందా మీకు?"

"లేదు"

"కాఫీ?"

"ఊహు"

"పోనీ సిగరెట్, ఆల్కహాల్?"

"ఛీ ఛీ లేవు"

"ముక్కు పొడెం? వక్కపొడి?"

"లేనే లేవు"

"జర్దా, కిళ్ళీ?"

"లేవు"

కాసేపు ఆలోచించి అడిగాడు బిళహరి.

"వంకాయ?"

"ఓ మహా ఇష్టంగా. కోసి, ఉల్లిపాయ కారం పెట్టి నూనెలో దోరగా వేయించిన లేత వంకాయల కూరని వేడి వేడిగా అన్నంలో కలుపుకుంటే కిలో బియ్యం తినేయగలను" చెప్పాడాయన.



"చూసారా? అదన్న మాట కారణం. మీరో సంవత్సరం పాటు వంకాయ మానాలి. ఆ తర్వాతే వచ్చి చెప్పండి ఎలా వుందో".

'అలాగే. తగ్గుతుందంటారా?" ఆశగా అడిగాడు.

"నేనెలా చెప్పగలను? రోగికి ఎక్కువ సహాయం చేసేది దేముడేనండి. మీ విషయంలో మీకు ఎక్కువ సహాయం చేసేది వంకాయ. దాన్ని ముందు మానేయండి. తర్వాత చూద్దాం".

"అలాగే"

"ఇంతకీ ఈ రోగం పేరేమిటంటారు?" అడిగాడాయన.

"దీని పేరు... మగేనిరియా అని. ఏభై పైబడ్డ వాళ్ళకి వస్తుంటుంది. ముందుగా ఇది వాడి చూడండి".

ప్రిస్క్రిప్షన్ రాసిచ్చాడు బిళహరి. దాన్ని చదివి అడిగాడు ఆయన గబ గబ.

"ఇది విక్స్, అనాసిన్ కదూ?"

"అవునండి. ఒకటి తలనొప్పిని, ఇంకొకటి కాలు నొప్పికి. చెరో సగం రోజుకి రెండు సార్లు వేసుకుంటూండండి"

"మీ ఫీజ్...?" అడిగాడు.

"అబ్బే. అవసరం లేదండి. సంవత్సరం తర్వాత నయం అయితే మళ్ళీ కనబడండి. అప్పుడు చూసుకుందాం"

"నా మగేనిరియాకి కారణం వంకాయేనంటారా?" అనుమానంగా అడిగాడు.

"ఖచ్చితంగా వంకాయే. గుత్తి వంకాయ జోలికి అసలు వెళ్ళకూడదు".

ఆయన చిన్నగా నిట్టూర్చి బిళహరి చేతిని పట్టుకుని ఎంతో కృతజ్ఞతగా చెప్పాడు.

"చూడబ్బాయ్. వయసుతో చిన్నవాడివయిపోయావ్ కాబట్టి నీకు చేతులెత్తి మొక్కటం లేదు. నా రోగానికన్నా నేను డాక్టర్లకే భయపడుతుంటాను. ఎందుకో తెలుసా? నీలాంటి వాళ్ళు ఒక్కరూ తారసపడలేదు. ఓ అంతర్జాతీయ సత్యం చెప్పనా? రోగం మన ఒంటికన్నా పర్సుని హరిస్తుంటుంది. ఎన్ని వేలు డాక్టర్ల కోసం, మందుల కోసం తగలేసానో చెప్పలేను. అప్పరాల్. ఒక్కడంటే ఒక్కడు కూడా చెప్పలేదు. ఆ అయిదక్షరాలు. 'వంకాయ మాను' అంటే ఎప్పుడో మానేసేవాణ్ని. వంకాయ నా వంటికి ఇంత చెరుపు చేస్తుందని ఎన్నడూ కల్లో కూడా వూహించలేదు"

ఆయన బలవంతంగా పది రూపాయలు బిళహరి చేతిలో వుంచి చెమ్మగిల్లిన కళ్ళని తుడుచుకుని బయటికి నడిచాడు.

ఆయన వెళ్లాక నుదుట పట్టిన చెమటని తుడుచుకుని దీర్ఘంగా నిట్టూర్చాడు బిళహరి.

"నెక్స్ట్" అరిచాడు.

రమణమూర్తి, ఆదిలక్ష్మి, లోపలికి వచ్చారు.

"కూర్చోండి" చెప్పాడు బిళహరి.

"ఇదిగో అమ్మాయి. పొద్దున్ననించి వంట్లో నలతగా వుందంటే తీసుకొచ్చాను" చెప్పాడు రమణమూర్తి.

"అలాగా ఏదమ్మా. నాలిక చూపించు"

"గొంతులోకి టార్చిలైట్ వేసి చూసాడు బిళహరి.

"జ్వరం వుందా?" అడిగాడు.

"అట్టే లేదండి" నీరసంగా చెప్పింది ఆదిలక్ష్మి.

"లక్షణాలేమిటి?" అడిగాడు.

"దాహం, ఆకలి. తర్వాత మళ్ళీ ఆకలి, దాహం. ఎంత తిని, ఎంత తాగినా నీరసం" చెప్పింది ఆదిలక్ష్మి.

"టెంపరేచర్ చూడండి" చెప్పాడు రమణమూర్తి.

"ధర్మా మీటర్ పగిలిపోయిందండి. జ్వరం లేదులెండి" చెప్పాడు బిళహరి.

"ఇదివరకెప్పుడూ చూడలేదు. నీవు కొత్తగా ప్రాక్టీస్ చేస్తున్నావా బాబు?" అడిగాడు రమణమూర్తి.

"అవునండి. ఇదివరకు ఏలూరులో చేసేవాణ్ని. పెళ్ళయ్యాక ఈ వూరుకి



## రచయితలకి సూచనలు

ఆంధ్ర సచిత్రవారపత్రికకి పరిశీలనార్థం తమ రచనలని పంపే వారు ఈ కింది సూచనలని గమనించ కోరుతున్నాము.

రచనలు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి. కాగితానికి రెండు వైపులా రాసి ఉన్న రచనలని పరిశీలించటం జరగదు.

పరిశీలనకి పంపే రచనలు కథలైతే 10 అరఠావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది. వ్యాసాలు 3 అరఠావు పేజీలు మించరాదు. వ్యాసాలు పంపేవారు వాటికి సంబంధించిన బొమ్మలు లేదా ఫొటోలు జతపరిచి పంపటం అవసరం.

రచనలు స్వంత రచనలై ఉండాలి. అనువాదాలు, అనుసరణలు, కాపీ రచనలు పంపరాదు. ఆ మేరకి రచయిత(త్రి) హామీ పత్రం రాసి సంతకం చేసి రచనతో పాటే పంపాలి.

రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే రాసి ఉండాలి. వ్రాత ప్రతి మీద రచయిత(త్రి) పూర్తి చిరునామా స్పష్టంగా పిన్‌కోడ్‌తో సహా రాయాలి.

కథల పరిశీలనకి 1–2 నెలలు, నవలల పరిశీలనకి కనీసం 6 నెలలు పట్టవచ్చును. పరిశీలన అయిన తర్వాత ఏ విషయం అయా రచయిత(త్రు)లకి తెలియచేయటం జరుగుతుంది. ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపకోరేవారు తమ రచనతో పాటే స్వంత చిరునామా కల, తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన కవరు జత పరచి పంపాలి. లేకపోతే వాటిని తిప్పి పంపటం సాధ్యం కాదు. రచనలు తిప్పి పంపే విషయంలో తగిన జాగ్రత్త తీసుకోటం జరుగుతుంది కానీ పోస్టులో పోయే వాటి విషయంలో మేము బాధ్యతని స్వీకరించలేము. వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదు.

రచనలు పంపిన వారు తమ చిరునామా మారిన సందర్భంలో వెంటనే ఆ విషయాన్ని మా కార్యాలయానికి తెలియ చేస్తూ ఒక కార్డు రాయటం అవసరం.

ఉత్తరాలు, తదితర పాఠకుల శీర్షికలకి రాసే వారు కూడా తమ పేరు, పూర్తి చిరునామా ఇవ్వాలి. రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే ఉండాలి. లేకపోతే వాటిని పరిశీలించటం జరగదు.

పరిశీలనకి పంపే రచనలని "సంపాదకుడు, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003" అనే చిరునామాకి పంపాలి. కవరు పైభాగంలో శీర్షిక పేరు రాయటం మంచిది.

– సంపాదకుడు

# నాటి పెళ్ళి ముచ్చట్లు

## పెళ్ళిలో నిద్ర

నా స్నేహితురాలు పెళ్ళికి విజయవాడ వెళ్ళాను. ఆమెకు నిద్ర



ఎక్కువ. 'పెళ్ళి పీటల మీద కూడా ఇలాగే నిద్ర పోతావా?' అని జోక్ చేసేవాళ్ళం. తెల్లవారు జామున 3 గంటలకు ముహూర్తం. ఆమె నిజంగానే పీటల మీద నిద్రలో తూలి పెళ్ళి కొడుకు మీద పడబోయింది. పెళ్ళికొడుకు ఆమెను పట్టుకుని పడకుండా ఆపాడు. అక్కడున్న కెమేరాలన్నీ క్లిక్‌మన్నాయి. పెళ్ళి పందిరి నవ్వులమయం అయింది. ఇంతలో ఒక ముసలామె వచ్చి, 'నేను 10 మంది పిల్లల తల్లిని అయినా నా భర్త మొఖమే తెలియదు! అంతా కలికాలం' అంది. ఈ జోక్ విని అంతా విరగబడి నవ్వారు.

టి. వి. విజయకుమారి,
పెదమట్టపల్లి (ఖమ్మం)

★ ★ ★

## అమ్మవారి విగ్రహం

నా వివాహము అయి 40 సం.లు అయింది. 1948 జూన్ 2వ తారీఖున 5 రోజుల పెళ్ళి, ఐదు రోజులు విజయనగరంలో జరిగింది. పెళ్ళి అయిన తరువాత లాంఛనముగా పెళ్ళి కొడుకును, పెళ్ళి కూతురును దైవ దర్శనము చేయించుదామని మా నాన్నగారు ఇంకా కొద్ది మంది ముఖ్యమైన బంధువులు కలసి పెద్ద తిరుపతి, కంచి, కాళహస్తి బయలు దేరాము. తిరుపతిలో దైవ దర్శనము చేసుకుని కంచి చూసి కాళహస్తి గుడి చూడ్డానికని వచ్చాము. సాయంత్రం కాళహస్తి గుడి అంతా చూశాక దేవునికి పూజ చేసుకుని ఇవతలకు వచ్చాక, "నాన్నా! అమ్మవారి విగ్రహము ఎక్కడ వుంది" అని మా నాన్నగారిని అడిగాను. "ఆ ప్రక్కకి వెళ్ళి చూడు, అక్కడ వుంది" అన్నారు. అక్కడకు వెళితే, చీకటి చీకటిగా వుంది. అమ్మవారి విగ్రహము ఎక్కడ వుందా అని చూస్తున్నాను. ఇంతలోకి అక్కడ నుంచి ఒక ఆవిడ రవ్వల దుద్దులు, ముక్కుపుడక, కంచి పట్టుచీర కట్టుకుని సాక్షాత్తు పార్వతీదేవిలా వుంది. ఆవిడ ఇవతలకు వచ్చింది. నాన్నగారు ఆవిడనే



అమ్మవారు అనుకున్నారు. మేమంతా ఆ సంఘటన తలుచుకు తలుచుకు నవ్వుకున్నాము. ఇప్పటికీ మేము ఏదైనా గుడిలోకి వెళ్ళి అమ్మవారు విగ్రహము చూసినప్పుడల్లా నాకు ఈ సంఘటన గుర్తుకు వస్తుంది.

రాయసం రాజ్యలక్ష్మి, తణుకు

---

మారాను. అయిదేళ్ళ అనుభవం వుంది" చెప్పాడు బిళహరి.

సరిగ్గా ఆ సమయంలో ఓ కొత్త వ్యక్తి లోపలకి వచ్చాడు అతన్ని చూడగానే బిళహరి. రమణమూర్తి, ఆదిలక్ష్మి వంక చూసి చెప్పాడు "మీరేం అనుకోకండి" ఒక్క నిముషం బయట వెయిట్ చేస్తారా?"

ఇద్దరూ లేచి బయిటకి వెళ్ళారు. రమణమూర్తి లోపలికి వచ్చిన ఆ వ్యక్తి వంక చూసాడు బయటకి వెళుతూ. లోకంలో అంత సన్నటి వ్యక్తి, అంత నీరసంగా వుండే మనిషి, వుంటాడని ఆయన కలలో కూడా అనుకోలేదు.

"నిన్న మీరు చెప్పిన బ్లడ్ టెస్ట్ చేయించాను డాక్టర్" ఆ కుర్రాడి మాటలు వినపడ్డాయి.

"వెరీ గుడ్. ఏదీ. ఇటివ్వండి"

కొద్ది క్షణాల తర్వాత బిళహరి బయట కూర్చున రమణమూర్తికి వినపడేలా చెప్పాడు.

"నేను వూహించింది నిజమే"

"అయితే ఇది అదే అంటారా?" అడిగాడు పేషెంట్.

"అవును"

"అయ్య బాబోయ్! ఎయిడ్సే?"

"రిపోర్ట్‌లో అలా వుంది. మీ రోగ లక్షణాలు మరోసారి వివరించండి" అడిగాడు బిళహరి.

ఆదిలక్ష్మి తండ్రితో చెప్పింది "కరెంట్ పోయినట్టుంది. ఫేన్ తిరగడం లేదు" కర్చీఫ్‌తో విసురుకుంటూ బయటకి నడిచింది. ఇది వాళ్ళు ముందే అనుకున్న డ్రామాలోని ఓ భాగం.

ఆ గదిలో కూర్చున్న-రమణమూర్తి లోపల నించి వినిపించే సంభాషణని శ్రద్ధగా వినసాగాడు.

"భోజనం చేసి మూడు రోజులయినా ప్రతి అరగంటకి టాయ్‌లెట్‌కి వెళ్ళాలనిపిస్తోంది. గుక్కెడు మంచి నీళ్ళు తాగినా చాలు. కడుపులో వుండక పైకి వచ్చేస్తోంది".

"ఈ రెండు ఎయిడ్స్ వ్యాధి సోకిన వారి ప్రాథమిక లక్షణాలు. మీరుగాని నూ పచ్చడిగాని, తెలగ పిండి కూరగాని ఇటీవల తిన్నారా?" అడిగాడు బిళహరి.

"అవునండి. మీకెలా తెలుసు?"

"అమెరికన్ శాస్త్రజ్ఞులు కనిపెట్టారు ఆ రెంటివల్లా ఎయిడ్స్ వ్యాధి వున్న వాళ్ళకి అది ఎక్కువవుతుందని. మీరు నీరసంగా, డల్‌గా, నిద్రొచ్చిన వాళ్ళకిమల్లే మత్తుగా జోగుతుంటారు కదూ?" అడిగాడు బిళహరి.

"అదేమిటో నండి. రోజుకో ఆరు గంటలు మించి నిద్ర పోయే వాణ్ణి కాను. అలాంటిది ఇప్పుడు ఆరు గంటలు మెలకువగా వుండలేకపోతున్నాను."

"అదీ ఎయిడ్స్ వ్యాధి ప్రధాన లక్షణాల్లో ఒక 'టి' మీరు వద్దన్నా ఖర్చు చేసి బ్లడ్ రిపోర్ట్ తెచ్చారు కాని నాకు ముందే తెలుసు."

"మరి దీనికి మందు?"

"ఇంత దాకా ఎయిడ్స్‌కి ఎక్కడా మందు కనుక్కో లేదు"

"అయ్ బాబోయ్! మరిప్పుడెలా అండి?"

"ఘరీ మందు లేకపోతే బావుండదు" ఊరికెనే అమృతాంజనం రాసుకుని, ఆస్ప్రో వేసుకుంటూండండి"

"ఎలాగండి ఇలాఅయితే?"

"ఫర్వాలేదండి. మరో 'అయిదారేళ్ళలో ఎయిడ్స్ వ్యాధికి మందు కనుక్కోబడుతుందని అంతా అనుకుంటున్నారు'.

"అయిదారేళ్ళే?"

"లేదా ఏడెనిమిదేళ్ళు కూడా కావచ్చు"

"మరి అంత దాకా ఎలా నేను?"

"వూరికే వర్రీ కాకండి. అసలు మీరు అంత దాకా ఎందుకుంటారు? మేగ్జిమమ్ రెండేళ్ళు. అంతే. ఆ తర్వాత వుండాలనుకున్నా వుండరు".

రమణమూర్తి మొహంలో భయం కనబడింది.

## వినాయకరావు పెళ్ళి

"అవును మీకు విదేశాల్లో వుండే ఎయిడ్స్ వ్యాధి ఎలా సోకింది?" బిళహరి కంఠం వినపడింది ఇద్దరికీ.

"నేనసలు సింగపూర్ వెళ్ళకుండా వుంటే బావుండేది డాక్టర్‌గారు" బాధగా వినిపించింది అతని కంఠం.

"అక్కడ సంపాదించారా?"

"అవును మా సినిమా షూటింగ్ సింగపూర్‌లో పెట్టుకున్నాం. నేను మా యూనిట్‌తో పాటు వెళ్ళాను. ముప్పై రెండు రోజులున్నాం మొత్తం. ఒకటి రెండుసార్లుకి మించి కక్కుర్తి పడలేదు".

"అర క్షణం చాలు సుమండి ఇదంటుకోడానికి"

"ఇది" సింగపూర్‌దాకా వచ్చిందని నాకు తెలీదండి"

"సింగపూరేమిటండి. ఇది బాంబే- హైద్రాబాద్ హైవేలో బి.హెచ్.ఇ.ఎల్. దాటాక ఆరో బస్‌స్టాప్ దాకా వచ్చింది".

"అయ్యా బాబోయ్"

"మీలాంటి సింగపూర్ వెళ్ళొచ్చినవాళ్ళే దీన్ని ఎక్సయిజ్ డ్యూటీ కట్టకుండా రహస్యంగా పట్టుకొచ్చారు. మీతో పాటు వెళ్ళిన వాళ్ళలో ఎవరెవరికి ఇలాంటి లక్షణాలున్నాయి?"

"నేనయితే ఎవర్నీ గమనించలేదండి వస్తే గిస్తే మా కామ్‌కి వచ్చి వుండాలి".

"కామ్? సింగపూర్ నించి వచ్చిన నీ గర్ల్ ఫ్రండా?"

"కామ్ అంటే కామేశ్వరరావు అనర్థం. వాణ్ని మేం 'కామ్' అని పిలుస్తాం. తెలుగువాడే".

"మీరిద్దరు ఒకే అమ్మాయి దగ్గరకి వెళ్ళారా?"

"అవునండి. బింగ్ డాంగ్ అనే చైనీస్ అమ్మాయి దగ్గరకి వెళ్ళాం."

"అదీ సంగతి".

"దీనికి మంచి మందేమయినా వుంటే ఇవ్వండి" దీనంగా అడిగాడు అర్భకుడు.

చిన్నగా నవ్వి చెప్పాడు బిళహరి.

"నీకో నిజం తెలుసా బ్రదర్? మన దేశంలో తయారయ్యే మందుల్లో సగ భాగం కిటికీల్లోంచి బయటికి గిరాటేయదగ్గవి. కాని పక్షులు వాటిని తింటాయన్న భయంతో నేనందుకు కృషి చేయడం లేదు. చాలా జబ్బులకి మందులు లేవు. ఉన్నాయనుకుంటారు పేషెంట్లు ఉన్నాయని నమ్మిస్తారు డాక్టర్లు."

"అంటే ఎయిడ్స్ వ్యాధికి మందే లేదంటారా?"

"ఇంతదాకా ఏ ఒక్కడూ కనిపెట్టలేకపోయాడు. సహాయం లేని ఆ వ్యాధికి ఎయిడ్స్ అని పేరు పెట్టడం తమాషా అని ఎన్నోసార్లు అనుకున్నాను" చెప్పాడు బిళహరి.

"మరి నా గతేమిటి?"

"అది మెడికల్ హిస్టరీ అవుతుంది. నాకు తెలీదు. రమణమూర్తికి ఆ రోగి మీద జాలి కలిగింది.

"నువ్వింకో పని చెయ్యాలి" చెప్పాడు బిళహరి.

"ఏమిటి?"

"నీ ఫ్రండ్‌కి ఈ లక్షణాలున్నా ఈ విషయం చెప్పద్దు. అదే నువ్వతనికి చేసే సహాయం. లేకపోతే దిగులుతో ఇంకాస్త ముందుగానే చస్తాడు.

"అలాగే"

"మీకు కంగ్రాచ్యులేషన్స్" చెప్పాడు బిళహరి బయటికి వెళ్ళబోతున్న ఆ పేషెంట్‌తో.

"దేనికి?" అడిగాడతను గుమ్మం దగ్గర ఆగి.

"దేముడికి కృతజ్ఞతలు చెప్పుకోండి. మీది ఎయిడ్సే కాని కేన్సర్ కాదుగా దానికి మందు లేదు కాని ఎలాంటి సుఖం పొందకుండా వచ్చే మాయదారి జబ్బది. మీరు రవ్వంత సుఖపడనయినా పడ్డారుగా."

రమణమూర్తి బయటికి వచ్చిన ఆ వ్యక్తి వంక చూసి అడిగాడు.

"బాబు ఇందాక మీరు చెప్తున్న కామేశ్వరరావు అంటే..."

అతను రమణమూర్తి మాటలని వినకుండా, కర్చీఫ్‌తో కళ్ళని తుడుచుకుంటూ వేగంగా బయటికి నడిచాడు. చిన్నగా నిట్టూర్చాడు రమణమూర్తి. అతను బయటికి వెళ్ళిన కొద్ది క్షణాల్లో లోపలకి వచ్చింది ఆదిలక్ష్మి. ఇద్దరు బిళహరి దగ్గరకి వెళ్ళారు.

బిళహరి రమణమూర్తితో చెప్పాడు.

"డాక్టర్లు మరీ హారిబుల్‌గా తయారయ్యారండి. తమకి తెలియని రోగాలకి, తమకు తెలియని మందులని రాసేస్తుంటారు. అందుకనే డాక్టర్ల కోసం ఈ లోకంలో కంటే నరక లోకంలో ఎక్కువమంది శత్రువులు ఎదురు చూస్తుంటారు".

చిన్నగా నవ్వింది ఆదిలక్ష్మి ఆ మాటలకి.

"మీ అమ్మాయిది మామూలు నలతే కదా?" అడిగాడు రమణమూర్తి అనుమానంగా.

"మీరేం ఇదవకండి. చాలా చాలా మామూలు నలత. దీని పేరు... ఆ చాలా చాలా మామూలు నలత పేరు... ప్రేమ... పేరెందుకులెండి. లో ఫీవర్ హై బి.పి. లాంటిదిది. మందిస్తాను. ఒక్క పూటలో తగ్గుతుంది"

ఓ పొట్లంలో నాలుగు హటారి చాక్‌లెట్స్ కట్టిచ్చి చెప్పాడు ఆదిలక్ష్మితో.

"ఒకటేసుకుని చప్పరించండి. అదవగానే ఇంకోటి ఇలా నాలుగు తిన్నాక కాసిన్ని మంచినీళ్ళు తాగండి. తగ్గిపోతుంది".

"థాంక్‌యూ డాక్టర్. మీ అంత ఫ్రాంక్‌గా ఏ డాక్టరూ వుండడంటే నమ్మండి" చెప్పాడు రమణమూర్తి.

"ఫీజ్ పది రూపాయలు" చెప్పాడు బిళహరి.

రమణమూర్తి అతనికి పది రూపాయల నోటిచ్చి లేచాడు.

ఇద్దరు బయటికి నడిచాక మళ్ళీ బిళహరి తన నుదుట పట్టిన చమటని తడుచుకున్నాడు. స్కూటర్ స్టార్టయిన చప్పుడు వినిపించిన రెండు నిముషాల్లో వచ్చారు మిత్రులిద్దరూ.

"సక్సెసా? అంతా నే చెప్పినట్టే చేసావుగా?" అడిగాడు శాస్త్రి అతన్ని.

"ఆహా"

"వెరీ గుడ్ ఈ పథకం విజయవంతం అవుతుందని ఆశిద్దాం" చెప్పాడు వినాయకరావు.

"ముందర బయట వున్న ఆ బోర్డు తీసేయండి. ఏ టైఫాయిడ్ రోగో, ఆస్తమా పేషెంటో వస్తే ఛస్తాను" చెప్పాడు బిళహరి.

"ఎవరొచ్చినా హటారి చాక్‌లెట్స్ ఇచ్చిపారెయ్ కొన్ని మందుల్లా వంటికి

ఇటీవల బొంబాయి ఆంధ్ర మహా సభ, జింఖానాలో భరత నాట్య ప్రదర్శన చేసిన కుమారి శ్రీలత కొండూరికి సంస్థ అధ్యక్షులు శ్రీ వై. వి. యస్. యస్. భాస్కరరావుగారు జ్ఞాపికను బహూకరిస్తున్న దృశ్యం.



# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతో బాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించీ




4 మాసాలు నించీ




6 మాసాలు నించీ

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం ఎంతో రుచికరం

RK SWAMY/TSL/3112/TEL

ఎలాంటి హాని చేయవు" చెప్పాడు శాస్త్రి నవ్వి.

"మన పథకంలో ప్రథమాంకం అయింది ఇంకా ద్వితీయాంకం వుందిగా" చెప్పాడు వినాయకరావు.

"అది ఆటోమేటిక్‌గా సక్సెస్. ఎవరూ ఇంత శ్రమ పడక్కర్లేదు. సరయిన సమయానికి సరయిన మాత్రలు కామేశ్వరరావు చేత మింగిస్తే చాలు"

"ముందీ స్టేజ్ డెకరేషన్ తీసేయాలి. మా ఇంటాయన చూస్తే గొడవ పెడతాడు" చెప్పాడు బిళహరి.

"ఆయన షుగర్ వ్యాధికి కూడా బిళ్ళలు ఇద్దువుగానిలే.. మాట్లాడక" నవ్వాడు శాస్త్రి.

*　　*　　*　　*　　*

వినాయకరావు పేర్కొన్న రెండవ అంకం రమణమూర్తి బిళహరి దగ్గరనించి వెళ్ళిన గంటన్నరకి ప్రారంభం అయింది.

ఆదిలక్ష్మి కామేశ్వరరావుకిచ్చే కప్పు కాఫీలో, శాస్త్రి ఇచ్చిన ఓ మాత్రని పొడి కొట్టి చక్కెరతో పాటు కలిపింది. దాన్ని కనక మహాలక్ష్మి అతనికిచ్చి చెప్పింది.

"టిఫిన్‌కి ఆలస్యం అవుతుంది. కాస్తంత తాగు నాయినా".

కామేశ్వరరావు ఎన్నడూ కాఫీ కాదనడు కాబట్టి తాగాడు. కాఫీ తాగిన పావు గంటకి అతనికి వాంతులు ప్రారంభం అయాయి. నాలుగు రోజుల క్రితం తిన్నదంతా కూడా, ఏదయినా కడుపులో మిగిలి వుంటే, మొత్తం అంచెలంచెలుగా వాంతి అయిపోయింది.

"అరెరె! ఏమైంది?" అడింది కనకమహాలక్ష్మి.

"ఏమో? కాఫీలో బల్లి పడిందేమో?" చెప్పాడు అతను వేలాడిపోతూ.

"అయ్యయ్యో! అర గంటలో బావ ఇలా అయిపోయాడేమిటి? అడిగింది ఆదిలక్ష్మి అమాయకంగా.

వాంతులు తగ్గాక చెప్పింది కనక మహాలక్ష్మి వేడి వేడి గారెలు ప్లేట్‌లో పెట్టి తెచ్చి–

"కాస్తంత ఎంగిలి పడు నాయనా. కడుపులో ఒక్క పిసరు కూడా లేనట్టుంది".

రమణమూర్తి అల్లుడికి ఎదురుగా కూర్చునాడు. ఆయన, కామేశ్వరరావు వాటిని తినసాగారు. రమణమూర్తి తినే గారెలకి చిన్న చిల్లులు, కామేశ్వరరావు తినే గారెలకి పెద్ద చిల్లులు వుండటం ఆ ఇద్దరిలో ఎవరూ గమనించలేదు. గుర్తు కోసం అలా చేసింది కనకమహాలక్ష్మి. కామేశ్వరరావు తినే గారెల పిండిలో ఓ టేబ్లెట్‌ని పొడి చేసి కలిపింది ఆదిలక్ష్మి.

పచ్చి మిరపకాయలు, కరివేపాకు, వుల్లిపాయలు, అల్లం ముక్కలు కలిపి చేసిన గారెలేమో, పైగా ఆకలి మీద వున్నాడేమో, సుష్టుగా తిన్నాడు కామేశ్వరరావు.

రమణమూర్తి ఆలోచిస్తున్నాడు అంత అకస్మాత్తుగా కామేశ్వరరావుకి వాంతులెందుకు వచ్చాయా అని. ఆ మాటే అడిగాడు.

"కాఫీలో ఏదో పడి వుంటుంది మామయ్యా" చెప్పాడు.

"నీవీ మధ్య సింగపూర్ వెళ్ళొచ్చావా?" అడిగాడు రమణమూర్తి కాసేపాగి.

"సింగపూరా! లేదే. ఏం?"

"ఏం లేదు. సినిమా షూటింగ్ కోసం వెళ్లావేమో నని అడిగానంతే."

"సింగపూర్‌లో తీసిన తెలుగు సినిమాలు తక్కువ నేను వెళ్ళలేదు"

మరో రెండు గారెలు వడ్డించడానికి వచ్చిన కనకమహాలక్ష్మి ఆ మాటలు విని చెప్పింది.

"అదేంటి నాయినా నీవు సింగపూర్ వెళ్ళిన సంగతి మర్చిపోయావా? మీనాన్న చెప్పాడే నీవు ఏదో తమిళ సినిమా షూటింగ్ కోసం అక్కడికెళ్లావని.

"ఎందుకు చెప్పాడబ్బా! మా నాన్న అలా అబద్ధం చెప్పడే" చెప్పాడు కామేశ్వరరావు.

"కావచ్చు" చెప్పింది కనకమహాలక్ష్మి.

"అదేమిటి? పూర్తిగా తినకుండా లేస్తున్నావు?" అడిగాడు రమణమూర్తి కామేశ్వరరావు కుర్చీలోంచి లేవడంతో.

రెండు వేళ్ళు చూపించాడు కామేశ్వరరావు.

ఆ తర్వాత ఆవేళ దాదాపు నలభై సార్లు టాయ్‌లెట్‌లోకి వెళ్ళొచ్చాడు కామేశ్వరరావు.

"డిసెంట్రీనా?" అడిగాడు రమణమూర్తి పన్నెండో సారి.

"అలాంటిదే" చెప్పాడు కామేశ్వరరావు నీరసంగా.

వాంతులు, డిసెంట్రీతో గంటలో కామేశ్వరరావు డీలా పడిపోయాడు. రమణమూర్తి గంభీరంగా ఏదో ఆలోచిస్తుండి పోయాడు. ఆయన అలా బుద్ధిగా కుర్చీలో అంత సేపు కూర్చుని ఏదో ఆలోచించడం ఆ కాంపౌండ్‌లోని అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

వినాయకరావుతో చెప్పాడు శాస్త్రి ఆనందంగా.

"చూసావా? రమణమూర్తి సైకాలజీని ఇట్టే పట్టేస్తానంటే నీవు నమ్మలేదు. ఇప్పుడతను తీవ్రంగా ఆలోచిస్తున్నాడు తన కాబోయే అల్లుడికి ఎయిడ్స్ ఏమోనని."

## గడుసులోకం —బాబు



## ధర్మపథం

# జనకుని ఆదర్శం




మిథిలాధిపతి జనకుడు రాజయోగి. అంటే రాజధర్మాలనూ, యోగిధర్మాలను కూడా నెరవేర్చేవాడన్నమాట! యోగులకు తమ యోగనిష్ఠ తప్ప మరొకటి అక్కరలేదు. లౌకిక విషయాలపయి వారి దృష్టి ప్రసరించదు. అలాగే రాజ్యపరిపాలకులకు ప్రజాపాలనపైనీ, రాజ్య విస్తరణపై నీ దృషి వుంటుంది. యోగనిష్ఠపై దృష్టివుండదు. జనకుడు యజ్ఞవల్క్య మహాముని శిష్యుడైనందున ఆయనకు యోగనిష్ఠపైని, ఆధ్యాత్మిక చింతపైన ఆసక్తి ఎక్కువ. ప్రజాపాలన, పండిత సత్కారం మొదలైన ఉత్తమ రాజధర్మాలను పాటిస్తూనే జనకుడుయోగనిష్ఠాపరుడై వుండేవాడు. స్వధర్మాన్ని విడువక ప్రజాపాలన సాగిస్తున్నా, తామరాకు పయి నీటి బిందువువలె నిర్లిప్తుడై వుండేవాడు. యోగనిష్ఠాపరులుకూడా దేశ క్షేమం కోరుతూనే వుంటారు. పూర్వం మహామునులు అడవులలో తపస్సు చేసుకుంటున్నా, తమవద్దకు వచ్చిన ప్రజాపాలకులకు తగిన సలహాలిస్తూ వుండే వారు.

ఆయన ఆదర్శ పురుషుడు. ఆయన తద్దతిని అనుసరించాలి. ఆయన ముక్తికోసం యోగనిష్ఠాపరుడైనట్లే, మనంమానసికజీవనంకోసం ప్రయత్నం చేస్తూ వుండవచ్చు. ఆయన ప్రజాపరిపాలన చేస్తున్నరీతిని మనం ఇతరులకు సహాయం చేయడం ధర్మం. ప్రజా పరిపాలన రాజధర్మమైనట్లే ప్రజోపకారం మానవధర్మం.

ఇట్టివారిలో ఉదార స్వభావం కలవారూ వున్నారు. వారు తమ యోగక్షేమానికి సంకల్పించుకున్న కార్యం నెరవేరినా, నెరవేరకపోయినా – ఆ విషయాన్ని పట్టించుకోక ఇతరులకు వుపకారం చేస్తారు. ఇలాటి త్యాగశీలురు మనదేశంలో నాటికీ నేటికీ కూడా ఎందరో వున్నారు. అట్టివారితో పాటు స్వార్థం కోసం పరులకు హానికలిగించే సంకుచిత స్వభావులున్నూ వున్నారు. అలాటివారి మార్గాన్ని అనుసరించకుండా ఉదారులపద్ధతినే అనుసరించుట ఉత్తమధర్మం.

పెద్దలు ఏమార్గం అనుసరించి నడచినా, అది శ్రేయోదాయకమైన రాజమార్గమని భావించాలి. జనకుడు అట్టి పెద్దలలో అగ్రగామి. మన జీవితం సార్థకం కావాలంటే అట్టివారిని ఆదర్శంగా తీసుకుని నడుచుకోవడం ఉత్తమమైనది.

– బులుసు వేంకటరమణయ్య

"పాపం" చెప్పాడు వినాయకరావు.

రాత్రి భోజనానికి కూర్చున్నాక కనకమహాలక్ష్మి కామేశ్వరరావుతో చెప్పింది ప్రేమగా.

"నాయినా ఇందాకంత వాంతులు, ఆ. తర్వాత మరొకటి. ఎంత నీరస పడిపోయావో. కాస్తంత అన్నం అయినా కడుపు నిండా తిను."

"తింటాను. ఆకలి మండిపోతోంది" చెప్పాడు కామేశ్వరరావు.

బావకి గుత్తొంకాయకూర ఇంకాస్త వెయ్యి" చెప్పింది అదిలక్ష్మి తల్లితో చిన్నగా నవ్వుతూ.

ఆ కూరలో కలిపిన నిద్ర మాత్ర పొడి వల్ల చారన్నం సగం కలుపుకుంటూనే తూలసాగాడు కామేశ్వరరావు. ఎంతో డల్‌గా వుంది అతనికి. హాయిగా పడుకోవాలని వుంది. ఆ మాటే చెప్పి, కంచంలో చెయ్యి కడుక్కుని లేచి వెళ్ళి పడుకున్నాడు కామేశ్వరరావు. వెంటనే నిద్రలోనికి జారిపోయాడు.

"పాపం. బావకి ఏమైందో?" చెప్పింది ఆదిలక్ష్మి.

"వారం క్రితం కూడా ఓ రోజు ఇలాగే అయిందిట. ఇందాక నా దగ్గర చెప్పుకుని వాపోయాడు" అబద్ధం ఆడింది కనకమహాలక్ష్మి:

రమణమూర్తికి బిళహరి చెప్పిన ఎయిడ్స్ వ్యాధి లక్షణాలు గుర్తుకు వచ్చాయి.

వాంతులు, డిసెంట్రీ, డల్‌గా మత్తుగా వుండటం ఆ వ్యాధి ప్రాథమిక లక్షణం.

"ఇలా అయితే ఎలా? బావని డాక్టర్ బిళహరి దగ్గరకి లేపి తీసుకెళ్దామా నాన్నగారు?" అడిగింది ఆదిలక్ష్మి.

"డాక్టర్ బిళహరి దగ్గరకా? వద్దొద్దు" చెప్పాడాయన కంగారుగా.

"మంచి డాక్టరేగా ఆయన? మన ఆది చూడండి నాలుగు బిళ్ళలకి ఎలా తేరుకుందో" చెప్పింది కనకమహాలక్ష్మి.

"ఆ తద్దినం మనకి దేనికి? వాళ్ళ వూరెళ్ళాక చూపించుకుంటాడు" చెప్పాడు రమణమూర్తి కోపంగా.

ఆ మాటలతో 'కామేశ్వరరావుకి ఎయిడ్స్ వ్యాధి' అన్న విషయం తన తండ్రి రూఢిగా నమ్మాడన్న సంగతి గ్రహించింది ఆదిలక్ష్మి.

"అమ్మా శాస్త్రి పథకం అఖండంగా సక్సెస్" చెప్పింది రహస్యంగా తల్లితో.

"క్లయిమేక్స్ ఏ నాటకంకయినా ముఖ్యమే. మీ ఇద్దరికీ పెళ్ళి వద్దు అనిపించాలిగా. సుబ్బలక్ష్మి విషయంలోలా మన నాటకం మొత్తం బయట పడకుండా వుండాలిగా" చెప్పిందావిడ భయంగా. (ఇంకా వుంది)

# గురువులతో మార్పులు- శిష్యులతో అయోమయం

కొన్ని ఏళ్ల క్రింద రష్యాలో లీబర్‌మాన్ అనే ఇంజనీరు- ఆర్థిక నిపుణుడు ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించి పాశ్చాత్య దేశాలలో కొంత సంచలనాన్ని సృష్టించారు. తయారీలో లాభం ఉండాలని ఆయన సూచించారు. అంటే, రష్యాలోనూ స్వేచ్ఛా విపణి వచ్చేస్తోందా?" అని కొందరు అడిగారు. "అదేమీ కాదు, ఉత్పత్తిలో నష్టాలు తగ్గాలని మాత్రమే తాము అంటున్నామ"ని శ్రీ లీబర్‌మాన్ స్పష్టం చేస్తూ ప్రకటనలు ఇచ్చారు. కీ. శే. బ్రెజ్నెవ్ కాలంలో కమ్యూనిస్టు రాజ్యాలు కోకకోలా, పెప్సికోలా, హాలిడే ఇన్, హెర్ట్స్/ అవిస్, బెక్‌టెల్, జనరల్ మోటార్స్, ఫియట్ సంస్థలతో రష్యా మరి కొన్ని కమ్యూనిస్టు రాజ్యాలలోని పరిశ్రమలలో పాలుగొనటం వార్తలలో ప్రముఖంగా కనబడి కొంత ఆశ్చర్యం కలిగించింది.

ఇలాంటి ఆశ్చర్యం నేడు శ్రీ మిఖైల్ గోర్బచేవ్ మొదలుపెట్టిన మార్పుల వలన కలుగుతున్న ఆశ్చర్యం ముందు ఎక్కడ నిలబడగలదు?

చరిత్ర గమనం అంటూ ఒకటి ఉంటుందనీ, దానిని కొన్ని పుస్తకాలు చదివి లేదా కొందరు వ్యక్తుల బోధనలు విని తెలుసుకోవచ్చుననీ, మానవ సమాజం ఎలాగ పరిణామం చెందుతుందో కొందరికి మాత్రమే తెలుసుననీ, కొందరు కార్మికుల పేర నియంతలుగా వ్యవహరించాలనీ, వీరికి మాత్రమే ఏది నిజమో ఏది కాదో తెలియగలదనీ- ఇలాంటి సిద్ధాంతాలని కమ్యూనిస్టులు నమ్ముతారనుకోక తప్పటం లేదు. అంతే కాదు ఇటువంటి సిద్ధాంతాల ఫలితంగా (నే కావచ్చునేమో) రష్యా, చీనా మొదలయిన దేశాలలో వ్యక్తి స్వాతంత్ర్యాలుగా పాశ్చాత్య దేశాలలో గుర్తింపబడేవి ఉండటంలేదు. అధికారంలో ఉన్న వారు చెప్పినట్టు చెయ్యటమే ఒక గొప్ప స్వాతంత్ర్యం అన్న సిద్ధాంతం ఇక్కడ బాగా అభివృద్ధి చెందినదని భావించటంలో తప్పులేదు. సోవియెట్ యూనియన్‌లో ఎక్కడ చూసినా లెనిన్ విగ్రహాలుంటాయి. ఆయన మృతదేహం ఒక పవిత్ర స్థలంగా గౌరవించబడుతూ ఉంటుంది- ఆయన సమాధి వద్ద వివాహాలు చేసుకుంటూ ఉంటారు కూడా. కీ. శే. స్టాలిన్ విషయం సరేసరి-భాషా శాస్త్రవేత్తగా, ఆర్థిక నిపుణుడుగా, సేనాధిపతిగా, సమాజ శాస్త్రవేత్తగా ఆయననిమించినవారు ఉండరని అనేవారు. ఆయన హయాములో ఎందరు వధింపబడ్డారో లెక్కలేదు. ఒక కమ్యూనిస్టు నాయకుడుగా స్టాలిన్ ఫాసిస్టులలో అగ్రగణ్యుడయిన హిట్లర్‌తో ఒప్పందమే చేసుకున్నారు. 1953 తర్వాత అంతా మారిపోయింది. స్టాలిన్ శవాన్ని ఉన్న సమాధి నుంచి తొలగించారు. ఆయన బొమ్మ, పేరు ప్రచార సాధనాలలో కనపడకుండా చేశారు.. ఇవాళ స్టాలిన్ విమర్శ బహిరంగంగానే రష్యాలో జరుగుతోంది.



గోర్బచేవ్



యూరీ ఆంద్రోపోవ్

మార్పుకోరే చీనా నాయకులు డంగ్‌జియావ్ పింగ్, జావ్ జియాంగ్



మావ్‌త్సెడుంగ్ కూడా ఇలాగే స్తుతించబడేవారు. ఆయనకీ స్టాలిన్‌కి పట్టిన గతే పడుతోంది.). దీనంతటికీ వీలు కల్పిస్తున్నది శ్రీ గోర్బచేవ్‌కాకపోతే మరెవరు?

ఇంత చేస్తున్న ఆయన నిలబడగలుగుతారా లేకపోతే కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులు కొందరు ఆయనని తీసివేస్తారా? ఎవరు ఏమన్నప్పటికీ రష్యా ఒక యూరోపు దేశమే. జార్ పీటర్ కాలం నుంచి "ఐరోపీయ ఆధునికీకరణం" అనతగినది కొనసాగుతూనే ఉన్నది. స్వేచ్ఛతో ఆలోచించటం అనే దానిని క్రయిస్తవ మతం పేర నొక్కి వెయ్యటం స్పెయిన్, పోర్చుగల్ దేశాలలో తక్కిన యూరోపు దేశాలలో కన్నా ఆలస్యంగా అంతరించినదని కొందరు అంటారు. తీవ్ర మతవాదులు శాస్త్రవేత్తలని అణచి వెయ్యటం వలన ఈ దేశాలు వెనుకబడ్డాయన్న అభిప్రాయం ఉన్నది. కమ్యూ



కార్ల్ మార్క్స్



వి. ఐ. లెనిన్



ఫ్రెడరిక్ ఎంగెల్స్

నిజమ్ కూడా క్రయిస్తవ మతం వలినేయాడుల- హెబ్రూ తెగల మతాల పరంపరకి చెందినదన్న అభిప్రాయమూ ఉన్నది. (క్రయిస్తవ మతంలో రూపొందిన పవిత్రత్రయం" సిద్ధాంతాన్నిపోలిన సిద్ధాంతం కమ్యూనిజమ్‌లోనూ ఉన్నదని బెర్‌ట్రాండ్ రస్సెల్ చమత్కరించారు- తండ్రి అంటే మార్క్స్, పవిత్ర ప్రేతం అంటే తార్కిక భౌతిక వాదం, మనిషి అంటే లెనిన్ అనుకోవచ్చు అనేవారు; మాస్కోని రోమ్‌తో పోలిస్తే బెయిజిగ్‌ని బిజాంటియమ్‌తో పోల్చవచ్చుననే వారు- క్రయిస్తవులు చర్చి చీలిపోయి ఈ రెండు నగరాలలోనూ రెండు కేంద్రాలుగా కొంత కాలం కొనసాగింది

యూరోపులోని క్రీస్తు పూర్వ మతాలలో లేని నైతిక విలువలు క్రయిస్తవ మతంలో ఉండటం చేతనే అక్కడి సమాజాలలో న్యాయం అన్నది అభివృద్ధి చెందినదనీ; గ్రీసు- రోమ్ నాగరికతల సంప్రదాయాలని అణిచి వెయ్యటం ఆగిన తరువాతనే యూరోపులో విజ్ఞాన శాస్త్రం బాగా అభివృద్ధి చెందటం మొదలు పెట్టినదనీ ఎక్కువ మంది పాశ్చాత్య మేధావులు అంటూ ఉంటారు. కమ్యూనిస్టు నాయకుల పిడివాదం నుంచి బయటపడి రష్యా కూడా యూరోపు సంస్కృతి యొక్క ప్రధాన స్రవంతిలోకి రావాలని కోరుకొనే వారికి శ్రీ గోర్బచేవ్ విధానాలు ఎంతయినా సంతోషం కలిగించగలవు. (ఒక వింత ఏమిటంటే బాగా వెనుకబడి వున్న చీనాలోనే శ్రీ డంగ్ జియావ్ పింగ్ నాయకత్వాన సడలింపు ఉద్యమం మొదలయింది. అయస్కాంతపు దిక్సూచి, కాగితం, అచ్చు వెయ్యటం, గాలిమర, తుపాకిమందు, గాలి పడగలు, (చివరికి సున్నా వాడకానికి కావలసిన భావాలు)- ఇవన్నీ చీనాలోనే ముందు కనిపెట్టబడ్డాయట కాని అది బాగా వెనుకబడి పోయింది. విజ్ఞాన శాస్త్ర వినియోగానికి తగిన ప్రేరణ, దోహదాలు ఉండాలంటారు.)

జోసెఫ్ స్టాలిన్



స్పెయిన్, పోర్చుగల్ దేశాలలో కొన్ని దశాబ్దాలపాటు నియంతృత్వాలు నడిచాయి. చివరికి అవీ ఆధునిక యూరోపు దేశాల వర్గంలో చేరిపోయాయి. అలాగే రష్యాలోనూ జరగదా? అని కొందరు అడుగుతారు. ఫ్రాంకో, సాలజార్‌ల ముందు కూడా స్పెయిన్, పోర్చుగల్‌లు ఆధునిక యూరోపు దేశాలే రష్యా మాత్రం కాదు. అని వీరికి సమాధానం చెప్పేవారు ఉంటారు. ఇలాగ సమాధానం చెప్పే వారిని మరొక ఎదురు ప్రశ్న వెయ్యవచ్చు- ఇరవయ్యవ శతాబ్దం దాకా ఆధునిక పాశ్చాత్య రాజకీయ వ్యవస్థలకి దూరంగా ఉంటూ వచ్చిన భారతదేశంలో కష్టం ఏమీ లేకుండానే అవి (ఆ వ్యవస్థలు) అభివృద్ధి చెందగా లేనిది రష్యాకి కష్టం ఏమిటి? ఈ ప్రశ్నకి మళ్ళీ సమాధానంగా భారతదేశం పక్కనే ఉన్న పాకిస్తాన్, బంగ్లాదేష్‌లని చూపించవచ్చు. ఈ రకం చర్చలకి అంతు ఉండదు. మానవ సమాజంలో అభిప్రాయ ప్రకటనకి స్వేచ్ఛ, వ్యక్తులకి స్వాతంత్ర్యాలు ఉంటే ఆ సమాజంలో అన్ని రకాల నిర్వచనాలకీ సరిపడే అభివృద్ధి అనతగినది సాధ్యం కాగలదు. గురువులు హటాత్తుగా మారిపోతే శిష్యులకి అయోమయంగా ఉండటం సహజం కాని "భావ దాస్యం" వలన వచ్చే ప్రమాదమే అంత.

-గంటి రామలింగం

బ్రెజ్నేవ్



నికిటా క్రుశ్చేవ్



# చిన్నారి బాలల దీన గాధలు

## సృజనాత్మక శక్తిని వెలికితీయాలి



చిన్నారి బాలల భవితవ్యాన్నీ గురించి క్రమబద్ధమైన ఆలోచనలతో వారి జీవనానికి ఉపయోగపడే సరైన విద్యను బోధించి వారిని వివేకవంతుల్ని చేయకల్గితే "నేటి బాలలే రేపటి పౌరుల"నే ఆర్యోక్తి ఉజ్వలంగా ప్రకాశింప గలదు.

కాలచక్ర భ్రమణంలో తల్లిదండ్రుల అజ్ఞానమువల్లనో, వారి నిర్లక్ష్యానికి గురైనందు వల్లనో, ప్రకృతిలో సంభవించెడి అనుకోని విపత్తుల వల్లనో, లేక కటిక దారిద్ర్యము వల్లనో తల్లిదండ్రుల నుండి బిడ్డలు విడిపోయి, అనాధలై, అభాగ్యులై దౌర్భాగ్య స్థితిని, దుర్భర జీవితాన్ని బాల్యంలోనే చవిచూడాల్సి వస్తుంది. ఈ పరిస్థితుల్లో వారిలో కసి, ద్వేషాలు పెరిగి పోతుంటాయి. ఈ సమాజం చుట్టూ ముసురుకొని ఉన్న కుత్సిత వాతావరణానికి తోడుగా, చెడు స్నేహాలకు అలవాటు పడి పోతుంటారు. ఆ పెరుగుతున్న కసి కాస్తా మరింత తీవ్రమై సమాజపు నైతిక విలువల మీద చిన్న వయస్సులోనే తిరగబడే విధంగా చేస్తుంది.

అందుకే దేన్ని లక్ష్యం చేయని మనస్తత్వం ఏర్పరుచుకొని ఎక్కడ కెళ్తున్నారో, ఏం చేస్తున్నారో తెలుసుకోలేక పోతుంటారు. తద్వారా చిరు ప్రాయంలోనే జీవితాల్ని నరకప్రాయం చేసుకుంటున్నారు. వెట్టి చాకిరి చేసే బాల కార్మికులుగా, బాల నేరస్తులుగా కాలం గడుపుతున్నారు. మనదేశంలో మూడుకోట్ల మంది ఇటువంటి దుర్భర పరిస్థితుల్లో మ్రగ్గుతున్నారని అంచనా.



ఇటువంటి తాత్కాలిక అపజయాల వలన అదుపు తప్పి తప్పుదోవ పడుతున్న చిన్నారులపట్ల ప్రభుత్వం చేపడుతున్న పునరావాస ఏర్పాట్లు, ప్రత్యామ్నాయ ఏర్పాట్లు సరైనవిగా ఉండి – చిన్నారుల భవిష్యత్తును తీర్చి దిద్దేటువంటి సంక్షేమ కార్యక్రమాలు చేపట్టగలగాలి.

ఇప్పుడున్నటువంటి "సంస్కరణ శరణాల యాలు" వారిపట్ల "చెరసాలలు" కాకుండా చూడాలి. ప్రస్తుతం నేరాలకు పాల్పడి అబ్జర్వేషన్ హోం లో విచారణ నిమిత్తం ఉన్నటువంటి బాలల్ని పరిశీలించి వారిని సర్టిఫైడ్ స్కూల్స్‌కి త్వరితంగా పంపించి విద్య నభ్యసించే అవకాశాలు కల్పించాలి. ఈ విధమైన చర్యలతో వారి యొక్క నైతిక ప్రవర్తనలో మార్పును తేవాలి. దీనికి తోడుగా ప్రముఖ స్వచ్ఛంద సంస్థలన్నీ చిన్నారుల పట్ల సానుభూతితో, వారికి సాంస్కృతిక, కళారంగాలలో పోటీలు నిర్వహించి – వారిలో స్నేహశీలత, ప్రేమానురాగాల్ని పెంపొందించి, వారుకూడా, ఆట పాటలలో, చదువు సంధ్యలలో కాలం గడుపుతున్న పిల్లలవలె, మార్పుకోసం ప్రయత్నించాలి.

దేశ సౌభాగ్యానికి మూల స్తంభాల్లాంటి చిన్నారుల భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని, వారిలో లేప్రాయంలోనే అణగారి పోతున్న సృజనాత్మక శక్తిని వెలికితీసి, వారిని చైతన్య వంతులుగా తీర్చి దిద్దడానికి, పరిపూర్ణంగా ప్రయత్నించి నట్లయితే, వారు ఈ భారతావనిలో ఉత్తమ పౌరులుగా ప్రభావితులు కాగలరు.

–పి. గోపాల్, తిరుపతి

★ ★ ★

## కలవారి పాపయినా కష్టాలే!

శిరీషను చూసి చాలా రోజులవుతోంది. అందుకే ఆరోజు పని త్వరగా తెముల్చుకొని శిరీష యింటికి బయలుదేరాను. చాలా రోజుల తర్వాత స్నేహితురాల్ని చూస్తున్నాననే సంతోషంతో రిక్షా దిగి గుమ్మంలోనికి అడుగుపెట్టాను. ఎదురుగా చిన్న పాపకు తల దువ్వుతూ శిరీష కన్పించింది. ఆ దృశ్యాన్నిచూసి నాభృకుటి ముడి పడింది. నన్ను చూడగానే 'శిరి' ఒక్క గెంతులో నన్ను చేరి 'ఎన్నాళ్ళవుతోందే నిన్ను చూసి. యిన్ని రోజులకా రావడం? రా...రా... కూర్చో' అంది. ఇహ వుండబట్టలేక అడిగాను మీ యింటికి బంధువు లెవరయినా వచ్చారా శిరీ అని. 'లేదే ఏం?' అంది మామూలుగానే.

"మరి ఈ పాప... ఎవరూ?" అంతవరకూ నా ప్రక్కనే కూర్చుని కబుర్లు చెప్తున్న 'శిరి' లేచి వెళ్ళి బిక్క మొహం వేసుకొని మా సంభాషణల్నే (అర్ధం కాకపోయినా) వింటూన్న ఆ పాపని ఎత్తుకుని నా ప్రక్కకొచ్చి కూర్చుంది. శిరీష మొహంలో బాధ తాలూకు ఛాయలను చూసి, "ఏవిటే పాప విషయం అడిగితే అలా అయిపోయావ్?" అన్నాను. 'అవునే ఈ పాప పరిస్థితిని విన్న ఎవరికైనా బాధగానే అన్పిస్తుంది' అంటూ ఇలా చెప్పింది.

'ఈ పాప పేరు వనజ. ఈ అమ్మాయి పుట్టిన కొద్ది రోజులకే వీళ్ళ అమ్మ అనారోగ్యంతో చనిపోయింది. వీళ్ళ నాన్నమ్మావాళ్ళు లేనివాళ్ళేమీ కాదు. కానీ ఈ పాప పుట్టగనే తల్లిని పొట్టన పెట్టుకున్న నష్ట జాతకురాలనే మూఢ నమ్మకాన్ని వాళ్ళు మనసులో పెట్టుకొని పాప బాధ్యతనంతా ఆయాకి అప్పగించారు. శ్రద్ధాసక్తులులేని ఆయా పెంపకంలో పాప స్థితి దీనంగా తయారయింది. పనిమనిషి పాప గురించి రోజూ చెప్తుండేది. ప్రక్కయిల్లేకదా! ఓరోజు యిక్కడికి తీసుకురమ్మన్నాను. ఆ యింట్లోవాళ్ళను ఒప్పించి తీసొచ్చింది. చింపిరిజుట్టు, మాసిన బట్టల్తో భయం భయంగా నిలబడింది. దగ్గరకు పిల్చి భయాన్ని పోగొట్టి, టిఫిన్, పాలు యిచ్చాను. తలకు నూనె రాసి, తల దువ్వి జడ వేసి పంపాను. అప్పట్నుండీ స్కూలుకి ఎప్పుడు సెలవు యిచ్చినా యిక్కడికి పరిగెత్తుకుంటూ వస్తుంది.

అన్నట్టు ఈ విషయం చెప్పలేదుకదూ! వీళ్ళ స్కూల్లో టీచర్ పాపని బాగా కొడ్తుందట. క్లాసు పుస్తకాలు, నోట్సులు ఒక్కటీ సరిగా వుండవని. పాపని తీసుకురావడాన్కి వెళ్ళే రిక్షావానికి ఆ టీచర్ రోజూ చెప్తుందట పాప విషయంలో 'పేరెంట్స్'ని శ్రద్ధ తీసుకోవలసిందని. అయినా వాళ్ళు పట్టించుకోరు. పాపం ఆ టీచర్‌కి తెలీదుకదా! పాప దీనస్థితి.

చూడు వేణీ! చిన్న పిల్లలు దేవునితో



సమాన మంటారు. తల్లిలేని కారణంగా మూర్ఖంగా ఆలోచించే యిలాంటి మనస్తత్వాలమధ్య ఈ చిన్నారి ఎంతగా నలిగిపోతుందో!' అంటూ అమాయకంగా శిరీష వళ్ళో కూర్చుని మా వంకే చూస్తోన్న పాప కేసి చూస్తూ చెప్పింది.

-తోకచిచ్చు పద్మ,
పాతపాడు (కృష్ణా)

★ ★ ★

పాపలు మంచికి రూపాలు, దేవుని గుడిలో రూపాలు. మచ్చలేని మాణిక్యాలు. ముచ్చటైన అరవిందాలు, కరుణకు ప్రతిబింబాలు. కనిపించే దేవతలుగా మనం తలపోస్తుంటాం–

జాతి ఔన్నత్యానికి, భావి ప్రగతికి, దేశ అభ్యుదయానికి నాందీ వాక్యం పలికే భావి పౌరులు. వారి భవిష్యత్తు పూలబాట కావాలని, అడుగంటి పోరాదని మనం కోరుకుంటాం.

కాని–

బాలల బంగారు భవిష్యత్తు మొగ్గలోనే వసివాడి పోతున్నది. దానికి కారణం నేటి సామాజిక పరిస్థితులు, సినిమాలు, అసభ్యకర వాతావరణం అంటే అతిశయోక్తి కాదను కుంటాను. ఒక ప్రక్క బీదరికపు రక్కసి కోరల్లో అభంశుభం తెలియని పండంటి జీవితం ముక్కలై పోతుంటే, మరొక ప్రక్క అవసరానికి మించిన ధనం వల్ల, చెడు సావాసాలకు లోనై, పాడై పోతున్న బాలురు ఎందరో ఇంకెందరో!

అటు పైకి ఎదగలేక, ఇటు బీదస్థితిలోను గడపటం ఇష్టం లేక రెండింటి బ్రతుకుల మధ్య సతమతమవుతూ జీవిత నావను గమ్యం చేర్చాలని తాపత్రయపడే మధ్యతరగతి కుటుంబాలలో పిల్లలపై పెంచుకున్న ఆశలు, ఆశయాలు, కోర్కెలు, నేటి కులమత రాజకీయ దురంతాలలో చిక్కి, శల్యమై, చదివిన చదువుకు ఫలితం లేదని తెలిసి వక్రమార్గాలలో గతితప్పి తిరుగాడు బాలుర బ్రతుకులు ఎన్నో, మరెన్నో.

## మన మనసుల కల్మషాన్ని కడగాలి

విజ్ఞానాన్ని పంచి పెడతాయని కాలేజీలో చేరితే, ప్రేమాయణాల్ని వల్లె వేసి, ఊహాగానాల్లో జీవితం అంటే పూలబాటని, యౌవనం ఒక ఆటగా తీసుకొని బంగారు భవిష్యత్తును సంస్కారహీనంగా తయారు చేసికొని, బయట ప్రపంచంలో అడుగు పెట్టి, నిరుద్యోగ సమస్యల వలయంలో కొట్టు మిట్టాడుతూ, ఇక చేయగల్గింది ఏమీలేక, టెర్రరిస్టులుగా, విప్లవ వీరులుగా, తయారవుతున్న దుస్థితి నేడు మనం చూస్తూనే ఉన్నాం–.

స్వాతంత్ర్యం వచ్చి 40 సం. అయినా మనం సాధించింది ఏమిటి? భారత ఔన్నత్యాన్ని పెంపొందించలేని వ్యవస్థ. సంస్కారాన్ని నేర్పలేని విద్యా విధానం, ధనవంతుడు మరీ ధనవంతుడై, బీదవాడు మరీ దిగజారిన సాంఘిక పరిస్థితులు, తల్లిదండ్రుల పెంపక లోపం, స్వచ్ఛంద సంస్థల కృషిలోపం, ఆచరణలో శూన్యం అభ్యుదయం పండని మాన్యం లాంటి ప్రణాళికా విధానం–




చాచా నెహ్రూ ఆశలు, బాపూజీ కన్నకలలు, నెరవేరాలన్నా బాలల భవిష్యత్తు బంగారుబాట కావాలన్నా మనం – మన మనస్సుల కల్మషాన్ని కడిగి, ప్రతి వ్యక్తి సత్సాంగత్య, సత్ప్రవర్తన, సద్విశ్వాసం, నేర్చుకొన్న నాడు, మంచికి విలువ నివ్వగల్గిననాడు, చిన్నారి బాలల దీనగాథలకు స్వస్తి పలికినవార మవుతాము–

–మాచిరాజు వేణుగోపాల్,
అమరావతి

ఈ శీర్షికని ఇంతటితో నిలిపి వేస్తున్నాము సం.

కళ్ళాళ్ళు
లెక్చరర్లకు జీతాలు పెరిగాయి కదా..

ట్యూషన్లు చెప్పటం మానేస్తారనుకున్నా..
మరి!

పెరిగిన జీతంతో స్టేటస్ పెరిగిందట..

అందుకని ట్యూషన్ ఫీజులు పెంచేశారు..

ఆదూరి సావిత్రి

# ఇచ్చట కోడళ్ళు తగలబెట్టబడుదురు!

"ఇచ్చట కోడళ్ళు తగల బెట్ట బడుదురు!"

ఆ బోర్డు చూసి టక్కున ఆగిపోయాడు రావణుడు....

ఆశ్చర్యంగా తలెత్తి మళ్ళీ చూశాడు. తను పొరబడలేదు. అదే బోర్డు!

కుతూహలంగా లోపలికి నడిచాడతను. లోపలంతా చాలా బిజీగా ఉన్నారు. ఆడ, మగ కలిసి పనిచేస్తున్నారు. పర్సనల్‌గా కలుసుకుని మాట్లాడే కస్టమర్స్ .... ఫోన్లమీదే డీలింగ్స్ సెటిల్ చేసుకునేవాళ్ళు ఆ ఆఫీస్‌లో వాళ్ళను ఊపిరి తిప్పుకోనివ్వటం లేదు....

ఖరీదైన బట్టలు, ఒంటి నిండా ఆభరణాలతో ఉన్న రావణుడి దగ్గరకు ఒకతను వచ్చి "మీకేసు ఎన్నిలక్షలు?" అన్నాడు.

"కేసు ఎన్ని లక్షలేమిటి? అసలు మీ ప్రొప్రయిటరు ఎవరు? నాకింకా వివరాలు కావాలి." అన్నాడు రావణుడు.

"ఆ గదిలో ఉన్నారు వెళ్ళండి. మీరెప్పుడూ మా సంస్థ గురించి వినలేదా?"

"లేదు".

"ఆశ్చర్యంగా ఉందే! దాదాపు భారత దేశమంతా శాఖోప శాఖలుగా విస్తరించి ఉంది మా సంస్థ. దీని గురించి తెలియని వాళ్ళు కూడా ఉన్నారని మేము కలలో కూడా ఊహించలేదు. ఈ సంస్థ ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కువ పాప్యులారిటీ పొందింది. దీనికి మరీ పుట్టిల్లు లాంటి ప్రదేశం మూర్ఖాపురం. అమాటకొస్తే.... ఆంధ్రప్రదేశ్ అంతా దీనికి పుట్టిల్లే."

"ఈ సంస్థ చేసే పనులేమిటి?"

"పనులేం లేవు. కేవలం .... సలహా లివ్వటం. అంతే."

"ఏ పనీ లేకుండా.... ఊరికే సలహాలు మాత్రమే ఇచ్చే ఈ సంస్థ ఇంత ప్రాచుర్యాన్ని పొంది, భారత దేశమంతటా విస్తరించిందా!"

"ముందిది చెప్పండి. మీరెక్కడి నుంచొచ్చారు?"

"మాది ఈ ప్రదేశం కాదులెండి. నా పేరు రావణుడు. లంకేశ్వరుడు అని కూడా అంటారు." అన్నాడు రావణుడు సంకోచంగా.

"అంటే..... రాముడి మిసెస్ సీతాదేవిని ఎత్తుకు పోయింది మీరేగదూ?"

"ఔ......ను."

"ఇందులో అంతగా సిగ్గుపడాల్సిందేం లేదులెండి. ఇప్పుడిక్కడ అంతంత చిన్న విషయాలు గురించి ఎవరూ పట్టించుకోరు. పూర్తి బిజినెస్ గొడవల్లో తలమునకలై ఉన్నారు జనం".

"ఇంతకూ ... ఇదేం బిజినెస్సో చెప్పనేలేదు."

"మా ప్రొప్రయిటర్ గారిని కన్సల్ట్ చెయ్యండి. అదిగో.... ఆ రూంలో ఉన్నారు."

*　*　*　*　*

"హలో! నాపేరు రావణుడు."

"కూర్చోండి. బైదిబై.... నా పేరు వరప్రసాద్. ఈ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ని. ఇంతకీ మీరు ఏ రాష్ట్రానికి చెందినవారు?"

"లంక".

"అలాగా! మా సంస్థ అవసరం మీ లంకకు కూడా ఏర్పడిందన్నమాట. అక్కడ కూడా ఓ బ్రాంచి ఓపెన్ చేస్తాంలెండి. ఏనీ హౌ... మీ కేసు ఎన్నిలక్షలది?"

"కేసేమిటి... లక్ష లేమిటి? అసలు మీరు చేసే పని ఏమిటి? దేనిగురించి? వివరంగా చెప్పండి ముందు."

"ఓకే! జాగ్రత్తగా వినండి. ఇదొక అద్భుతమైన బిజినెస్. నయాపైస కూడా పెట్టుబడి పెట్టక్కర్లేదు. మగపిల్లల తల్లిదండ్రులు మాత్రమే ఈ బిజినెస్‌కు అర్హులు. బిజినెస్ కూడా .... వెరీ సింపుల్...

మొదట మీ అబ్బాయికి లక్షరూపాయల కట్నంతో పెళ్ళి చేస్తారు.... మీ కెపాసిటీని బట్టి అంతకన్నా ఎక్కువకావచ్చు... తక్కువకావచ్చు. కట్నం తక్కువయినా ఎక్కువయినా బిజినెస్‌లో ప్రాఫిట్ తప్ప ... లాస్ అనేది ఉండదు...

ఆ లక్షలో నుంచి పెళ్ళి ఖర్చుకు ఓ పాతిక వేలు తీసుకుని, మిగిలిన డెబ్బయి అయిదు వేలూ బ్యాంకులో వేసుకుంటారు. పెళ్ళయ్యాక, కోడల్ని కాపురానికి తీసుకొస్తారు. అక్కడి నుంచి ఆ అమ్మాయిని శోధించటం మొదలెట్టాలి. "మా అబ్బాయికి మూడు లక్షలు కట్నం ఇస్తామని ఎందరెందరో వచ్చారు. మా ఖర్మకాలి.... మా నెత్తి మీద ఏదో శని కూర్చుని ఉండబట్టి... ముష్టి లక్షరూపాయలకు నిన్ను చేసుకున్నాం. ఆ కృతజ్ఞతయినా ఉండాలి గదా మీ బాబుకి? మరీ ఇంత ముదనష్టం అనుకోలేదు. వెళ్ళు. ఏం చెపుతావో... ఎలా తెస్తావో.... మీ బాబునడిగి కనీసం ఇంకో లక్షయినా లాక్కురా. ఇల్లు అమ్మెయ్యమను..... ఇంట్లో సామాను తాకట్టు పెట్టమను..... అప్పు తెమ్మను.... ఎలాగన్నా చావమను. మాకు మాత్రం ఇంకో లక్ష కావాలి". అంటూ కోడల్ని తిండి తిన నివ్వకుండా ... నీళ్ళు తాగనివ్వకుండా హింసించటం... మాటి మాటికీ పుట్టింటికి తరమటం లాంటి నాటకాలు ఓ ఆరు నెలల పాటు సాగనివ్వండి....

ఆ తరువాత.... ఓ శుభముహూర్తం చూసి కోడలి మీద ఒక డబ్బాడు కిరసనాయిలు గుమ్మరించి అగ్గిపుల్ల గీసి పడేసి, బాగా అంటుకుని మండటం ప్రారంభించాక అప్పుడు మీరు కూడా భార్యా బిడ్డలతో కలిసి కోరస్‌గా "అయ్యయ్యో! మా కోడలు కిరసనాయిలు పోసి అంటించుకుంది నాయనో. బంగారమంటి పిల్ల దేముడోయ్.... వచ్చి రక్షించండి అయ్యలారా... అమ్మలారా...." అంటూ అరుపులూ, శోకాలు మొదలెట్టండి....

ఆస్పత్రికి తీసికెళ్ళే సరికే ప్రాణాలు పోతాయి...

ఆ తరువాత కేసు స్మూత్‌గా నడవటానికి, మీరు ఏ పాపమూ ఎరుగని నిర్దోషులని రుజువు చేసుకోటానికి ఓ నలభై వేలు.... మాగ్జిమమ్ నలభైవేలు ఖర్చవుతుంది మా ఫీజుతో సహా...

ఇంత క్రితం మీరు బ్యాంకిలో వేసిన డెబ్భైఅయిదు వేలల్లో ఈ ఖర్చు కూడా పోగా మీకు ముప్పై అయిదువేలు లాభం.

ఏడాది తిరక్కుండానే మీ అబ్బాయికి... ఇంకో డెబ్భైవేలు... మినిమమ్ డెబ్భైవేలు కట్నంతో ఇంకో భార్య.... ఐ మీన్ మీ ఇంటికి ఇంకో కోడలు వస్తుంది. ఈ సారి ... మనసు బాగోలేదని వంక పెట్టి పది వేలతో పెళ్ళి ఖర్చు ముగించండి.

అప్పటికి మీకు నికరలాభం తొంభై ఐదువేలు! మాగ్జిమమ్ కాదిది మినిమమ్ ఫిగర్ చెప్పానంతే. మీకు ఇంకాస్త్రోమతుంటే.... మీ లాభం ఇంకా పెరుగుతుంది.....

పెట్టుబడి లేని వ్యాపారం. వేల మీద.... లక్షల మీద లాభం. ఇప్పుడు చెప్పండి. మీ కెంత మంది అబ్బాయిలు? ఏం చేస్తున్నారు? మీ ఆస్థులెంత?" అన్నాడు వరప్రసాద్.

"మైగాడ్! మైగాడ్! ఎంత దారుణం!" గుండెలు బాదుకుంటూ అన్నాడు రావణుడు.

"ఏమిటి దారుణం?"

"నేను ఒక ఆడ పిల్లని..... కనీసం తాకనయినా తాకకుండా... ఎత్తుకెళ్ళానని నన్ను అందరూ దుమ్మెత్తి పోశారు. ఆమె ఒంటి మీద చెయ్యి కూడా వెయ్యలేదు నేను. నా ముచ్చట చెల్లించమని అర్థించాను... బెదిరించానే గానీ బలాత్కారంగా ఏమీ చెయ్యలేదు. అయినా మీరంతా నన్ను యుగ యుగాలుగా శాపనార్థాలు పెడుతూ వచ్చారు. ఆడదాన్ని గౌరవించలేని మూర్ఖుడిని అన్నారు.

మరిప్పుడిదేమిటి? ఒక అమాయకురాలైన ఆడపిల్లని సజీవంగా దహనం చేస్తున్న మీరు నాకన్నా ఏం ఉన్నతులు? నాకన్నా నికృష్టులు కారామీరు?"

"ఎంత మాత్రం కాదు. నీకూ మాకూ ఓ ముఖ్యమైన తేడా ఉంది. నువ్వు పరాయి వాడి పెళ్ళాన్ని మోసగించి ఎత్తుకొచ్చావు. అందుకే ఆవిడ మొగుడు చేతిలో చావు దెబ్బతిన్నావు. మేము అలాంటి దొంగ పన్లు చెయ్యటల్లేదు. ఒక ఆడపిల్ల వరకట్నంతో సహా మా ఇంటి కోడలయ్యాక.... అంటే.... పూర్తిగా మా సొత్తుగా మారాకనే మేము ఆమెను తగలేస్తున్నాం. అన్ని హక్కులూ పొంది ఉన్న వాళ్ళంగనక, ఆమెను ఏం చేసుకోటాని కయినా మాకు అధికారముంది."

"మరి ... మానవత్వం లేకుండా.... " నసుగుతున్నట్లుగా అన్నాడు రావణుడు.

"మానవత్వ మేమిటి? ఇదొక అలవాటు. ప్రస్తుతం ఇది అందరికీ అలవాటయిన ఆచారం. ఆచారాన్ని పాటించటంలో తప్పులేదు....

ఒక గొర్రెను.... బ్రతికున్న గొర్రెను గ్రామదేవతకు బలి ఇస్తారు. అది కొందరి ఆచారం. దాన్ని పాటించటం విషయంలో వాళ్ళ నెవరూ ఏమీ అనరు. అమ్మవారి ఎదురుగానే అనుకో.... బ్రతికున్న గొర్రెను అమాంతం తలను తెగనరికి పారేస్తారు వాళ్ళు. అంత మాత్రాన వాళ్ళకు మానవత్వం లేదని అనగలమా? ముందుగా వాడు ఆ గొర్రెను కొని, స్వంతం చేసుకున్నాక ఇహ దాన్ని ఏదయినా చేసుకోవచ్చు.



## "ఇచ్చట కోడళ్ళు తగలబెట్ట బడుదురు!"

అలాంటిదే ఇది కూడా." అన్నాడు వరప్రసాద్.

"గొర్రె, ఆడపిల్ల ఒకటేనా?"

"ఎందుకు కాదు? దానికీ ప్రాణముంది.. దీనికీ ప్రాణముంది. బాధ, భయం ఎవరి విషయంలో నయినా ఒకటే."

"ఎంత నీచానికి దిగజారి పోయారు మీరు! దీన్ని, మిగిలిన ఆడవాళ్ళు చూస్తూ ఊరుకుంటున్నారా? మీకేవో న్యాయస్థానాలు... శిక్షలు అంటూ ఏవేవో ఉన్నాయి కాబోలు..."

"నీకు మా దేశపు ప్రజల సంగతి నేనెంత చెప్పినా అర్థం కాదుగానీ.... ఓ చిన్న సంఘటన చూపిస్తానురా. అన్నీ స్వయంగా తెలుసుకుందువుగాని."

"సరే పద."

★ ★ ★ ★ ★

"అమ్మా! నేను మా అత్తగారింటికి వెళ్ళను. నన్ను బలవంతాన అక్కడికి పంపొద్దు.-వాళ్ళు ... వాళ్ళు రాక్షసులు." వెక్కి వెక్కి ఏడుస్తూ అన్నది ఉష.

"అలా అంటే ఎలాగమ్మా! నువ్వు అత్తారింటి కెళ్ళకుండా ఇక్కడే ఉండి పోతే ఇరుగూ పొరుగూ దగ్గర .... మన వాళ్ళందరి దగ్గర పరువు పోతుంది. తల ఎత్తుకు తిరగలేం. మా అమ్మవికదూ!ఎలాగోలా సర్దుకోమ్మా." అంటూ బ్రతిమాలుతోంది ఉష తల్లి.

"వాళ్ళు నన్ను బ్రతకనివ్వరు. ఇరవై నాలుగ్గంటలూ గొడ్డు చాకీరీ చేయించుకుని, ఒక్క ముద్ద అన్నం పెట్టటానికి లక్ష తిట్లు తిడతారు. నా మొగుడు నన్ను తలుపు సందుల్లో వేళ్ళు పెట్టమని, తలుపు బలంగా వేసి నొక్కుతాడు. ఇదిగో చూడమ్మా, వేళ్ళనిండా పుళ్ళు! గరిటె కాల్చి ఒంటినిండా వాతలు పెడతారు. ఆ హింసనంతా నేను భరించలేను. ఈ సారి డబ్బు తేకుండా వస్తే చంపేస్తామని చెప్పారు వాళ్ళు. నేను ఇక్కడే ఉండి ఏదయినా ఉద్యోగం చేసుకుని బ్రతుకుతాను....."

"అయ్యో వద్దమ్మా! నువ్విలా చేస్తే ఇహ నీ చెల్లెళ్ళకు పెళ్ళిళ్ళు కావు. నలుగురిలో పరువు పోతుంది. డబ్బు ఎలాగోలా నెమ్మదిగా సర్దుతామని చెప్పు. నువ్వు వెళ్ళమ్మా!"

"నా ప్రాణంకన్నా మీకు పరువే ఎక్కువా?"

"అది కాదే తల్లీ! నీ చెల్లెళ్ళకు పెళ్ళిళ్ళు....."

"సరే వెడతాలే". నిర్లిప్తంగా అన్నది పద్దెనిమిదేళ్ళ పుత్తడి బొమ్మ ఉష.

★ ★ ★ ★ ★

"ఏమే! డబ్బుతెచ్చావా?" ఉగ్రంగా అన్నది మహంకాళి.

"లేదత్తయ్యా! వాళ్ళదగ్గర లేదుట." అన్నది ఉష.

"లేదా? అయితే నువ్వా అక్కడే చావక పోయావా? మళ్ళీ ఇక్కడి కెందుకు తగలడ్డావు?" మూలగా ఉన్న కర్ర అందుకుని ఉషని చచ్చేలా కొడుతూ అన్నాడు ఆమె భర్త మోహన్.

"నన్ను కొట్టి చంపకండి. కట్నం రూపంలో కొంత డబ్బు మొదటే తెచ్చాను. నా కన్నా మీకు డబ్బే ఎక్కువా? నేనూ, నా సర్వస్వం మీవి. ఇంకా మీకు...." వెక్కిళ్ళమధ్య అన్నది ఉష.

"ఏడిశావ్‌లే బోడీ! నువ్వా నీ సర్వస్వం ఎవడిక్కావాలే! నిన్ను చంపి పారేస్తే ఇంకో ఆడపిల్ల ఫ్రెష్‌గా వచ్చి దాని సర్వస్వం నావే నంటుంది. తెలుసా?"

"ఇహ దీనితో లాభం లేదురా! ఎన్ని తన్నినా డబ్బులు రాలవు. నువ్వో సారి ఇలారా!" అన్నది మహంకాళి.

మోహన్, మహంకాళి, ఆమె కూతురు దుర్గ, చిన్న కొడుకు జగ్గూ అంతా ఓ చోట సమావేశమయి రహస్యంగా చర్చలు జరిపి, బ్యాంకు నుంచి కొంత డబ్బు డ్రా చేసి రెడీగా ఉంచారు....




### భేదం

జవసత్వాలు
ఉడిగిన
మనిషిని
ఊరు
పొమ్మంటుంది!
చేత
రూకలు
లేని
వ్యక్తిని
కాడు
రమ్మంటుంది!

—బచ్చు వీర్రాజు

ఇల్లంతా ప్రశాంతంగా ఉంది.....

ఆదమరచి నిద్రపోతున్న ఉష కెవ్వున అరిచింది. భర్తతో సహా ఇంట్లో వాళ్ళంతా కలిసి ఆమె మీద కిరసనాయిలు పోసి నిప్పంటించారు....

మంటల మధ్య దీనంగా ఆర్తనాదాలు చేస్తోంది ఉష.....

ఆమెను హాస్పటల్‌కి తరలించారు...

ఒక్కక్షణమైనా ఆమె మంచం వదలకుండా శోకాలు పెడుతూ, ఆమె మంచితనాన్ని పొగుడుతూ... తమ దురదృష్టానికి వగస్తూ తిండి కూడా మానేసి అలమటిస్తున్నారు ఆమె భర్త, అత్త....

మరణ వాఙ్మూలం తీసుకోటానికి ఎర్రటోపీ లొచ్చాయి....

"నా భర్తకి, అత్తకి ఏమీ తెలీదు. నేనే.... నేనే.... జీవితం మీద విరక్తి పుట్టి ఆత్మహత్య చేసుకున్నాను". అని స్టేట్‌మెంటిచ్చింది ఉష.

★ ★ ★ ★ ★

అది చూసి ఆశ్చర్యంతో తల మునకలవుతూ "అదేం రోగం? అలా చెప్పిందేమిటి? ఉన్నదున్నట్లు చెపితే ఆ వెధవలకి శిక్షపడేది గదా? కనీసం ఇంకో ఆడపిల్లయినా ఆ కుటుంబపు కబంధహస్తాల్లో ఇరుక్కోకుండా రక్షింప బడేదిగదా?" అన్నాడు రావణుడు.

"అది ఖచ్చితంగా అంతే. ఈ దేశపు ఆడదానిలో ఉన్న ఈ చచ్చు సెంటిమెంటే మగాడికి కవచంగా మారి వాడిని రక్షిస్తోంది. ఇది ఇలా చెపుతుందని వాడికి ముందే తెలుసు. అందుకే నిర్భయంగా.... యథేచ్ఛగా ఆమెను తగలెయ్య గలిగాడు. నువ్విలా మాటి మాటికీ ఆశ్చర్య పోకుండా మిగిలిన తతంగాన్ని గమనించు". అన్నాడు వరప్రసాదు....

★ ★ ★ ★ ★

"ఇదిగో సూరమ్మా విన్నావా? ఆ మహంకాళి... పాపం ... బంగారం లాంటి కోడలు ఉష. ఆ పిల్ల

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# 1988 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 7,200/-

**ముగింపు తేదీ : 10 సెప్టెంబరు, 1988**

ఎప్పటిలాగే ఈ ఏడాది కూడా దీపావళి కథల పోటీ నిర్వహిస్తున్నాము. గతంలో లాగే ఈ సంవత్సరం కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని అకారాది క్రమంలో ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచిక, ఆ తరువాతి సంచికల్లో ప్రచురిస్తాము. అనంతరం పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

పోటీలో సంపాదకుని ఎన్నికలో వచ్చిన ఆరుకథలకీ ఒక్కొక్క దానికి రు. 700/- చొప్పున బహుమతి లభిస్తుంది. ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి స్థానంలో వచ్చిన కథకి రు. 750/- అదనపు బహుమతిగా అంద జేస్తాము. బాలట్‌లో రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు. 650/- ; రు. 550/- వంతున అదనపు బహుమతులుగా లభిస్తాయి. మిగిలిన మూడు కథలకీ ప్రత్యేక బహుమతిగా ఒక్కొక్క దానికీ రు. 350/- చొప్పున అందజేస్తాము.

పోటీలో సాధారణ ప్రచురణకి స్వీకరించిన కథలకి ఒక్కొక్క దానికీ రు. 150/- వంతున వాటి ప్రచురణ జరిగిన తర్వాత ఇస్తాము.

## నిబంధనలు

1. కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి.

2. కథ వ్రాతప్రతి పన్నెండు అరఠావు (ఎక్సర్‌సైజ్ నోట్ పుస్తకం పేజీకి రెట్టింపు) పేజీలకి మించి ఉండరాదు. కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్ పెన్‌తో రాయాలి. వ్రాత ప్రతిపై "1988 దీపావళి కథల పోటీకి" అని మొదటి పేజీ పై భాగంలో స్పష్టంగా రాయాలి.

3. అనువాదాలు, అనుసరణలు, కాపీ కథలు పంపరాదు. గతంలో ఇతర పత్రికలకి పరిశీలనకి పంపిన, ప్రచురింపబడిన, రేడియో, టి. వి. లలో ప్రసారం అయిన రచనలని పోటీకి పంప కూడదు. ఈ మేరకి రచయిత (త్రు)లు హామీ పత్రం రాసి వ్రాత ప్రతికి జతపరిచి పంపాలి. హామీ పత్రం లేని రచనలని పరిశీలించటం జరగదు. ఆంధ్ర పత్రిక సంస్థ ఉద్యోగులు, వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు.

4. రచయిత (త్రు)లు కలం పేరుతో రాసినా, వారు తమ అసలు పేరు, పూర్తి చిరునామా వ్రాత ప్రతి మీద స్పష్టంగా రాయాలి.

5. సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలనీ ఆయా రచయిత (త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము. తరువాత బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలని ఫోటోలతో సహా ప్రచురిస్తాము.

6. పోటీ లో బహుమతి పొందిన కథా రచయిత (త్రు)లు తమ జీవిత వివరాలని, ఫోటో లని పంపి, వాటి ప్రచురణకి అంగీకరించ వలసి ఉంటుంది.

7. రచనలపై వచ్చే ఎటువంటి పేచీలకైనా ఆయా రచయిత (త్రు)లే బాధ్యత వహించ వలసి ఉంటుంది.

8. పోటీకి పంపే కథలని 10 సెప్టెంబరు, 1988కి కానీ అలోగా కానీ మా కార్యాలయానికి అందేలా పంపాలి. ఆ తరువాత అందిన వాటిని పోటీకి పరిశీలించటం జరగదు.

9. పోటీకి పంపిన కథలని ఎట్టి పరిస్థితులలోనూ తిప్పి పంపటం జరగదు. కాబట్టి రచయిత (త్రు)లు తమ కథలతో పాటు తపాలా బిళ్ళలు అతికించిన, స్వంత చిరునామా కల కవర్లని జతపరచ వలసిన అవసరం లేదు.

10. పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వాటిని వీలు వెంబడి ప్రచురిస్తాము. స్వీకరించిన కథల విషయం ఆయా రచయిత (త్రు)లకి తెలియ చేస్తాము. ప్రచురణకి స్వీకరించని కథల విషయంలో ఆయా రచయిత (త్రు)లకి తెలియ చెయ్యటం సాధ్యంకాదు. కాబట్టి వాటి విషయంతో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదని గమనించ కోరుతున్నాము.

11. పోటీకి పంపే కథలని "సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 520003" అనే చిరునామాకి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు. కవరు పై భాగంలో "1988 దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి.

రచయిత (త్రు)లు అందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము.

—సంపాదకుడు

ఆంధ్రసచిత్రవారపత్రిక



బెంగుళూరు శ్రీ అన్నమాచార్య సాంస్కృతిక సమితి వారు కర్నాటక గవర్నరు శ్రీ పెండేకంటి వెంకట సుబ్బయ్యకి శ్రీ అన్నమాచార్య కీర్తనల క్యాసెట్లును సమర్పిస్తున్నప్పటి చిత్రం. శ్రీయుతులు కె. గంగరాజు (సంయుక్త కార్యదర్శి), బి. ఎ. వి. శాండిల్య (శ్రీ అన్నమాచార్య ట్రస్ట్ సంస్థాపక ట్రస్టీ), శ్రీ ఎ. రాధాకృష్ణ రాజు (ప్రధాన కార్యదర్శి), ఎన్. వి. శ్రీనివాసరావు (సంయుక్త కార్యదర్శి), ఎం. దొరస్వామి రాజు (కార్యవర్గ సభ్యులు) లను కూడా చిత్రంలో చూడవచ్చు

## "ఇచ్చట కోడళ్ళు తగలబెట్ట బడుదురు!"

మీద కిరసనాయిలు పోసి తగలేసిందట!" ఆవేశంగా అన్నది శాంతమ్మ.

"అది అలాంటిదే! దాని బుద్ధి నాకు తెలుసు. నే నెప్పుడో ఊహించానిలా జరుగుతుందని. ఇలాంటి వాళ్ళని ఉరితియ్యాలసలు". అన్నది సూరమ్మ.

బజార్లో ఉన్న ఆడవాళ్ళంతా మహంకాళి కుటుంబాన్ని దుమ్మెత్తి పోశారు. డాక్టరు, పోలీసులు, బాగా డబ్బుతిని తప్పుడు స్టేట్మెంట్లిచ్చారని వాళ్ళని తిట్టిన తిట్టు తిట్టకుండా రాత్రింబగళ్ళు తిట్టి పోశారు.....

బ్యాంకులోంచి డ్రా చేసిన సొమ్ము అవసరమైన వాళ్ళ చేతుల్ని తడి చేసింది....

మహంకాళి, మోహన్ వగైరాలు నిర్దోషులని కోర్టు తీర్పు చెప్పింది.

ఓ ఆరు నెలలు గడిచింది....

"ఏమే శాంతమ్మా! నీ కూతుర్ని మహంకాళి కొడుకు మోహన్‌కి ఇస్తున్నావటగా?" అన్నది సూరమ్మ.

"మరేనమ్మా! పాపం! వాళ్ళు మంచివాళ్ళే! ఆ ఉషకి సుఖపడే గీత లేక అలా అర్ధాంతరపు చావు చచ్చింది. దానికి ఎవడేం చేస్తాడు?

బంగారం లాంటి సంబంధం... బోలెడు ఆస్తిపాస్తులు! మామూలుగా అయితే వాళ్ళ మాకసలు అందనే అందదు. ఏదో మా పిల్ల అదృష్టం!" అన్నది శాంతమ్మ.

"మరే ఒదినా! అసలు ఆ ఉష మహా అఘాయిత్యపు పిల్లటలే. మహంకాళమ్మ ఎంత బాధపడిందనీ... వాళ్ళని అనవసరంగా రోడ్డు మీదికీడిచిందా పిల్ల. "ఈసారయినా నన్ను అర్థం చేసుకునే పిల్ల... చదువుకున్న పిల్ల దొరికితే బాగుండును". అని మోహన్ అల్లాడుతుంటే నాకు మనసంతా ద్రవించిపోయిందనుకో".

"వాళ్ళదసలు రాయల్ ఫామిలీ. ఇలాంటి చిన్నబుద్ధులు వాళ్ళకు లేవు".

"మహంకాళమ్మకి ఎంత భక్తి. ఎంత నెమ్మది.... రోజూ గుడికి వెళ్ళకుండా ఉండదు. ఇంటికెవరయినా వెడితే కాఫీ ఇవ్వకుండా ఉండదు..." అంటూ కోరస్ పాడాయి అనేక గొంతులు. ఆ గొంతులన్నీ ఆ రోజు, మహంకాళి కుటుంబాన్ని నిరసిస్తూ, డాక్టర్ల, పోలీసుల, అవినీతిపరుల లంచగొండితనాన్ని అసహ్యించుకుని దుమ్మెత్తిపోసినవే!

ఈ ఆరునెలల్లోనూ ఇంకో కొత్త న్యూస్ దొరికేసరికి మహిళా సంఘాల, వార్తాపత్రికల దృష్టి ఆటో మాటిక్‌గా దీన్నొదిలేసి, అటువేపు తిరిగింది....

ఆరు నెలలు తిరిగేసరికి ఉషకన్నా అందమైనది, డబ్బున్నది, చదువుకున్నది అయిన లీల మోహన్‌కి భార్యగా.... మహంకాళమ్మ కోడలుగా ఆ ఇంట అడుగుపెట్టింది....

* * * * *

"ఇదిగోనండీ మీ ఫీజు! మీ సలహా ప్రకారం అంతా ప్లాన్డ్‌గా... పకడ్బందీగా చేసి, స్మూత్‌గా బయటపడ్డాం. లక్షకి పైగా లాభం వచ్చింది... వస్తాం. మళ్ళీ మా చిన్నబ్బాయి పెళ్ళి అవగానే వచ్చి కలుస్తాం". అంటూ కొన్ని నోట్ల కట్టలు వరప్రసాద్‌కిచ్చి వెళ్ళిపోయింది మహంకాళి.

* * * * *

"అదీ సంగతి. ఇప్పుడర్థమయిందా మా బిజినెస్ ఏమిటో! సలహాలు చెప్పటం..... పకడ్బందీగా ప్లాన్లు చెయ్యటం మా పని. అమలుపరచటం వాళ్ళ పని." అన్నాడు వరప్రసాద్.

"మిమ్మల్ని నాలుగు తన్ని మీ బోర్డు పీకిపారెయ్యాలి" కోపంగా అన్నాడు రావణుడు. అతనికి ఉష అమాయకమైన ముఖం గుర్తొచ్చి కడుపులో దేవుతున్నట్లనిపించింది.

"నెవ్వర్! మా సంస్థని ఎవరూ ఏమీ చెయ్యలేరు. ఇప్పుడది బాగా పాప్యులర్ అయిపోయింది ఒకవేళ నీలాంటి వాళ్ళెవరైనా ఆ పని చేసినా దీని కార్యకలాపాలని మాత్రం అరికట్ట లేరు. ఇప్పటికే ఎందరో ఇలా కోడళ్ళని తగలేసే విషయంలో బాగా ఎక్స్‌పీరియన్స్ సంపాదించారు... ఇలా మా ఏజెంట్లు సర్వే సర్వత్రా వ్యాపించియున్నారు..., బోర్డు పీక గలవేమోగానీ.... నీ రాక్షస బలమంతా ఉపయోగించినా కూడా ఈ వరకట్నపు చావుల్ని నిషేధించలేవు". గర్వంగా అన్నాడు వరప్రసాద్.

"మీ నోళ్ళలో మన్నుగొట్ట! ఏం బ్రతుకులురా మీవి! థూ! మీ జాతి యావత్తూ సిగ్గుతో తలదించుకోవాల్సిన ఈ పైశాచిక చర్యని చూసి గర్వపడుతున్నావా! ఎదిరించాల్సింది పోయి, సపోర్ట్ చేసి, క్యాష్ చేసుకుంటున్నావా!

మీ జాతిని మీరే నాశనం చేసుకుంటున్న మీలాంటి వాళ్ళకన్నా అడవి మృగాలు నయం. మీ దేశంలో ఆడదానికి ఆడదే ప్రథమ శత్రువు.

ఇదేనా మీ మానవత్వం?

ఇదేనా మీరు నేర్చిన నాగరికత?

ఇదేనా మీరు సాధించిన ప్రగతి?

మీ నుంచి ఇంకా ఎన్నో నేర్చుకుని మా నాగరికతని అభివృద్ధి చేసుకోవాలని మీ మధ్యకొచ్చాను నేను.

మీకన్నా మేమే నయం!

మా రాక్షస రాజ్యంలో ఇలా ఆడదాన్ని కిరసనాయిలు పోసి అంటించరు...

అత్తింటికొచ్చిన ఆడపిల్ల, అమ్మవారికి బలి ఇవ్వబడుతున్న గొర్రె పిల్ల ఒకటే అనుకునేంత హీనస్థితికి మా వాళ్ళు దిగజారలేదు....

డబ్బు కోసం ఎంతటి నీచానికయినా దిగజారే సిగ్గుమాలిన జాతి కాదు మాది....

మీ నాగరికతకో నమస్కారం....

ఇలాంటి సిగ్గుమాలిన అభివృద్ధి మాకొద్దు....

ఇంతకన్నా.... మేము ఎప్పటిలాగా ఉండటమే మేలు.

గుడ్‌బై!

గుడ్‌బై ఫరెవ్వర్!" అంటూ చటుక్కున ఆకాశంలో కెగిరి మాయమయిపోయాడు రావణుడు.

"వీడి మొహం! ఇలాంటి కూతలు చాలా విన్నాం. ఇంత మాత్రానికి నిరుత్సాహపడితే... ఇహ మా గొప్పతనమేముంది? ఈ కాస్తకే సిగ్గుపడిపోయి బిజినెస్ మూసేసుకుంటాననుకున్నాడు గాబోలు. పూర్ ఫెలో!" అనుకుంటూ బోర్డు మీద కర్చీఫ్‌తో సుతారంగా అద్ది లోపలికెళ్ళిపోయాడు వరప్రసాద్. □

ఆంధ్రపత్రిక పాఠకులకి చక్కటి అవకాశం



# కళ్యాణవేదిక

ఉచిత సమాచారం

## వధూవరుల సమాచారము ఉచితంగా ప్రతి బుధవారం ప్రకటిస్తాము. సమాచారం పంపేవారు ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

- ★ వధువు / వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి.
- ★ వధువు / వరుల తల్లిదండ్రులు, సంరక్షకులు తాము యిచ్చే సమాచారము వాస్తవమని, ఎవరికీ కించపర్చే విషయము అందులో లేదని హామి ఇవ్వాలి.
- ★ సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగా వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు **ఉచితంగానే** వాటికి సంబంధించిన వారికి నెల రోజుల లోపు పంపడం జరుగుతుంది.
- ★ ఈ శీర్షికను కులమత వర్గ భేదాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.
- ★ అందిన సమాచారము ప్రతి బుధవారం అవి అందిన వరుసక్రమంలో ప్రకటించబడుతుంది. వీటిని త్రిప్పి పంపే ప్రసక్తి లేదు. కావున స్వంత అడ్రసు గల కవర్లు లేదా స్టాంపులు జతపర్చకూడదు.
- ★ ప్రకటనకు ఏవైనా అనర్హమైనదిగా తోచినపుడు వాటిని వెయ్యకుండా ఆపు చేసే హక్కు పత్రికకు వుంటుంది.
- ★ ఇతర విధములైన ఉత్తర ప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపకూడదు.
- ★ సమాచారము పంపేవారు ఈ దిగువ కూపను పూర్తి చేసి, స్థానిక ఏజెంటుచే సంతకం చేయించి పంపాలి. కూపను జతపర్చనియెడల పరిశీలించబడవు.
- ★ కళ్యాణ వేదిక శీర్షిక ద్వారా సంబంధం కుదిరి వివాహం జరిగిన వధూవరుల ఫోటోలు ఉచితంగా ఆంధ్రపత్రికలో ప్రకటించగలము. ఏ తేదీన ప్రకటన పడినది తెలియజేస్తూ ఫోటోలు జతపర్చి "కళ్యాణ వేదిక ఫోటో ప్రచురణార్థం" అని వ్రాసి పంపవలెను.

## కళ్యాణ వేదిక ఉచిత సమాచార కూపను

పేరు . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

విరునామా . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . పిన్‌కోడ్ . . . . . . .

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటు సంతకం ........................

# ప్రశ్నావళి — కె. రామలక్ష్మి



## ఎమ్. ఆర్. కాశీబుగ్గ

★ ఆధునిక స్త్రీ, వివిధ రంగాలలో పురుషునికంటే పురోగమిస్తూంది అంటారా??

● నిజమే. అలాగే కన్పిస్తూంది. కాని ఏం లాభం 'అంబలేరు వచ్చింది అత్తగారా. అంటే క్రొలబుర్ర నా చేతనే వుంది కోడలా— అన్నట్లుంది పురోభివృద్ధి!! మీరు చదివారో లేదో— స్త్రీలలో అక్షరాస్యత శాతం పెరుగదనే చూపిస్తూందట. కాని నిరక్షరాస్యుల సంఖ్య మాత్రం పెరిగిందట! ఇదిగో యిలాగే మంది స్త్రీల పురోభివృద్ధి. కార్యక్రమాలు ప్రకటించగానే— సంబరపడిపోవడం, సంఘం, స్థాపించడంతో - పని నిలిచిపోవడం— మనకి అలవాటే

★ టి. వి.లను నిర్మూలిస్తే ఎక్కువగా బాధపడే వాళ్లెవరు?

● వ్యాపారస్థులు.

★ నేటి సినిమాలలో మంచి ఎక్కువగా వుందా?? చెడా??

● రెండూ లేకపోవడమే— వాటిలోని ఉత్తమ లక్షణం!

★ మీ స్వస్థలం??

● అంటే?? పుట్టిన వూరా?? పెరిగిన వూరా?? ఉన్న వూరా?? కోటనందూరు— కాకినాడ— మద్రాసు. వెళ్లి స్థిరపడాలని అనుకుంటున్నది— పంచదార్ల. జీవన సంధ్యాకాలం బి. సి. టి.లో గడపాలని కోరిక.

## సి. హెచ్. ఆర్. సత్తెనపల్లి

★ స్వేచ్ఛలేని జానిసలకు నేటి స్త్రీలకు ఏమైనా తేడా వుందా??

● ఉంది నచ్చిన జానిసని అక్కడ కొనుక్కోవడం జరుగుతుంది. ఇక్కడ తప్పిచ్చి ఖానిసనే యివ్వడం జరుగుతోంది.

★ దెయ్యాలు భూతాలు మహిమలు క్షుద్ర శక్తులు... యిలాంటి వాటిని మీరెంత వరకు నమ్ముతారు??

● నమ్మను— యిప్పటిదాకా యిలాంటి పిరికితనాలు నా దగ్గరికి రాలేదు... మన మధ్య మనుషుల్లో వీటికంటే భయంకరమైన వాళ్లున్నారు కదా

మన న్యాయస్థానాలలో చట్టానికే గాని న్యాయానికి ప్రాధాన్యత యివ్వరు. ఇది సహేతుకమా?

(మన పద్ధతి అది అంతే. చట్టం— న్యాయం— కూడా సాక్ష్యం మీద కద ఆధారపడేది?? అందుకే ఎవిడెన్స్ యొక్క మార్పేపరకూ— న్యాయం చట్టపు ముసుగులలోంచి జారిపోతూ వుంటుందని నమ్మలేరు కొందరు.

## జి. వి. ఆర్. సికింద్రాబాద్

★ పిల్లల భవిష్యత్తు కోసం పెద్దలు యింత త్యాగాలు చెయ్యడంలో అర్థం వుందా!!

● లేదు ఎందుకంటే— నేటి యువత స్వార్థానికి మారుపేరు. పబ్బంగడుపుకోవడం తప్ప బాధ్యతలని గుర్తిస్తుందని అనుకోడంలేదు— వీరికి పాశ్చాత్య దేశపు స్వేచ్ఛ మీద మోజేమోగాని!! దానికోసం స్వంతంగా కష్టపడడంలో కుతూహలం లేదు! అందుకే— ఆ స్వేచ్ఛనీ— మన సంప్రదాయపు రక్షణనీ - అంద చందుని బతికేస్తూంటారు— ఇది ఏ మాత్రం పరిశీలనగా చూసినా— ఎవరికైనా అర్థం అవుతుంది. కాదంటారా?




## ఎమ్. ఆర్. డి. బళ్లారి

★ హైందవ స్త్రీలు బొట్టు గాజులు పూలు ఎంతో పవిత్రంగా చూసుకుంటారుకదా మరి మీరేమంటారు కె. రా. గారూ?

● వాటికంటే ముఖ్యం అవి ధరించకపోయినా మనిషికి ఇవ్వాలి! మీ లిస్టులో పుస్తెలు మరిచిపోయారేమిటి? పాపం.

## యు. ఆర్. డి. విజయవాడ

★ ....నేను ఎక్కువ చదువుకోలేదు. నాకు ముప్పయి సంవత్సరాలు. ముగ్గురాడపిల్లలు. ఒక మగ పిల్లాడు. వేరేపోయి బతకాలనిపిస్తూంది.... చదువుకోవాలనిపిస్తోంది. కాని ఇప్పుడు చదువు వస్తుందా?

● చదువుకి వయసుతో పని లేదు సోదరీ! పట్టుదల వుంటే ఎప్పుడైనా చదువుకోవచ్చు. మన విశ్వ విద్యాలయాలన్నిటా స్త్రీలు ప్రయివేట్‌గా చదువుకునే అవకాశాలు కల్పిస్తాయి. అసలు మన ఓపెన్ యూనివర్శిటీలో చేరడానికి ఏ క్వాలిఫికేషన్లూ అవసరంలేదు. మీరు హాయిగా వారికి తెలుగులో ఉత్తరం రాసి అన్నీ తెలుసుకోండి. ఒక్కమాట చెప్పగలను. ధైర్యం సడలినా, నిరుత్సాహం ఆవహించినా ఒక్కడుగు ముందుకు వేయలేరు ముప్పయికే నల్గురు పిల్లల భారం పెంచుకున్న మీరు ధైర్యం పోగొట్టుకోడంలో - అర్థం లేదు.

## ఆర్. ఎస్. నిడదవోలు

★ ....సుఖం లేదు. అక్క చెల్లెళ్లం తోటి కోడళ్లం. దాంతో సమస్యలు ప్రారంభమయ్యాయి. తల్లి తండ్రులను ఆడిపోస్తూంటే సహించలేకుండా వున్నాను. ఏ శాంతి ఆశ్రమానికో...

● ముప్పయి రెండేళ్లకి శాంతి ఆశ్రమం వేపు చూస్తే... ఎన్నేళ్లక్కడ? ఆలోచించారా?! మనసు మీతోనే వుంటుందన్న సంగతి మరిచిపోయారా? మీరు ఉత్సాహంగా సాంఘిక కార్యక్రమాలలో పాల్గొనడం ప్రారంభించండి. తెరిపి లేని పని కల్పించుకోండి... కాలం తీర్చలేని సమస్య లుండవు అని నేను నమ్ముతాను. భరించక తప్పనప్పుడు - విసుక్కుంటూ కంటే పరిష్కార ప్రయత్నం చేస్తూ - అనుభవిస్తే - యీ ఫీలింగు వుండదు.

## జి. ఆర్. ఆర్. విశాఖపట్నం

★ మాలతీ చందూర్ గారికి మీకూ తేడా ఏమిటి?

● మాలతిని గ్రేట్ రైటర్ అంటారు. నన్ను ఏరొగెంట్ ఉమెన్ అంటారు!

# వ్యక్తిగతం

## స్టెఫీగ్రాఫ్ శకం ప్రారంభం!

ప్రపంచ ప్రఖ్యాత టెన్నిస్ క్రీడాకారిణి స్టెఫీగ్రాఫ్ విజయపరంపర చిట్ట చివరికి అత్యున్నత శిఖరానికి చేరింది. ఆరు సంవత్సరాలుగా ఎదురు లేని విజేత వింబుల్డన్‌లో విజయం సాధిస్తూ వచ్చిన మార్టినా నవ్రతిలోవాను స్టెఫీగ్రాఫ్ ఓడించింది. 1931 తర్వాత జర్మన్ క్రీడాకారులు వింబుల్డన్‌లో విజయం సాధించడం ఇదే మొదటిసారి. విజేత స్టెఫీగ్రాఫ్ వయసు 19 సంవత్సరాలు. వింబుల్డన్ క్రీడాంగణంలో ఒక శిలా ఫలకం మీద



"విజయం సాధించినా, పరాజయం ఎదురయినా రెంటినీ సమంగా స్వీకరించు" అనే రడ్‌యార్డ్ కిప్లింగ్ మాటలు చెక్కి ఉన్నాయి. నిజంగానే విజేత స్టెఫీగ్రాఫ్, పరాజిత మార్టినా నవ్రతిలోవా ఇద్దరి కళ్ళు నిండా నీటితో ఆట్ట ముగించారు. సెప్టెంబరులో జరుగనున్న యు ఎస్ ఓపెన్ టెన్నిస్‌లో కూడా విజయం సాధిస్తే స్టెఫీగ్రాఫ్ ఈ సంవత్సరపు గ్రాండ్‌స్లామ్ విజేత అయి తన చిరకాల వాంఛను తీర్చుకుంటుంది....

## ఒలింపిక్స్‌లో జీషన్ అలీ

భారత టెన్నిస్ క్రీడారంగంలోకి మరొక క్రీడాకారుడు ప్రవేశించాడు. గతంలో రెండుసార్లు జాతీయ



ఛాంపియన్‌గా, ఇండియన్ సెటిలైట్ మాస్టర్స్ విజేతగా ఉన్న జీషన్ అలీ ఆసియా- ఓషియానియా ప్రాంతీయ అర్హతా పోటీలలో సెమీ- ఫైనల్స్‌కు చేరాడు. తద్వారా ఆయన సియోల్ ఒలింపిక్ క్రీడలలో ఆడే అవకాశాన్ని సంపాదించారు. ఈ ఒలింపిక్స్‌లో ఆయన విజయ్ అమృతరాజ్, ఆనంద్ అమృతరాజ్, రమేశ్‌కృష్ణన్‌లతో పాటు పాల్గొంటారు....

## వింబుల్డన్ ఛాంపియన్ ఎడ్‌బెర్గ్

స్వీడన్‌కు చెందిన స్టెఫాన్ ఎడ్‌బెర్గ్ వింబుల్డన్ పురుషుల సింగిల్స్‌లో ఘన విజయం సాధించాడు. ప్రఖ్యాత టెన్నిస్ క్రీడాకారుడు బోరిస్‌బెకర్‌ను ఫైనల్స్‌లో ఎడ్‌బెర్గ్ 4–6, 7–6, 6–4, 6–2 స్కోరుతో ఓడించాడు. రెండుసార్లు ఆస్ట్రేలియన్ ఓపెన్ టెన్నిస్ విజేతగా గెలుపొందిన ఎడ్‌బెర్గ్‌కు బెరుకు ఎక్కువని, ఉన్న శక్తిని కూడా వినియోగించుకోలేదని అనుకునేవారు. మూడు వారాల క్రితం క్వీన్స్ క్లబ్ ఫైనల్స్‌లో ఆయన బెకర్ చేతిలో ఓటమిని చవిచూశాడు. ఇందుకు ప్రతిగానా అన్నట్టు వింబుల్డన్‌లో ఎడ్‌బెర్గ్ విజృంభించి ఆది విజయం సాధించాడు. 1980 తర్వాత స్వీడన్‌కు చెందిన ఆటగాడు గెలుపొందడం ఇదే ప్రథమం. బోరిస్‌బెకర్ క్వీన్స్ క్లబ్‌లో ఆడినప్పుడు ధరించిన ఆకుపచ్చ రంగు దుస్తులనే ధరించి వచ్చినప్పటికీ మళ్ళీ విజయం మాత్రం సాధించలేక పోయాడు....



## హోంశాఖమంత్రిపై హత్యా నేరం!

కర్నాటక హోంశాఖ మంత్రి శ్రీ ఆర్. ఎల్. జాలప్ప ఒక హత్య కేసులో అనుమానితుల జాబితాలో ఉన్నారు. కేరళకు చెందిన న్యాయవాది శ్రీ ఎం. ఎ. రషీద్ 1987 ఆగస్టు 9న ఒక కేసులో వాదించడానికి బెంగుళూరు వచ్చారు. ఆగస్టు 18న తమిళనాడు లోని సేలం దగ్గర రైలుపట్టాల పక్కన ఆయన శవం కనిపించింది. శ్రీ రషీద్ కర్నాటక రాష్ట్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా నడుస్తున్న కేసులో శ్రీ పి. సదాశివన్ తరఫున వాదిస్తున్నారు. కర్నాటక ప్రభుత్వం ఒక వైద్య కళాశాలను తెరవడానికి శ్రీ సదాశివన్‌కు ముందు అనుమతి ఇచ్చి, తర్వాత ఆ



అనుమతిని రద్దు చేసింది. ఆ అనుమతినే శ్రీ జాలప్ప అధ్యక్షుడుగా ఉన్న దేవరాజ్ అర్స్ ఎడ్యుకేషనల్ ట్రస్టుకు మంజూరు చేశారు. ఇది అక్రమం అని వాదించ డానికి వచ్చిన శ్రీ రషీద్‌ను శ్రీ జాలప్ప ఆదేశాలపై పోలీసులు వేధించారు. ఈ విషయమై హత్యకు ముందే శ్రీ రషీద్ బార్ కౌన్సిల్‌కు ఫిర్యాదు చేశారు. ఎనిమిది నెలల పాటు విచారణ జరిపిన కేంద్ర నేరపరిశోధక శాఖ ఈ హత్యను పోలీసులు చేశారన డానికి ఆధారాలున్నాయని తేల్చింది. దానితో హత్యా నేరారోపణపై ఆరుగురు పోలీసు అధికారులను అరెస్టు చేశారు. హత్యతో తన కేమీ సంబంధం లేదని చాలా కాలంగా ప్రకటిస్తూ వచ్చిన శ్రీ జాలప్ప చిట్ట చివరికి తమ పదవికి రాజీనామా చేయవలసి వచ్చింది. కర్నాటక ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణ హెగ్డే ఆయనని రక్షించేందుకు ప్రయత్నిస్తున్నారని కూడా పలువురు ఆరోపించారు....




జరిగినకథ– 9: డి. జి. పి. పుట్టిన రోజు కానుకగా రాకా జోగి శవాన్ని పంపుతాడు. ప్రముఖ ఇంజనీర్లను బంధించి, వాళ్ళ నేరాలు వినిపించి చంపేస్తారు. ఆ పని చేసింది రాకాయేనని తెలుస్తుంది. సీతాదేవి భర్త విడుదలై రాబోతున్నాడన్న వార్త ఆమెకు ఎన్నో జ్ఞాపకాల్ని గుర్తు చేస్తుంది. రాకాను ఎదుర్కోవడానికి ముఖ్యమంత్రి ఒక పథకం ఆలోచిస్తాడు. మోహన అపార్ట్‌మెంట్స్ కూలిపోయి అనేకమంది చనిపోతారు. రాకా దేదీప్యను ఒక పనిలో సాయం చెయ్యమని కోరతాడు. దేదీప్య శైలజతో ఒక ముఖ్య విషయం మాట్లాడుతుంది.

## (గత సంచిక తరువాయి)

కమీషనర్ ఆఫ్ పోలీస్ పర్సనల్ ఛాంబర్స్-

హడావుడిగా వచ్చిన కాంట్రాక్టర్ మోహన్‌రావుని చూసి-

"హలో.... మీరా! రండి... ఏమిటింత హఠాత్తుగా వచ్చారు?" అన్నాడు చక్రవర్తి!

"మీతో అర్జంట్‌గా మాట్లాడాలి!" అన్న మోహన్‌రావు గొంతు అదోలా వుంది.

"అలాగే.... కూర్చోండి! కాఫీ, టీ, కూల్‌డ్రింక్?" అడిగాడు కమీషనర్ ఆఫ్ పోలీస్.

"నో థాంక్స్! ఏమీ వద్దు.... అర్జంట్‌గా ఓ విషయం చెప్పాలి మీతో?"

"ఓ యస్ చెప్పండి!" అన్నాడు చక్రవర్తి.

మోహన్‌రావ్ సందేహంగా ఆ గదిలో వున్న హవుస్ ఆఫీసర్ వేపు చూశాడు. అతని సందేహాన్ని అర్థం చేసుకున్న చక్రవర్తి హవుస్ ఆఫీసర్‌కి సైగ చేశాడు. ఆ సైగనర్థం చేసుకున్న హవుస్ ఆఫీసర్ గబగబా ఆ గదిలోంచి బయటికి వెళ్ళిపోయాడు.

"చెప్పండి. ఏమిటి మీ ప్రాబ్లం?" అడిగాడు కమీషనర్ ఆఫ్ పోలీస్ చక్రవర్తి నవ్వుతూ.

మోహన్‌రావ్ మాట్లాడకుండా జేబులోంచి ఓ కాయితం తీసి కమీషనర్ ఆఫ్ పోలీస్‌కి ఇచ్చాడు. ఆయన ఆ కాయితాన్ని విప్పి చదివాడు.

"ఒరేయ్ హంతకుడా!

డబ్బుకు గడ్డి తిని కాంక్రీట్‌లో ఇసుక కలిపి మోహన అపార్ట్‌మెంట్స్ కట్టి, ఎందరో ప్రాణాల్ని తీసావ్! చట్టం నిన్ను క్షమించినా- నేను నిన్ను వదిలిపెట్టను. ప్రమాదంలో మరణించినవారి ఆత్మ శాంతించేలా జీవితాంతం నువ్వు నరకయాతన అనుభవించే చిత్రమైన శిక్ష విధిస్తాను. కాచుకో!- రాకా".

ఉత్తరం చదివిన చక్రవర్తి ఉలిక్కిపడ్డాడు.

రాకా మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు!

మోహన అపార్ట్‌మెంట్స్ కూలిపోయిన తర్వాత యిలాంటివే రెండు ఉత్తరాలు వచ్చాయి. వాటిని నేను లెక్క చేయలేదు. మళ్ళీ వచ్చేసరికి ఎందుకయినా మంచిదని మీకు చూపిస్తున్నాను" అన్నాడు మోహన్‌రావ్.

"గుడ్! రాకా మళ్ళీ తన కార్యకలాపాలు మొదలుపెట్టబోతున్నాడన్న మాట! ముందు మనం డి.జి.పి.గార్ని కలుద్దాం". అంటూ డి. జి. పి.కి కనెక్షనివ్వమని ఇంటర్‌కంలో సెక్రటరీకి చెప్పాడు. మరో నిముషంలో డి. జి. పి లైన్లోకి వచ్చారు. చక్రవర్తి చెప్పిన మాటలు విన్న డి. జి. పి. వెంటనే ఆ ఇద్దర్నీ తన దగ్గరకు రమ్మని చెప్పాడు.

మరో ఐదు నిముషాల్లో, చక్రవర్తి మోహన్‌రావ్‌తో సహా డి. జి. పి. ముందున్నాడు.

రాకా రాసిన ఆ ఉత్తరాన్ని శ్రద్ధగా చదివాడు డి. జి. పి. ఆ దస్తూరి చూడగానే అది రాకాదేనని గుర్తుపట్టాడాయన.

"మోహన్‌రావ్‌గారికి ప్రొటెక్షన్ ఏర్పాటు చెయ్యమంటారా సర్?" అడిగాడు చక్రవర్తి!

"అది అంత అవసరం లేదనుకుంటాను! ఈ ఉత్తరంలో 'జీవితాంతం నరకయాతన అనుభవించే చిత్రమైన శిక్ష' అన్నాడు గానీ చంపుతాననలేదు! బైది బై మీకు పిల్లలెంత మంది?" అడిగాడు డి. జి. పి. కళ్యాణ్‌రాం.

"ఒక్కతే కూతురు సర్! అమ్మాయికి ఎల్లుండి పెళ్ళి. ఆ తర్వాత మరో మూడు రోజుల్లో అల్లుడూ అమ్మాయీ అమెరికా వెళ్ళిపోతారు. అల్లుడు అమెరికాలో ఇంజనీర్!" చెప్పాడు మోహన్‌రావ్.

"గుడ్! అయితే పెళ్ళి దగ్గరే రాకా డిస్టర్బ్ చెయ్యొచ్చు. కనుక పెళ్ళి రోజున అమ్మాయికి ప్రొటెక్షన్ ఏర్పాటు చేస్తాం!" అన్నాడు డి. జి. పి.

మోహన్‌రావ్ ముఖం కోపంతో ఎర్రబడింది.

"సారీ సర్! నేను ఇంట్లో కూతుర్ని కాపాడుకోలేనంత వాజమ్మని కాదు. నా ఇంట్లో నా కూతురి చుట్టూ నా మనుషులు వేటకుక్కల్లాంటి వాళ్ళు, చాలామంది వున్నారు. ఇంకా కాదు కదా వాడి బాబు కూడా అమ్మాయి మీద పడ్డా వాడి అవశేషాలు కూడా భూమ్మీద మిగలవ్!" అన్నాడు.

ఆ మాటలు వట్టి ప్రగల్భాలు కావనీ, అక్షర సత్యాలనీ డి. జి. పి. కి తెలుసు. మోహన్‌రావ్ పేరు మోసిన పెద్ద కాంట్రాక్టర్! హంగులన్నీ పుష్కలంగా వున్నవాడు!

ముఖ్యమంత్రి సైతం అతని జోలికి వెళ్ళడానికి భయపడతాడు. మళ్ళీ మోహన్‌రావే అన్నాడు.



# 'పవిత్ర పాపి' సీరియల్ పాఠకులకు ఆహ్వానం

వారం వారం పాఠకులు చెప్పే కథలకు విలువైన

## బహుమతులు

## నేరం... నేరం... నేరం... నేరం జరగని చోటు భూస్థలమంతా వెదికినా దొరకదు!

మానవ జాతి పుట్టింది మొదలు ఈ భూమండలమ్మీద ఎన్నెన్నో నేరాలు... ఘోరాలు... రక్తపాతాలు జరిగాయ్. జరుగుతున్నాయ్!

అయితే– ఆధునిక సమాజంలో వాటి సంఖ్య పెరిగి, పెరిగి "నేరం జరగని చోటు భూస్థలమంతా వెదికినా దొరకదు" అన్న మాట సామాన్య సూక్తిగా మారిపోయింది.

ఈ అంశాల మీద ఈ తరం పరిశోధనాత్మక రచయిత చల్లా సుబ్రహ్మణ్యం సంధిస్తున్న నవ్య సమ్మోహనాస్త్రమే 'పవిత్ర పాపి' సీరియల్. ఇదొక పరిశోధనాత్మక 'మహాయజ్ఞం.'

అయితే – ఈ రోజు సమాజంలో క్షణ క్షణం జరుగుతున్న కోట్లాది నేరాలను ఏ ఒక్కరూ సంపూర్ణంగా రాయలేరు. అందుకే అభిమాన పాఠకులందరికీ 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' ఓ అపూర్వ అవకాశాన్ని కల్పిస్తోంది.

ప్రతిరోజూ మీ చుట్టూ అనేక నేరాలు, ఘోరాలు అనేకం జరుగుతుంటాయ్. మీరు విన్నవి, చదివినవి, మిమ్మల్ని కదిలించినవి ఏవైనా సరే... నేర సంఘటనల గురించి మీకు వచ్చిన భాషలో రెండు అరఠావులపై కాగితానికి ఒక వైపే రాసి మీ ఫొటోతో సహా పంపండి. ప్రతీ వారం వచ్చిన వాటిలో ప్రచురణ యోగ్యంగా వున్న రెండు వాస్తవ గాథల్ని ప్రచురిస్తాం.

అచ్చయిన ప్రతి రచనకూ ఈ సీరియల్‌ను సమర్పిస్తున్న 'హెల్త్ హోం ప్రొడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్' వారు 50/– రూపాయిల విలువైన బహుమతిని అందజేస్తారు. అంతేకాదు– పాఠకులు చెప్పే చక్కటి కథలకు 'పవిత్ర పాపి' నవల కాపీని రచయిత ఆటోగ్రాఫ్‌తో పోస్ట్ ద్వారా పంపిస్తారు.

మనకి తెలిసిన నేరం అందరికీ చెబితే సమాజంలో నేర ప్రవృత్తిని తగ్గించిన వాళ్ళమవుతాం. ఒక సామాజిక ప్రయోజనాన్ని ఆశించి చేస్తున్న ఈ ప్రయోగంలో మీరూ భాగస్వాములు కావాలన్నది మా ఆకాంక్ష.

మీకు తెలిసిన నేరాన్ని గురించి వెంటనే రాసి పరిశీలనకి పంపండి.

రచనలు పంపవలసిన చిరునామా :

'నాకు తెలిసిన నేరం'
(పవిత్ర పాపి' సీరియల్)
ఆంధ్ర సచిత్ర వారపత్రిక
గాంధీనగరం, విజయవాడ–520003

"అయితే చిన్న రిక్వెస్ట్ సార్! పెళ్ళి రోజున మేం హడావుడిగా వుంటాం గనుక మీ సహాయం కావాలి. పెళ్ళికి కూడా అతిథుల్ని సెలెక్ట్ చేసి మరీ పిలుస్తాను. ఆవరణలో నా మనుషులు అతిథులందర్నీ ఓ కంట కనిపెడుతూ వుంటారు.... అయినా...."

"ఇట్సాల్ రైట్ మోహన్‌జీ! డోంట్ వర్రీ! సాయుధ పోలీసు జవాన్లనే కాదు. మఫ్టీలో అడుగడుగునా సి. ఐ. డి. లుంటారు. ఆ చుట్టు పక్కల ఏ కొత్త ముఖం కన్పించినా కస్టడీలోకి తీసుకుంటాం. అలాగే పెళ్ళికొడుకు తరఫున వచ్చే వాళ్ళని కూడా మీరు బాగా చెక్ చేస్తుండాలి!" చెప్పాడు డి. జి. పి.

"అలాగే సర్" అని డి. జి. పి. దగ్గర సెలవు తీసుకుని బయటికి వచ్చి కారెక్కాడు మోహన్‌రావ్.

అప్పటి వరకూ ఎదురుగా వున్న ఓ అపార్ట్‌మెంట్ చివరి అంతస్తులో ఓ గది కిటికీలోంచి బైనాక్యులర్స్ ద్వారా మోహన్రావ్‌ని పరిశీలించిన ఓ వ్యక్తి కర్టెన్ చాటుకి తప్పుకున్నాడు. అతని పెదవులపై సన్నటి నవ్వు మెరిసింది!

* * * * *

ముషీరాబాద్ జైలు!

తన ఎదురుగా నిలబడి వున్న ఖైదీని పరీక్షగా చూశాడు జైలు సూపరింటెండెంట్. సన్నగా పొడుగ్గా వున్న ఆ ఖైదీ వయసు యాభై దాటనప్పటికీ అరవై ఏళ్ళు పైబడ్డ వాడిలా వున్నాడు.

అతని మంచి ప్రవర్తన వల్ల విడుదల తేదీకంటే ముందే అతన్ని విడుదల చేశారు.

"గుడ్‌బై మిస్టర్ శ్రీనాధ్! నువ్వు ఈ జైల్లో ఆదర్శప్రాయమైన ఖైదీగా పేరు తెచ్చుకున్నావు. బయటకు వెళ్ళిన తర్వాత కూడా అలాగే వుండి జైలుకి దూరంగా ఉంటావని ఆశిస్తున్నాను!" అన్నాడు జైలు సూపరింటెండెంట్.

చిన్నగా నవ్వాడు శ్రీనాధ్. ఆ నవ్వులో జీవం లేదు. తనకు రావలసిన డబ్బు, బట్టలు తీసుకుని ఫార్మాలిటీసన్నీ పూర్తి చేసుకుని జైలు ఆఫీస్‌లోంచి బయటికొచ్చాడు శ్రీనాధ్!

దాదాపు అరగంట నుంచి జైలు ఆవరణ బైట కారులో కూర్చుని ఆయన కోసం ఎదురు చూస్తూ వున్నారు జస్టిస్ సీతాదేవి- దేదీప్య. ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు..... ఇద్దరిలో నూ ఒక విధమైన ఉద్వేగం.

శ్రీనాధ్ విడుదలైతే ఏం జరుగుతుంది? తిరిగి అతనికేమన్నా ప్రమాదం జరుగుతుందా? తమ రహస్యాలను బయట పెడతాడేమోనని దుండగులు అతన్ని వెంటాడతారా? అన్న ప్రశ్నలు సీతాదేవిని వేధిస్తున్నాయ్!

దేదీప్య చాలా రోజుల తర్వాత తండ్రిని కలుసుకోబోతోంది. తండ్రంటే దానికి ప్రాణం. ఆయన ప్రభావం దేదీప్య మీద ఎలా పడుతుందో! దాని మానసిక పరిస్థితి ఎలా వుందో! గత జీవితాన్ని గురించిన వివరాలు కూతురికి చెప్పవద్దని తాను శ్రీనాధ్‌కి చెప్పింది. అలాగేనన్నాడాయన. అయినా దేదీప్య ఆయన్ని ప్రశ్నలు వేసి వేధించకుండా వుంటుందా? ఆందోళనగా వుందామెకి.

ఇక్కడ దేదీప్య మనసు ఆనందంతో తేలిపోతోంది. యిన్నాళ్ళకి తను తన తండ్రిని కలుసుకోబోతోంది. ఎన్ని రోజులు..... ఎన్ని సంవత్సరాలు..... ఈ ఘడియ కోసం తన మనసు ఉవ్విళ్ళూరుతోంది. ఎంత భారంగా క్షణాలు లెక్కపెడుతూ ఎదురు చూసింది? ఆ మధుర క్షణాలు యిన్నాళ్ళకి రాబోతున్నాయ్!

అసలు నాన్నగారు జైలుకెందుకెళ్ళారో- ఆయన్ని అన్యాయం చేసిన మనుషులెవరో అడిగి తెలుసుకోవాలి. ఆయన జీవితాన్ని చీకటిమయం చేసిన నీచులు ఎవరో కనుక్కోవాలి.... అనుకుంటున్న దేదీప్య కిటికీలోంచి తల బయటికి పెట్టి చూసింది.

తల్లీకూతుళ్ళు ఉత్కంఠతతో ఎదురు చూస్తోన్న ఆ ఘడియ రానే వచ్చింది.

జైల్ మెయిన్ ఎంట్రన్స్ గేటు తెరుచుకుంది. శ్రీనాధ్ బయటికి వచ్చాడు. నిదానంగా కారు వేపు అడుగులు వేశాడు.

సీతాదేవి గుండె లయ తప్పింది. జైలు కటకటాల్లోంచి చూసిన మనిషికి- స్వేచ్ఛా ప్రపంచంలోకి అడుగు పెట్టి..... తమ వేపే అడుగులేస్తున్న వ్యక్తికీ ఎంతో తేడా!! కన్నార్పకుండా అలాగే చూస్తుండిపోయిందామె.

దేదీప్య ఆనందం పట్టలేక ఒక్క ఉదుటున కారు దిగి తండ్రికి అభిముఖంగా పరుగెత్తింది! ఎప్పుడూ జైలు బట్టల్లో.... చెయ్యని నేరానికి శిక్షననుభవించే దీనమైన ఖైదీలా కనిపించే తండ్రి ఈ రోజు తెల్ల డ్రెస్‌లో స్వేచ్ఛా జీవిగా..... హుందాగా అందంగా వున్నాడు.

పరుగెత్తుకు వెళ్ళి తండ్రి చెయ్యి పట్టుకుంది దేదీప్య. ఆమెకి నోట మాట రాలేదు! అప్రయత్నంగా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"బావున్నావా బేబీ!" అన్నాడాయన.

నోరు తెరిస్తే గట్టు తెంచుకుని దుఃఖం ఎక్కడ ప్రవహిస్తుందోనని మెల్లగా తల వూపింది దేదీప్య.

ఇద్దరూ కారు దగ్గరకొచ్చారు. భార్యాభర్తల కళ్ళు ఆప్యాయంగా పరామర్శించుకున్నాయ్!

కారు కదిలింది.

ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ శ్రీనాథ్ మాట్లాడ్డం ప్రారంభించాడు. ఇల్లు చేరేసరికి వాతావరణం తేలికయ్యింది. ముగ్గురూ కలిసి ముగ్గురికీ ఇష్టమయిన వంటకాలతో భోంచేశారు.

"నాన్నగారు కాస్సేపు రెస్ట్ తీసుకుంటారు గానీ, నువ్వెళ్ళి చదువుకో దేదీప్యా!" అంది తల్లి.

"లేదు మమ్మీ.... నేనూ నాన్నగారితో నే వుంటాను....." అంది గారాంగా.

"జైల్లో నేనేం కష్టపడ్డానని రెస్ట్ తీసుకోడానికి? బేబీని ఉండనియ్?" అన్నాడు.

జీవితంలో మొదటిసారి తల్లి తండ్రి మధ్య పడుకుని కబుర్లు చెప్పింది దేదీప్య.

* * * * *

శైలజ పెళ్ళి నిర్విఘ్నంగా ముగిసింది.

పోలీసులు వెయ్యి కళ్ళతో పరిసరాల్ని కనిపెడుతున్నారు. పెళ్ళి జరిగిన బిల్డింగ్ ఓ ఎత్తయిన ప్రదేశంలో వుండడం వల్ల ఆ బిల్డింగ్ వేపు ఏ కారు తిరిగినా సులభంగా దూరం నుంచే కన్పిస్తుంది.....

బహుమతులు తేవద్దని వెడ్డింగ్ కార్డుల్లో స్పష్టంగా ముద్రించడంతో అందరూ వట్టి చేతుల్తోనే పెళ్ళికి వచ్చారు. ప్రతి సంఘటననూ వీడియోలో చిత్రీకరించారు. టెంట్ నలుమూలలా పెళ్ళి కార్యక్రమం కనబడడానికి వీలుగా టీ. వీలు ఆరేంజ్ చేశారు.

టీవీల వల్ల పెళ్ళికి వచ్చిన వాళ్ళ మూవ్‌మెంట్స్‌ని తేలిగ్గా గమనించే అవకాశం కలిగింది సి ఐ డీలకూ పోలీసులకీ. పెళ్ళి పందిట్లో ప్రవేశించే ప్రధాన ద్వారం వద్ద మెటల్ డిటెక్టర్‌ని ఏర్పాటు చేశారు. అయితే మోహన్రావ్ కోరిక మేరకు ఆహూతులకి అనుమానం రాకుండా పోలీసులు కూడా అతిధుల్లాగానే ప్రవర్తించారు.

పెళ్ళిపంధిరినీ- తలంబ్రాలనీ- దండలనీ పోలీసులు రహస్యంగా చెక్ చేశారు.

మంగళసూత్ర ధారణ జరగడానికి ముందు డి. జి. పి. కళ్యాణ్‌రాం కూడా వచ్చాడు. పెళ్ళి అయిన తర్వాత షడ్రసోపేతమయిన విందు ఏర్పాటు చేశాడు మోహన్రావ్.

"అంతా సజావుగానే జరిగింది కదా!" అడిగాడు డి.జి.పి. మోహన్రావుని.

"జరిగింది సార్! అయినా పెళ్ళిలో గొడవ జరుగుతుందని నేను అనుకోలేదు" అన్నాడు మోహన్రావ్.

"ఆఫ్‌కోర్స్! అయినా రాకా చేసిన హెచ్చరిక వల్ల మా జాగ్రత్తలో మేమున్నాం".

"అందుకు కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాం సార్! అయినా నేనెన్నో బిల్డింగ్స్ కట్టాను. ఒక్కటీ కూలిపోలేదు. ఏదో ఖర్మం చాలక మోహన అపార్ట్‌మెంట్స్ కూలాయి. అయినా అందులో నా తప్పేమీ లేదని ఇంజినీర్ సర్టిఫై చేశాడు.

అయినా ఇంత బలగం వుండి ఒక వెధవెవడో బెదిరిస్తే బెదిరిపోయేటంత వాజమ్మను కాదు కదా! పైగా నా సర్కిల్లో అందరికీ రివాల్వర్ లైసెన్సులున్నాయనే విషయం మీకు తెలుసు! ఇక వాడేం చేస్తాడు సార్?"

"మీకా ధైర్యం వుంటే మంచిదే. అయినా మీ మీద కోపం కొత్త దంపతుల మీద ఎందుకు చూపిస్తాడు?" అని,

"యింతకీ వాళ్ళని హనీమూన్ ఎక్కడికి పంపిస్తున్నారు?" అడిగాడు డి. జి. పి.

"మరో నాలుగు రోజుల్లో శోభనానికి మంచి ముహూర్తముంది. శోభనం కాగానే వాళ్ళు స్టేట్స్‌కెళ్ళిపోతారు. అదే వాళ్ళ హనీమూన్!" అన్నాడు మోహన్రావ్.

"గుడ్! అయితే శోభనానికి వస్తాం!" అన్నాడు డి. జి. పి.

కంగారుపడిపోయాడు మోహన్రావ్.

"సార్! శోభనానికి పోలీసుల హడావుడి పెట్టకండి. యిప్పుడంటే పెళ్ళి గనుక ఫర్వాలేదు. శోభనానికి అతిథులెవరూ రారు. పోలీసులు అప్పుడు కనిపిస్తే అనవసరంగా నేను అల్లర్తిపాలవుతాను". అన్నాడు మోహన్రావ్.

డి. జి. పి. నవ్వాడు.

"కంగారుపడకండి మోహన్రావ్‌గారూ! మీ ప్రాబ్లం నాకర్థమయింది! కానీ నా ప్రాబ్లం కూడా మీరు అర్థం చేసుకోవాలి! మీరు ఆ హెచ్చరిక తీసుకుని మా దగ్గరకొచ్చినప్పటి నుంచీ మీ కుటుంబానికీ మీకూ రక్షణ కల్పించవలసిన బాధ్యత పోలీసు శాఖకు వుంది. అయితే యింత బలగం వుండదు. మీ మనుషుల్ని మీరు పెట్టుకోండి. నేను యిద్దరు ముగ్గురు ఆఫీసర్లని పంపుతాను. రొటీన్ చెకప్ అంతే! వాళ్ళు కూడా మఫ్టీలో వస్తారు...." అన్నాడు డి. జి. పి.

మోహన్రావ్ చేసేది లేక "మీ యిష్టం" అన్నాడు.

డి. జి. పి. కల్యాణ్‌రాం నూతన వధూవరులకు శుభాకాంక్షలు చెప్పి వెళ్ళిపోయాడు.

తర్వాత పెళ్ళివాళ్ళు ఎవరి విడిదిలోకి వాళ్ళు వెళ్ళిపోయారు. అక్కడున్న బంధువులు సత్యనారాయణస్వామి వ్రతానికి ఏర్పాట్లు చేస్తున్నారు.

నిశ్చింతగా ఫీలైన మోహన్రావు ఓ కుర్చీలో కూలబడి ట్రిబుల్ ఫైవ్ సిగరెట్ వెలిగించాడు.

ఇంతలో దూరంగా వెళ్ళిపోతున్న అతిథుల్లో ఒకతను వెనక్కి వచ్చి గొంతు కాస్త తగ్గించి-

"మనం అనుకున్నదంతా జరిగింది....!" అన్నాడు.

"ఏమిటి?" అడిగాడు మోహన్రావ్.

ఆ వ్యక్తి అటూ ఇటూ ఓసారి చూసి మెల్లగా మోహన్రావ్ చెవిలో ఏదో చెప్పాడు.




షాక్ కొట్టినట్టు అదిరిపడ్డాడు మోహన్రావ్. నోట్లోంచి సిగరెట్ జారి కింద పడింది!

"ఎప్పుడు?" అడిగాడు ఆతృతగా.

"ఇవాళే... మధ్యాహ్నం రెండు గంటలకి!" చెప్పాడా వ్యక్తి.

"సరే నువ్వెళ్ళు. రేపు ఉదయం ఆఫీస్‌కి రా. మనం మాట్లాడాలి! మిగతా వాళ్ళని కూడా పిలిపిస్తాను!" చెప్పాడు మోహన్రావ్.

ఆ వ్యక్తి సరేనని వెనక్కి తిరిగాడు.

"నువ్వు ఆ విషయం వర్రీ అవకు! నేను చూసుకుంటాను". అన్నాడు మోహన్రావ్ కఠినంగా.

"మీరుండగా మాకు వర్రీ దేనికి?" అని ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు.

ఆలోచిస్తూ మరో సిగరెట్ వెలిగించాడు మోహన్రావ్.

* * * * *

శ్రీనాథ్ విడుదలై మూడు రోజులయ్యింది.

ఈ మూడు రోజులూ మూడు క్షణాల్లా గడిచాయ్ దేదీప్యకి.

ఉదయాన్నే తండ్రిని నిద్ర లేపడం, బెడ్ కాఫీ యివ్వడం, పేపర్ చదివి వినిపించడం- స్నానం చేసాక బ్రేక్ ఫాస్ట్ రడీ చెయ్యడంతో ఆమె దినచర్య ప్రారంభమౌతోంది. తండ్రికి సంబంధించిన పనులేవీ కూడా నౌఖర్లు చెయ్యకూడదని ఆంక్షలు విధించింది దేదీప్య.

"నాన్నా! జైల్లో దొంగల మధ్య, హంతకుల మధ్య నీకు భయం వెయ్యలేదూ?" అని ... అడిగింది అమాయకంగా.

"లేదమ్మా- జైల్లో అందరూ దుర్మార్గులూ హంతకులూ ఉండరు. విధి వక్రించి క్షణికావేశంలో నేరాలు చేసి-జైలుపాలయిన మంచి వాళ్ళు కూడా వుంటారు. నేరస్తులుగా ఎవరూ పుట్టరమ్మా. సమాజమే నేరస్థుల్ని తయారు చేస్తుంది!" చెప్పాడాయన.

"మరి ఇన్ని తెలిసిన మీరు జైలుకెందుకెళ్ళారు నాన్నా?"

సమాధానంగా నవ్వి ఊరుకున్నాడు శ్రీనాథ్.

తల్లి ఇంట్లో లేని సమయంలో రాకా గురించి తండ్రితో చెప్పాలని అనుకున్న దేదీప్య తల్లి వెళ్ళిపోగానే తండ్రిని అడిగింది.

"నాన్నా! నువ్వసలు జైలుకెందుకెళ్ళావు?"

"యిప్పుడవన్నీ ఎందుకమ్మా! ఏదో వెళ్ళాను. యిప్పుడొచ్చేశానుగా!"

"అలా తీసెయ్యకండి నాన్నా! అమ్మ చెప్పదు. మీరూ చెప్పడం లేదు.... ఏం? ఆ విషయం నేను వినకూడనిదా నాన్నా?" సూటిగా అడిగింది.

తికమకపడ్డాడు శ్రీనాథ్.

"అని కాదమ్మా! తెలుసుకుని ఏమిటి ప్రయోజనం? జరిగిందేదో జరిగిపోయింది..." అని సర్ది చెప్పబోయాడు.

"ఊహూ.... సరదాగా చెప్పండి! వింటాను!" అంది మొండిగా.

శ్రీనాథ్ నిట్టూర్చాడు.

"మీ నాన్న నేరం చేసి జైలుకెళ్ళాడనీ- ఆ నేరం ఏంటో తెలుసుకోవాలనీ అనుకుంటున్నావ్ కదూ!" అనడిగాడు.

తల అడ్డంగా ఊపింది దేదీప్య.

"లేదు! మీరు నేరం చెయ్యరనీ.... నేరం చేసే మనస్తత్వం మీకు లేదనీ నాకు తెలుసు. మీరు ఒకవేళ నేరం చేసినా మీ మీదున్న గౌరవం తగ్గదు. అసలు యిన్నేళ్ళు మిమ్మల్ని జైల్లో మగ్గేలా చేసిన సంఘటనలేవో తెలుసుకోవాలను కొంటున్నాను. చెప్పండి!" అడిగింది దేదీప్య సీరియస్‌గా.

ఆ పిల్ల మాటలకు చలించాడు శ్రీనాథ్. తను జైలుకెళ్ళేటప్పుడు చాలా చిన్న పిల్ల. ఆ పరిస్థితులేమిటో తెలీక విలవిలలాడిపోతోంది.

"చెబుతానమ్మా! ఇది గతం. దీన్ని సీరియస్‌గా తీసుకోకూడదు". అంటూ జరిగిన సంఘటనలు వివరంగా చెప్పాడు. తన తండ్రికి జరిగిన అన్యాయం విన్న దేదీప్య గుండెని ఎవరో చెయ్యిపెట్టి కెలికినట్లనిపించింది.

# దేశ ప్రేమ ఉంటే కదా ద్రోహం చెయ్యటానికి?

అతనికి తన మాతృ దేశం అంటే ప్రేమ లేదు- అని అతనే అనేవాడు. ప్రేమ ఉంటే కదా ద్రోహం చెయ్యటానికి? అందుకని అతను ఒక శత్రు దేశానికి గూఢచారిగా పని చెయ్యటం మొదలుపెట్టినప్పుడు తను ద్రోహం చేస్తున్నానని అనుకోలేదు.

అతని సంగతి ఇలాగ ఉండగా అతని తోటివారు కూడా అతను దేశద్రోహం చేస్తున్నాడని నమ్మలేదు.

హారాల్డ్ అడ్రియన్‌రస్సెల్ ఫిల్బీ తండ్రి భారతదేశంలో బ్రిటిష అధికారిగా ఉండేవాడు. ఆయనకి మొదటి నుంచీ వలస ప్రాంతాల వారంటే సానుభూతి ఉండేది. చివరకి సౌదీ అరేబియా రాజుకి సలహాదారుగా చేరాడు.

హారాల్డ్ ఫిల్బీకి చిన్నప్పుడే "కిమ్" అనే ముద్దు పేరు పెట్టారు. ఇది ఒక సంస్కృతం మాట అనుకోవచ్చు. రుడ్యార్డ్ కిప్లింగ్ తన నవలలో ఒక పాత్రకి ఈ పేరు పెట్టాడు. ఆ పాత్ర (ఒక బాలుడు) తను ఎవరో తెలియక "బాధ" పడుతూ ఉంటాడు. అందుకనే ఈ నామధేయమన్నమాట.



"కిమ్" ఫిల్బీ వెస్ట్ మినిస్టర్, కేంబ్రిడ్జిలలో విద్యాభ్యాసం చేశాడు. వియన్నా (ఆస్ట్రియా దేశం రాజధాని)లో ఉంటూ అక్కడ కమ్యూనిస్టుగా మారాడు. అక్కడి నుంచి స్వదేశం తిరిగి వచ్చి బ్రిటన్‌కి తిరిగి వచ్చాడు. బ్రిటన్ రహస్యాలని రష్యాకి అందచేసేవాడు. ఫిల్బీ నడవడి అనుమానం కలిగించినా అతని తోటివార్నూ, పయివారూ కూడా దానిని అంతగా పట్టించుకునేవారు కారు. అయితే, అతను 1963లో హటాత్తుగా బెయిరుట్ నుంచి మాయమయిపోయాడు. మాయమయి రష్యాలో కనిపించాడు. ఇటీవలే కిమ్ ఫిల్బీ తన 76వ ఏట మరణించాడు. అతను రష్యా గూఢచారి సంస్థ "కె. జి. బి." లో ఒక "జనరల్" స్థాయికి ఎదిగాడు.

"నేను చనిపోతే నా శరీరాన్ని సోవియెట్ యూనియన్‌లో పాతిపెట్టండి. 1930 ప్రాంతం నుంచి ఇదే నా దేశం అనుకుంటూ ఉన్నాను" అన్న అతని కోరికని అనుసరించి సోవియెట్ ప్రభుత్వం కిమ్ ఫిల్బీని సైనిక మర్యాదలతో అక్కడే ఖననం చేశారు.

-గంటి రామలింగం

"అయినా అమ్మ అలా చెయ్యడం తప్పు నాన్నా!" అంది.

ఆశ్చర్యంగా చూసాడు శ్రీనాధ్ కూతుర్ని.

"ఔను నాన్నా! నిన్ను నిర్దోషిగా నిరూపించి ఆ దుర్మార్గులతో పోరాడాలి! అంతేగానీ ఎవరికో భయపడి అబద్ధపు సాక్ష్యంతో మిమ్మల్ని జైలుకి పంపడం ఘోరం!" అంది ఆవేశంగా.

"ఇందులో మీ అమ్మ తప్పేమీ లేదమ్మా! అప్పటి పరిస్థితులలా వున్నాయ్. ఆ పరిస్థితుల్లో నేను బైట వుంటే తప్పకుండా హతమార్చి వుండేవాళ్ళు!" అన్నాడు.

దేదీప్య యిక ఆ విషయం వాదించదలుచుకోలేదు. కానీ ఆమె మనసు మాత్రం తల్లి చర్యను సమర్ధించ లేకపోతోంది.

"ఎవరు నాన్నా ఆ నలుగురు?" అడిగింది.

క్షణం తటపటాయించి చెప్పాడు శ్రీనాధ్.

"మురళి- శంభులింగం, జగదీశ్వర్రావు, సోంబాబు....."

"ఇప్పుడు వాళ్ళంతా బ్రతికే వున్నారా?" అడిగింది మళ్ళీ.

"జగదీశ్వర్రావు చచ్చిపోయాడని విన్నాను. మిగిలిన ముగ్గురూ ఎక్కడున్నారో తెలీదు!" అన్నాడు.

ఆ ముగ్గురూ ఎక్కడున్నారో తెలిసి కూడా తనకి చెప్పడం లేదని గ్రహించింది దేదీప్య. అందుకే మళ్ళీ అడగలేదు.

"నాన్నా! నీకు రాకా తెలుసా?" అడిగింది సడన్‌గా.

ఉలిక్కిపడ్డాడు శ్రీనాధ్!

"పేరు విన్నానమ్మా! నొటోరియస్ క్రిమినల్ అని విన్నాను? ఏం?"

"అతనైతే ఆ దుర్మార్గుల్ని భస్మీపటలం చేసేవాడు! మిమ్మల్ని జైలుకి వెళ్ళనిచ్చేవాడు కాదు!" అంది ఆవేశంగా.

శ్రీనాధ్ కూతుర్ని నిదానించి చూశాడు.

టీనేజర్స్ అంతా యింతే! చిన్న విషయాలకి కూడా ఎగ్సైట్ అవుతారు. తన కూతురు కూడా తనకు జరిగిన అన్యాయానికి ఎగ్సైట్ అవుతోంది.... అనుకుంటూ ఆమెని మెల్లగా దగ్గరకి తీసుకుని-

"చూడమ్మా.... ఈ విషయాలేవీ నువ్ పట్టించుకోకు. నేను వచ్చేశానుగా! నా బంగారు తల్లివి కదూ! యిక నేనెప్పుడూ నీతో నే వుంటానుగా... అదుగో కారు హార్న్ వినబడుతోంది. అమ్మ వచ్చినట్లుంది...." అన్నాడు.

దేదీప్య కదల్లేదు. అలాగే తండ్రి గుండెలమీద తల ఆన్చి తనివితీరా ఏడ్చింది. కన్నీళ్ళతో ఆయన కూతురి తల నిమురుతూ ఉండిపోయాడు.

* * * * *

చిట్టి పాపా... చిరు నవ్వుల పాపా! చిన్ని పాపా! నా ముద్దుల పాపా!!! ఈ తండ్రికి నువ్వే.... లాలలా....!!!

ఐదేళ్ళ పాప మారాం చేస్తుంటే ఆ పాప తండ్రి ఆ పిల్లని భుజాన వేసుకుని కూని రాగం తీస్తూ పచార్లు చేస్తున్నాడు.

ఆ పాప ఏడవడం ఆపేసి- తండ్రి పాడుతున్న పాట వింటూ ఆయన కంఠాన్ని గట్టిగా కౌగలించుకుని మత్తుగా జోగుతోంది.

"చిట్టి తల్లీ! ఇక బెడ్ మీద పడుకుంటావా?" అడిగాడు తండ్రి.

"ఉహూ... ఇక్కడే బావుంది!" అందా పాప.

"అబ్బే.....! యిలా పడుకుంటే బావోదమ్మా! ఎంచక్కా అమ్మదగ్గర పడుకోవాలి!".

"ఉహూ.... వద్దు. నేను నీ దగ్గరే పడుకుంటాను". అందా పాప. తండ్రి బెడ్ మీద పడుకోగానే ఆ పిల్లకు నిద్ర ఎగిరిపోయింది. కళ్ళు తెరిచి తండ్రి ముఖంలోకి చూస్తూ కూర్చుంది.

"నిద్రపో తల్లీ!" అన్నాడు లాలనగా.

## రచయిత చిరునామా

చల్లా సుబ్రహ్మణ్యం
1-8-432, చిక్కడపల్లి,
హైదరాబాద్ - 500020.
ఫోన్ : 63476

"ఊహు- నిద్ర రావడంలేదు. నువ్వు పాట పాడు... ఏంటా!"

"నాకు పాటలు రావు తల్లీ! పోనీ టేప్ రికార్డర్ పెట్టనా?" అన్నాడతను.

"ఊహు... నువ్వే పాడు డాడీ! ఇందాక పాడావ్‌గా?"

అతను మెల్లగా హమ్ చేస్తూ పాట అందుకున్నాడు. గుర్తున్నంత వరకూ పాడుతూ మిగతా భాగం 'లల్లలా' అని కూని రాగాలు తీస్తున్నాడు. పాప నవ్వుతోంది.

సన్నజాజి పువ్వులు- చందమామ కాంతులు
చిన్నారి పాప నవ్వులు- మా యింటి వెలుగు
మా కంటి వెలుగు బంగారు జ్యోతుల దీవెనలు.....
లల్లలాలా.... లలలాలా..... లలలా....

పాట సాగుతోంది- పాప నిద్రపోతోంది.

అలా... అలా.... నిద్రలో.... ఓ చక్కటి కల వచ్చిందా పిల్లకి.

తండ్రి- తనూ కలిసి ఓ మేఘం మీద కూర్చుని ప్రయాణం చేస్తున్నారు. ఆకాశంలో ఆనందంగా వెళ్ళిపోతున్నారు.

అంతలో-

ఓ సుడిగాలి వాళ్ళని చుట్టుముట్టింది. ఆ సుడి గాలి తండ్రిని పూర్తిగా తన వేపుకి లాక్కుని ముందుకు లాక్కుపోతోంది.

"నాన్నా.... నాన్నా.... నాన్నా...."

పాప అరుస్తోంది బేలగా.

కల చెదిరిపోయింది. దేదీప్యకి హఠాత్తుగా మెలకువ వచ్చింది. దిగ్గున లేచి కూర్చుంది. కళ్ళు నులుముకుని చుట్టూ చూసింది.

తండ్రి పక్కనే వున్న మంచం మీద పడుకుని నిద్రపోతున్నాడు. ఏదో పుస్తకం చదువుతూ నిద్రపోయినట్టున్నాడు పుస్తకం అతని గుండెల మీద వుంది.

శ్రీనాథ్ జైలు నుంచి విడుదలయాక దేదీప్యకి ఈ కల రోజూ వస్తోంది. తండ్రిని ఎవరో లాక్కుపోతున్న ఫీలింగ్! దేదీప్య మెల్లగా లేచి వెళ్ళి తండ్రి గుండెల మీద పుస్తకాన్ని జాగ్రత్తగా తీసి టేబుల్ మీద పెట్టి దుప్పటి తీసి కప్పింది. ఏదో అలికిడి అయినట్టు శ్రీనాథ్ కళ్ళు తెరిచాడు.

"ఇంకా నిద్ర పోలేదా తల్లీ!" అడిగాడు ప్రేమగా.

దేదీప్య సమాధానం చెప్పకుండా తండ్రి వేపు తదేకంగా చూస్తూ-

"నాన్నా! మీరు.... నన్ను విడిచి ఎక్కడికీ వెళ్ళిపోరుగా?" అనడిగింది. ఆ మాటలంటున్న దేదీప్య కళ్ళ నిండుగా నీళ్ళు!

చప్పున కూతురి తలని తన గుండెల మీదికి లాక్కున్నాడుశ్రీనాథ్.

"లేదమ్మా.... ఎప్పుడూ ఎక్కడికీ.... నిన్ను విడిచి వెళ్ళను...." అన్నాడు వస్తున్న కన్నీళ్ళని ఆపుకుంటూ.

తండ్రి తల నిమురుతుండగా దేదీప్య తృప్తిగా కళ్ళు మూసుకుంది.

* * * * *

ఉదయం ఎనిమిది గంటలు!

తల్లి తండ్రితో కలిసి దేదీప్య యాదగిరిగుట్ట బయల్దేరింది. తమ మధ్య డ్రైవర్ కూడా వుండడం యిష్టం లేక అతన్ని వద్దని తనే స్వయంగా డ్రైవ్ చెయ్యసాగింది.

దేదీప్య పక్కన తండ్రి, వెనక సీట్లో తల్లీ కూర్చున్నారు. ఆమెకి చెప్పలేనంత ఆనందంగా వుంది రోజు. కాలేజీ ఎగగొట్టింది. తండ్రి విడుదలైనప్పట్నుంచీ దేదీప్య సరిగా కాలేజీకి అటెండ్ కావడంలేదు. క్షణం కూడా ఆయన్ని వదిలి ఉండాలనిపించడం లేదు. ఇన్నేళ్ళూ తను నష్టపోయిన తండ్రి సాన్నిధ్యాన్ని సాధ్యమైనంతగా పూడ్చుకోవాలని తాపత్రయపడుతోంది.

తల్లీ తండ్రీ ఫీలవుతున్నారో లేదో గానీ, ఒక్కోసారి దేదీప్యకే అనిపిస్తోంది. అసలు తాను వాళ్ళిద్దరికీ ఏకాంతం లేకుండా చేస్తున్నానేమోనని! ఎప్పుడో మంచి వయసులో వుండగా వాళ్ళు దారుణంగా విడిపోయారు. మళ్ళీ యిన్నేళ్ళకి కలుసుకున్నారు గనుక వాళ్ళు కూడా తనలాగే దగ్గరగా వుండాలని అనుకుంటున్నారేమోననే ఆలోచన వికసించిన ఆమె మనసులోకి వచ్చినప్పటికీ- మళ్ళీ తండ్రిని చూస్తూనే ఆ విషయం మర్చిపోతోంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఇరవై నాలుగ్గంటలూ జపించే రాకా పేరు కూడా తండ్రి సన్నిధిలో ఆమె మర్చిపోగలిగింది.

జీవితంలో తండ్రి అనే పాత్రకి కూతురి మీద అంత వాత్సల్యం ఉంటుందని ఆమె ఎన్నడూ ఊహించలేదు. ప్రతి క్షణం ఆయన కనుసన్నల్లో వుండాలని చిన్న పిల్లలా ఆరాటపడుతోంది.

"దీపా! పెట్రోల్ పోయిద్దాం కారాపు!" అన్న తల్లి మాటకి కారు స్లో చేసింది దేదీప్య.

"బేబీ! మీ మమ్మీ నీకు డ్రైవింగ్ చాలా బాగా నేర్పినట్టుందే!" అన్న తండ్రి మాటలకి నవ్వుతూ-

"మమ్మీ నాకు డ్రైవింగ్ నేర్పడమా? నేనే దొంగతనంగా నేర్చుకున్నాను. ఇప్పుడు మీరున్నారు గనుక ఊర్కుంది గానీ, మమ్మీకి అసలు నా డ్రైవింగ్ మీద నమ్మకమే లేదు!" అంది దేదీప్య.

"అదేమిటోయ్.... బేబీ ఇంత బాగా డ్రైవ్ చేస్తోంటే...." అన్నాడు శ్రీనాథ్.

"చాల్లెండి! యిప్పటి వరకూ అది ఎన్ని యాక్సిడెంట్లు చేసిందో అడగండి!" అన్న తల్లి మాటలకి దేదీప్య-

"కారన్న తర్వాత యాక్సిడెంట్లు తప్పవు కదా!" అంటూ పెట్రోల్ బంకలోకి మెల్లగా పోనిచ్చింది కారు.

అయితే నిజంగానే ఒక పథకం ప్రకారం రూపొందిన యాక్సిడెంట్ వాళ్ళని వెన్నాడుతుందనే విషయం ఆ క్షణంలో వాళ్ళ ముగ్గురికీ తెలీదు.

(ఇంకా వుంది)




# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

**వి. సుబ్రమణ్యం (16 సం.లు) ఉరవకొండ**

ప్ర: జ్ఞాపకశక్తి పెరుగుటకు, చదువునందు చురుకుగా నుండుటకు ప్రత్యేక మందు.

జ: బైద్యనాథ్ బ్రైన్ టాబిలెట్ 1 మాత్ర

బైద్యనాథ్ బ్రాహ్మీబటి (బుద్ధివర్ధక) 1 మాత్ర చొప్పున, బైద్యనాథ్ శంఖపుష్పి సిరప్‌తో ఉదయం సాయంత్రం విడవకుండా వాడవలయును.

**సి. సుందరరాజు (వయస్సు 28 సం.లు), నాగార్జునసాగర్**

ప్ర: తలజుట్టు ఊడి పోతున్నది. మంచి ఔషధము.

జ: వేడి చేసే పదార్థములు నిషేధము. తల మీద బాగా వేడినీటి స్నానము. సబ్బులు ఉపయోగించ వద్దు. నూనెగా బైద్యనాథ్ భృంగరాజ తైలం ఉపయోగించండి. మంచి ఫలితము కలుగును.

**ముసలయ్య (వయస్సు 45 సం.లు), చీపురుపల్లి**

ప్ర: మలబద్ధకము, నడుము నొప్పి, జీర్ణశక్తి లేదు.

జ: రాత్రిపూట తేలికగా ఆహారం తీసుకొని పడుకోపోయే టప్పుడు బైద్యనాథ్ కబ్జహర 2 చెంచాల చూర్ణం గోరు వెచ్చని నీటితో సేవించిన సుఖ విరేచనమై హాయిగా ఉండును.

బైద్యనాథ్ వాతరీనా 1 మాత్ర, బైద్యనాథ్ యోగరాజ గుగ్గులు 1 మాత్ర చొప్పున ఉదయం సాయంత్రం గోరు వెచ్చని నీటితో లోనికి సేవించండి. నడుముకి బైద్యనాథ్ రుమా ఆయిల్ మర్దనకు ఉపయోగించండి. మంచి గుణము కలుగును.

**జి. యస్. రావు (వయస్సు 18 సం.లు), విశాఖపట్నం**

ప్ర: గొంతుక భాగములో కుంకుడు కాయలంత రెండు కాయలు ఉన్నవి. నొక్కితే నొప్పి.

జ: బైద్యనాథ్ కాంచనార గుగ్గులు, బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగుతో ఉదయం సాయంత్రం కొంత కాలము సేవించండి. తగ్గవచ్చు. లేనిచో మంచి వైద్యుని సంప్రతించండి.

**సురేష్ (వయస్సు 35 సం.లు), విశాఖపట్నం**

ప్ర: శరీర బలం పెరగటానికి, బరువు పెరగటానికి, నీరసం తగ్గటానికి మంచి ఔషధం కావాలి.

జ: బైద్యనాథ్ విటా– ఎక్స్ 1 టాబిలెట్, బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ 1 చెమ్చా పాలతో ఉదయం, సాయంత్రం వాడుతూ, రోజు రెండు సార్లు భోజనం తరువాత బైద్యనాథ్ ద్రాక్షాసవ వాడండి.

**రమణి (వయస్సు 25 సం.లు), సాలూరు**

ప్ర: ఎప్పుడూ నీరసంగా ఉండటం, పనుల యందు అశ్రద్ధ... ఆకలి లేదు. మంచి ఔషధము కావాలి.

జ: బైద్యనాథ్ సుందరీ కల్ప ఫోర్టు ఉదయం సాయంత్రం విడవకుండా కొంత కాలము సేవించండి. మంచి ఆహారం, విశ్రాంతి అవసరము.

**రాజారావు (వయస్సు 35 సం.లు), పలమనేరు**

ప్ర: వివాహమయి 10 సంవత్సరము లయినది. సంతానం ముగ్గురు. ఇద్దరికీ ఉత్సాహము లేదు, పనుల యందు అశ్రద్ధ.

జ: బైద్యనాథ్ విటాఎక్స్ 1 మాత్ర, బైద్యనాథ్ చ్యవనప్రాశతో ఉదయం సాయంత్రం ఇద్దరూ పాలతో సేవించండి. మంచి ఆరోగ్యముతో ఉత్సాహముగా ఉంటారు.

**వై. నరసమ్మ (25 సం. లు), కర్నూలు**

ప్ర: ట్యూబెక్టమీ ఆపరేషన్ చేయించుకొన్నప్పటి నుండి కడుపులో నొప్పి.

జ: ఆపరేషను చేయించుకొని ఎన్ని రోజులైనది. సరి అయిన డాక్టరును సంప్రదించండి. అప్పటి వరకు బైద్యనాథ్ లూకోనిల్ 1 మాత్ర బైద్యనాథ్ సుందరీకల్ప ఫోర్టుతో ఉదయం సాయంత్రం ఒక నెల రోజులు వాడండి.

**పి. సి. వైజయంతి, బెంగుళూరు**

ప్ర: తలంతా దురద, పొట్టు, విపరీతంగా వెంట్రుకలు ఊడిపోతున్నవి.

జ: బాగా వేడి నీటితో తల స్నానం చేయవద్దు. బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగ్ ఉదయం సాయంత్రం లోనికి సేవిస్తూ, బైద్యనాథ్ మహాభృంగరాజతేల్ తల నూనెగా వాడండి.

**యవ్. వి. రమణా రావు, కాశీబుగ్గ**

ప్ర: మధుమేహము, అతిమూత్రము, నీరుడు తగ్గుటకు ఔషధము.

జ: బైద్యనాథ్ బహు మూత్రాంతకరస 1 మాత్ర ఉదయం పూట బైద్యనాథ్ బసంత కుసుమాకర రస మాత్ర సాయంత్రం కొన్ని రోజులు వాడండి.

**టి. క్రాంతి (30 సం.లు), వనపర్తి**

ప్ర: వ్రాస్తూ ఉంటే చేయి వణుకుతూ ఉంటుంది.

జ: బైద్యనాథ్ బ్రైన్ టాబిలెట్ 2 మాత్రలు, బైద్యన్యాథ్ విటా ఎక్స్ 1 మాత్ర చొప్పున బైద్యనాథ్ అశ్వగంధారిష్టతో ఉదయం సాయంత్రం లోనికి సేవించండి. బైద్యనాథ్ మహానారాయణ తైలం చేతులకు మర్దనకు ఉపయోగించండి.

**సిహెచ్. శారదమణి, హైదరాబాద్**

ప్ర: స్పారిర్‌తైసిస్. ఇదివరకు వ్రాసిన జవాబు చూసినాను. ఆ ఔషధములు వాడుతున్న మందులతో వాడవచ్చునా.

జ: విడిగా వాడితేనే మంచిది. అదిగాక మీరు చార్మినార్ దగ్గర గవర్నమెంటు ఆయుర్వేద హాస్పిటల్‌లో సంప్రదించితే మంచిది.

కూపన్




ఆంధ్ర సచిత్ర వారపత్రిక
బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

ప్రశ్న :...............................

...............................

...............................

పంపినవారి పేరు : CKIRALA

పూర్తి చిరునామా :



# ఎగిరే పళ్లెలు అభూతకల్పనా?!



జనవరి 24వ తేదీన జర్మనీ భూభాగం పై ఎగిరే పళ్లెలు (ఫ్లయింగ్ సాసర్స్) దాడి చేసాయా? గ్రహాంతర వాసులు అనుమానం రానటువంటి భూభాగం పై దాడికి యోచిస్తున్నారా?

ఫ్రాంకెన్‌టాల్ పైన నాలుగు పెద్ద ఫ్లడ్ లైట్లతో వెలుతురు చిమ్మే ఒక వస్తువును కొందరు మామూలు కంటితో చూడటంతో ఊహాగానాలకు ఆస్కారమిచ్చింది. పోలీస్ టెలిఫోన్ రాత్రంతా ఆగకుండా మ్రోగుతూనే ఉంది. వెర్నెర్ వాల్టర్ ఫోను కూడా నిశ్శబ్దంగా లేదు. గృహోపకరణ వస్తువులను అమ్మే వెర్నెర్ వాల్టర్ (30) మేన్ హీమ్‌లో నివసిస్తున్నాడు. బట్టల వ్యాపారి హాన్స్ జుర్‌జెన్ కొహ్లార్ (31). అతని మిత్రుడు. వీరిద్దరు కలసి అసాధారణ రోదసి పరిశోధనా కేంద్రాన్ని స్థాపించారు. దీనిని జర్మన్ పొడి అక్షరాలలో సి. ఇ. ఎన్. ఎ. పి. అంటున్నారు.

1973 నుంచి వారు భావ సారూప్యత గల మిత్రులతో యు. ఎఫ్. ఓ. (అన్ అయిండెటి ఫైడ్ ఫ్లైయింగ్ ఆబ్‌జెక్ట్స్) లని వదలకుండా పరిశోధిస్తూనే ఉన్నారు. వారు దాదాపు 370 కేసులను పరిశీలించి 'ఇతర గ్రహాలకు చెందిన జీవరాసులేవీ భూమి మీదకు దిగలేదు' అని పేర్కొన్నారు.

యువకులుగా ఉన్నప్పుడే వాల్టర్, కొహ్లార్ తమాషా అయిన ఫిల్ములకు, ఫోటోలకు, స్పేస్ షిప్, ఇతర గ్రహాలకు చెందిన అద్భుతమైన జీవాలకు, శాస్త్ర విజ్ఞాన సంబంధమైన కాల్పనిక సాహిత్యానికి చెందిన వాటికి ఆకర్షింప బడ్డారు. రోమాంచితాలయిన ఈ కథల వెనక కావలసినంత అభూత కల్పన ఉన్నదని వారు త్వరలోనే గ్రహించారు. ఉదాహరణకి గ్రహాంతర వాసుల దాడులుగా చెప్పబడుతున్న వాటిని ధృవ పర్చుకోవడం కోసం వీరు యు. ఎఫ్. ఓ. నిపుణుల ద్వారా చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

దీనితో వారికి సి. ఇ. ఎన్. ఎ. పి. నెలకొల్పాలనే ఊహ కలిగింది. ఆ స్నేహితు లిద్దరు ఏ మాత్రం సమయం చిక్కినా యు. ఎఫ్. ఓ. పరిశోధనలలోనే గడుపు తున్నారు.

ఎగిరే పళ్లాలను చూశామని ఎవరైనా అంటే వాళ్లని 60 ప్రశ్నలతో కూడిన పత్రంతో ఊపిరి సలపకుండా చేస్తున్నారు. పోలీసులను, వాతావరణ పరిశోధనా కార్యాలయాలకు, ఆకాశ రోదసీ కంట్రోలర్‌లకు, పరిశోధనాలయాలకు మంత్రిత్వ శాఖలకు టెలిఫోన్‌లు చేస్తున్నారు.

ప్రతిచిన్న పత్రికలో వార్తను క్షుణ్ణంగా చదివారు. ప్రపంచ మంతటా గల ఫెడరల్ రిపబ్లిక్ రాయబార కార్యాలయాలు, దౌత్య అధికారులతో వారు దృఢమైన సంబంధాల నేర్పరుచుకున్నారు.

ఆకాశంలో కారణాలని వివరించ లేనట్టి అద్భుతాలకి పరిష్కరించటానికి ప్రయత్నిస్తున్న వీరిద్దరి నుంచి లేఖలందుకున్న దూరప్రాచ్యంలోని చాలా మంది రాయబారులు వారి స్వంత పరిశోధనలు అనుసరించారు.

వాల్టర్, కోహ్లార్ కనిపెట్టిన వాటిని చూచి సి. ఇ. ఎన్. ఎ. పి. లోని వారు ఆశ్చర్య పోయారు. వారు 370 కేసులను పరిశీలించారు. వాటి గురించి నూటికి తొంభై తొమ్మిదింటిని రుజువులతో విశదీకరించారు.

ఎగిరే పళ్లెలు విమానాలో, గాలి బుడగలో, రోదసి నౌకలో, ఉల్కలో లేకుంటే ఉట్టి తమాషాలో అయ్యుండాలని కనుగొన బడింది.

ఫ్రాన్కెంటాల్ పైన ఉన్న వీటి దృశ్యం వివరించ బడింది. కొందరు ఆకాశంలోని శుక్రగ్రహం అనుకొని చూసారు. మరి కొందరు రామ్ స్టీన్‌లో ఉంచిన అమెరికా బాంబుల నుంచి బహిర్గత మయే వెలుగు అని సందిగ్ధంలో పడ్డారు. వెర్నర్, వాల్టర్ ప్రకటనలకు ప్రజల్లో ప్రతి స్పందనలు చాలా తక్కువగా వచ్చాయి. ఈయన 350 పేజీలు రాసారు. దీనిని ప్రచురించటానికి ప్రచురణ కర్తలలో ఏ ఒక్కరూ కూడా ముందుకు రాలేదు. త్రిప్పి పంపిన ప్రతి వాడూ "కుతూహలం పుట్టించే కథేకానీ మార్కెట్ విలువలేదు" అని రాసి పంపేవారు.

అమెరికాలోని యు. ఎఫ్. ఓ. దృశ్యాలతో ఏభై కాపీల 'సి. ఇ. ఎన్. ఎ. సి.' చిన్న పుస్తకాలను విక్రయానికి పెడితే ఒక్కరూ కొనలేదు.

ఎవ్వరికీ కూడా ఎగిరే పళ్లెల ఉదంతానికి భరతవాక్యం పలకడం ఇష్టం లేదు. వాల్టర్ ఫోను అలా మ్రోగుతూ ఉండవలసిందే. కొందరు బాంబులు పేలుస్తామని భయపెట్టేవారు. అయితే వాల్టర్, కొహ్లార్ జడవకుండా వారి కార్యక్రమాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు.

మేన్‌హీమ్‌కి, ల్యుడ్‌విగ్స్‌ఫెన్‌కి మధ్య అసాధారణ మైనది ఏమైనా జరిగి భౌగోళికేతర జీవాలు వస్తువులు ఏమైనా కనపడితే వాల్టర్, కోహ్లార్ వాటిపట్ల ఆరాధనా భావాన్ని ప్రదర్శించ టానికి సిద్ధంగా ఉన్నారు.

ఒ. వి.



బ్రెజిల్‌లో ఎగిరే పళ్లెలుగా భ్రమ కల్పించిన ఇవి కేవలం వాటి ఆకృతితో రూపు దిద్దుకున్న మేఘాలుగా గుర్తింప బడ్డాయి.

# గడియారం




## పి.వి.బి.రామారావు

ఇత్యేతన్నామ సహస్రం కథితంతే ఘటోద్భవ......
సర్వాప మృత్యు శమనం కాల మృత్యు నివారణం......
సర్వజ్వరార్తి శమనం దీర్ఘాయుష్య ప్రదాయనం....

లలితా సహస్రనామం చదువుకుని ఉత్తర పీఠిక దగ్గర కొచ్చేసరికి స్వరం కించిత్ హెచ్చించి మంచంమీద వున్న ఆయనకి స్పష్టంగా వినపడేలా చదివి సాష్టాంగ ప్రణామంచేసి ప్రసాదం పట్టుకుని బయటకు వచ్చింది రమారాజ్యం.

అంతవరకూ ఆమె గొంతు వింటూనే వున్న కోదండరామయ్యకి కళ్ళు మూతలుపడ్డాయి.

ముందు హాల్లో ట్యూబ్‌లైట్ వేసింది కోడలు. తరువాత వరండాలో దీ వేసింది.

"అమ్మా, యింట్లో ఎక్కడా చీకట్లు దోబూచులాడకుండా ఖణీగా వెలుతురుంటే లక్ష్మీప్రదమని బామ్మ చెప్పేది కదూ..... చూశావా యిల్లు యిప్పుడు ఎంత కలకలలాడుతోందో."

వరండాలో ఆ ట్యూబ్‌లైటు కొడుకు వేయించాడు. ఆ రోజు సన్యాసిరాజు మొదటినెల జీతంలో మొదటి ఖర్చు..... లైటు వెలుతురుచూసి చంటిపిల్లాడిలా ముచ్చటపడిపోయాడు.

"ఇది నీ కోడలు సలహా!" అన్నాడు తల్లితో. కొత్త కోడలు కొత్తింటి పిల్ల. కొత్త దీపం వంక చూసింది. ట్యూబ్‌లైటు వెలుతుర్లో బుగ్గలు ఎర్రగా గులాబీలా మిలమిలాడాయి.

మసకగా వున్న గదిలోకి రమారాజ్యం వచ్చింది. కోదండరామయ్య కళ్ళు విప్పాడు.

"ఏమండీ అదోలా వున్నారు..... ఒంట్లో....."

"అబ్బే ఏం లేదు.... నీ గొంతు వింటూ మోగన్నుపడింది."

"లేచి కాస్త బయటకు రారాదూ. మీ కుర్చీలో కూచుంటే మీకూ హాయిగా వుంటుంది. లేవండి ప్రసాదం యిదిగో. నోట్లోవేసుకోండి!"

పటికబెల్లం ముక్క కళ్ళకద్దుకొని నోట్లో వేసుకుని చెయ్యి తలకేసి రాసుకున్నాడు కోదండరామయ్య.

"ఏమిటండీ ఆ పరాకు? మళ్ళీ నొప్పి వచ్చిందా? మాత్ర వేసుకున్నారా?"

"అబ్బే, లేదు."

"ఏమిటండీ..... అదోలా వున్నారు? నాతో చెప్పండి! మళ్ళీ నొప్పి రాలేదుకదా?..."

"లేదే. నొప్పేమీలేదు."

"మరి?"

"ఏం లేదని చెప్పాగా" తలగడకి జేరబడ్డాడు కోదండరామయ్య.

"అసుర సంధ్యవేళ దీపం లేకండా......" అంటూ కోడలు లోపలికొచ్చింది.

"హమ్మయ్య!" కోదండరామయ్యకి ప్రాణం లేచివచ్చినట్టనిపించింది దీపం వెలగ్గానే.

"టైమెంతయిందో?"

రమారాజ్యం గోడగడియారం వంక చూసింది. పదకొండున్నరకి ఆగిపోయింది.

"సరోజా..... గడియారం కీ యివ్వడం మరచిపోయాడల్లే వుంది..... నువ్వు....."

"ఆ బల్ల ఎక్కడం నాకు భయం... మామయ్యగారూ. ఇదిగో ఈ గడియారం దగ్గరుంచుకోండి... ఆయన రాగానే కీ యిచ్చి టైము దిద్దిపెడతారు."

"సరేనమ్మా."

కోదండరామయ్య నడుం వాల్చాడు. గడియారం ఆగిపోయింది. ఆగిపోవడంలో ఆశ్చర్యం లేదు... పనిచేసినంతసేపు పనిచేసి ఏ యంత్ర మయినా ఆగిపోవాల్సిందే... దాని టైము ప్రకారం అది జరుగుతుంది కాల ప్రవాహం... ఎంత ఆలోచించినా అంతుతెగని వ్యవహారం... దేని సమయానికి అది జరిగిపోవాల్సిందే. –గురబ్రహ్మ స్వరూపం కాలం.... మనిషితో, మేధస్సుతో, ప్రజ్ఞతో, దరిద్రంతో, సంపదతో నిమిత్తంలేనిది..... అది కాలం."

ఆలోచనలో మళ్ళీ కళ్ళు మూతలుపడుతున్నాయి... కాని బలవంతంగా కళ్ళు విప్పుతూ అడిగాడు "సరోజా.... జయంతి ఎప్పుడు బయలుదేరుతున్నట్టు రాసింది..... రేపు సాయింకాలం కదూ..... లేక ఈ సాయంత్రమేనా?"

"వచ్చే బుధవారం సాయంకాలం మావయ్యగారూ... పిల్లలకి పరీక్ష లైపోగానే బయలుదేరుతానని రాసింది. రిజర్వేషన్ను చేయించేశారట."

"ఏం పరీక్షలో నమ్మా! ఆయన ఆరోగ్యం అల్లావుండి చూడాలని ఆరాటపడుతూంటే దిగ్గున లేచిరావడానికి కుర్రవెధవల క్వార్టర్లీ పరీక్షలు అడ్డువచ్చాయా మన వస్తువుకాని దయిపోయింతర్వాత ఏమనుకొని ఏం లాభం?..."

రమారాజ్యం ఉస్సురని నిట్టూర్చింది.

అల్లుడు మంచీ కత్తి మెత్తనా వుంటాయా అనుకుంది ఆరాటంలో సామెత సగం మరచి....

"లేవండి... మెల్లగా బయటకు తీసుకు వెళతాం. కుర్చీలో కూచుందురుగాని.... ఆ పిల్లకోసం ఎందు కంత ఆందోళనా? హాయిగా వుందిగా....."

"అబ్బే అందుకు కాదే..." కోదండరామయ్య గడియారం వంకే చూస్తున్నాడు.

ఒక్క క్షణం అక్కడ నిలబడి సరోజ బయటికి వెళ్ళింది.

"మీ మనసులో ఏదో వుంది. బయటికి చెప్పకూడదూ! దేనిగురించో ఆలోచించి తెగబాధపడిపోతున్నారు."

"ఏం లేదే.... బాబిగాడొచ్చే టైమయిందా?" అంటూ కోడలిచ్చిన గడియారం తీసి చూశాడు...

దానివంకే అలా చూస్తూ వుండిపోయారు. ఉస్సురని నిట్టూర్చి మళ్ళీ తలగడకి జేరబడ్డారు.

రమారాజ్యం మళ్ళీ లోపలికి వచ్చేసరికి భర్త కళ్ళుమూసుకుని వున్నాడు.

"ఏం అత్తయ్యగారూ..... మీరు బెంగపెట్టుకోకండి. ఏం పర్వాలేదని డాక్టరు చెప్పాడుగా. ఆయన దగ్గరే కూచుని ఆమాటా ఈమాటా చెప్పండి. మామయ్యగారు బాగా బెంగపెట్టుకుంటున్నారు."

### ప్రాబ్లమ్!

ఒకస్టేజ్‌లో
సంపాదన – బ్రతుకు ఈడ్చడానికి
సరిపోక ప్రాబ్లమ్!
మరో స్టేజ్‌లో
సంపాదించిన ధనాన్ని
ఎలా, ఏరూపంలో దాచాలో
విచిత్ర మైన ప్రాబ్లమ్!

–యస్. యస్. రెడ్డి

"ఏం చెప్పనమ్మా. ఏదో దిగులు. నిన్న బాగానే వున్నారు. ఎంతో నవ్వుతూ తిన్నది ఆ తోటకూర పోపూ – మజ్జిగా అన్నమే అయినా – ఎంతో సరదాగా వున్నారు.

ఈరోజు ఏమయిందో ఏమో. మళ్ళీ నొప్పి వచ్చిందేమో... బాబీ వస్తే ఆయనకు తెలియకుండా డాక్టరు నొకసారి రమ్మని కబురుపంపాలి..."

ఆవిడ దిగులుగా కూచుంది. కొంచెంసేపటి తరువాత పూజగదిలోకి వెళ్ళింది. ఆంజనేయస్వామికి మొక్కుకుని యింత సింధూరం ఆయన నుదుటన పెట్టాలనుకుంది.




సరోజ అటూ యిటూ తిరిగింది. ఏదోలావుంది తనకీ మనసు. ఆయన రోజూ ఈసరికి యింటికి రావాల్సిందే. ఆఫీసు పనిఎద్దడి ఎక్కువగా వుందో ఏమిటో...

మామగారి గదిలోకి వెళ్ళింది. ఆయన గుండెలమీద తన గడియారం చేతిలోనే పట్టుకుని ఆలోచిస్తున్నారు.

"మామయ్యగారూ!"

"ఆఁ!" తుళ్ళిపడ్డట్టు అడిగారు.

"ఏదో పరాకుగా వున్నారు. అత్తయ్యగారితోనూ ఏం మాటాడటం లేదట! ఆవిడ కంట తడిపెట్టుకుంటున్నారు. మీ కేమిటి లోటు? ఏమిటి బాధ? జయంతి గురించి మీరేమీ బెంగపెట్టుకోకండి. అతను చాలా మంచివాడు. అతనికి తగిన భార్య మా వదిన."

"అంతేనంటావా?" కోదండరామయ్య చేతిలోని గడియారాన్ని పక్క బల్లమీద పెడుతూ అడిగాడు."

"డాక్టరుగారు మరీమరీ చెప్పారట.... కంగారుపడ్డానికి ఏమాత్రం అవసరం లేదని రేపు ఆదివారం సాయింకాలం యిలా షికారుగా వస్తామనీ చెప్పారట..... మీరు సందడిగా వుండడంలేదని అత్తయ్యగారు బెంగ పెట్టేసుకుంటున్నారు."

"వెర్రిదమ్మా! అది పట్టి వెర్రిబాగులది. నాకుమాత్రం సరదానా? చలాకీగా, హాయిగా నవ్వుతూ వుండాలని వుండదూ. కాని కాలం ఎప్పుడూ మనం చెప్పినట్టే వినదుకదా. కాలం చేతుల్లో బొమ్మలం మనం.... దేని సమయానికి అది....."

"ఊరుకోండి మావయ్యగారూ. ఆవిడవింటే బెంబేలుపడిపోతారు. అలా బయటకు రండి. కుర్చీలో కూర్చుందురుగాని. నేను దిండు గలేబులూ అవీ మార్చి మీకు నచ్చిన పుస్తకం చదివి వినిపిస్తా" అంటూ ఆయనను మెల్లగా బయటకు తీసుకువస్తూ బల్లమీద గడియారం వంక చూసింది – అదీ ఆరు గంటలకి ఆగిపోయివుంది.

"ఏం చదవమంటారూ?" అంటూ రమారాజ్యం వరండాలోకి వచ్చింది.

"సరోజ చదువుతా నంటోంది... అమ్మా సరోజా... పక్క దులుపుతున్నట్టుంది... రా యిలా కూర్చో.... వంటయిందా?..."

"ఏం వంటో ఏమిటో నా కేం పాలుపోవడంలేదు. మీరు తినకుండా......"

గది లో పలనుంచి దభేలున శబ్దం.

"ఏమిటే అది?" రమారాజ్యం లోపలికెళ్ళింది.

"అరెరె! పడిపోయావా?..."

"దిగుతూవుంటే బల్ల తూగిందత్తయ్యా."

కోదండరామయ్య మెల్లగా లోపలకొచ్చాడు.

"దెబ్బతగిలిందా తల్లీ... నీ గడియారం యిప్పుడ్గా... నాకు టైంతో ఏం పని చెప్పు?..."

"నాకు దెబ్బేం తగల్లేదు మామయ్యగారూ. మీ మనసులో ఆరాటానికి కారణం నాకు తెలిసిపోయింది. అందుకే....."

బల్లమీద కోడలు చేతిగడియారాన్ని చూశాడు... అదీ దిద్దేవుంది.

"నువ్వు తెలివైన దానివమ్మా... అందుకే నా కొడుకు నిన్ను ప్రేమించి మరీ చేసుకున్నాడు. అది వాడి అదృష్టమే కాదమ్మా.... అది మా కుటుంబాని కంతటికీ అదృష్టం...."

–కోదండరామయ్యలో అంత ఉత్సాహం ఎందుకొచ్చిందో, కోడల్ని ఎందుకలా పొగొడుతున్నాడో రమారాజ్యానికి మాత్రం బోధపడలేదు. కోడలివంక అయోమయంగా చూసినా భర్త ముఖంలోని వెలుగుని చూస్తూమాత్రం ఆమె ముఖం గత మూడు నెలల్లోనూ ఎన్నడూ లేనంతగా వికసించింది. □

# సినిమా విశేషాలు

—జి. వి. జి.

## "కిరాయిగూండా"గా కృష్ణ ఎస్. ఎస్. రవిచంద్ర దర్శకత్వంలో

"జులై25 నుండి ఆగస్టు 5, సెప్టెంబర్ 1నుండి 15, అక్టోబర్ 21 నుండి 30 వరకు, ఆ తర్వాత నవంబర్‌షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది. మా హీరో, డైరెక్టర్‌లు హిట్ చేసిన 'రౌడీ నెంబర్ 1' కన్నా పవర్‌ఫుల్ సబ్జెక్ట్", అన్నారు శ్రీ రాజలక్ష్మీ మూవీస్ అధినేత అంగర సత్యం. ఈయన నిర్మించే పై చిత్రంలో రాధ, గౌతమి, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, నూతన్‌ప్రసాద్, సుధాకర్, వై. విజయ,

"జానకీరాముడు"లో విజయశాంతి, నాగార్జున





"మహారాజశ్రీ మా

పవన్‌కుమార్, చిడతల అప్పారావు, శ్రీరాజ్, చలప
రావు, పాత్రధారులు. ఎస్. లక్ష్మీకాంత కథకు సత
నంద్ సంభాషణలకర్త. రాజ్‌కోటి స్వరకల్పన
వేటూరి గీతాలు రాశారు. సాయికుమార్ శిల్ప
శివశంకర్ నృత్యాలు, సాహుల్ సాహసాలు, భర



సుగాడు"లో కృష్ణ, శ్రీదేవి

సంయుక్త దర్శకత్వం, సారిక రామచంద్రరావు- గాడి సత్యం- ఆనంద్ ప్రొడక్షన్, డి. వెంకటరత్నం కూర్పుతో అంగర విజయకుమార్, అంగర శ్రీనివాస్ సహ నిర్మాతలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: ఎస్. ఎస్. రవిచంద్ర.

## జంధ్యాల రచన, దర్శకత్వంలో "చూపులు కలిసిన శుభవేళ"

"సుధ అనే కొత్త హీరోయిన్‌ను పరిచయం చేస్తున్నాం. జూన్ 2 నుంచి జూలై 15 వరకు హైద్రాబాద్‌లో ఒకేషెడ్యూల్‌లో షూటింగ్", అన్నారు జంధ్యాల. ఈయన రచన, దర్శకత్వంలో కె. రాధాకుమారి నిర్మిస్తున్న సంతోష్ ఫిలిమ్స్ వారి పై చిత్రంలో మోహన్, నరేష్ నాయకులు. నూతన్‌ప్రసాద్, వేలు, కోట శ్రీనివాసరావు, వీరభద్రరావు, బ్రహ్మానందం. శ్రీలక్ష్మి ఇతర నటవర్గం. ఆదివిష్ణు కథ, రాజన్- నాగేంద్ర సంగీతం, దివాకర్ ఛాయ, యు. వి. పాణి సంయుక్త దర్శకత్వం, ప్రసాద్ ప్రొడక్షన్, గౌతంరాజు కూర్పుతో కోనేరు రవీంద్రనాధ్ నిర్మాణ సారధ్యం వహించే ఈ చిత్రం ఎం. ఎస్. రెడ్డి సమర్పణ.

## సాంకేతికనిపుణుల చిత్రం

"సస్పెన్స్ థ్రిల్లర్. విశాఖపట్నంలోనే షూటింగంతా", అన్నారు సి. వి. గణేశ్. ఈయన దర్శకత్వంలో, ప్రముఖ శిల్ప దర్శకుడు కొండపనేని రామలింగేశ్వరరావు సమర్పణలో, విఖ్యాత స్థిర ఛాయాగ్రాహకుడు తులసి నిర్మాణతలో జి. సత్య నారాయణ, ఎం. విజయలక్ష్మి నిర్మించే చిత్రం ద్వారా రామకృష్ణ అనే కొత్త కెమెరామన్ పరిచయం గావింపబడతారు. భరత్‌కుమార్‌సంభాషణలు, శివాజీరాజా సంగీతం, వీరప్ప- విజయ్ కూర్పుతో వి. సత్యవేణి సహ నిర్మాత.

"బందిపోటు"లో గౌతమి, సుమన్





ఇటీవల హైదరాబాద్‌లో జరిగిన స్వర్గీయ కన్నాంబ అవార్డు ఫంక్షన్‌లో అవార్డు గ్రహీత ఊర్వశి శారదకు సన్మానపత్రం సమర్పిస్తున్న శ్రీ టి. సుబ్బరామిరెడ్డి, జమున.

## "బంధువులొస్తున్నారు జాగ్రత్త!"

"ఇంటి యజమాని సత్యనారాయణ గొప్పగా బ్రతికినవాడు. బంధువుల తాకిడితో చితికిపోతాడు. రాబందులు తిష్ట వేసుకుని కూర్చుండి పోవడం వల్ల వచ్చే తిప్పలను అందంగా, అహ్లాదకరంగా తెరకెక్కిస్తున్నాం. జులై 1 నుంచి 25 వరకు మద్రాసులో, అగస్ట్ 1 నుంచి 10 వరకు కేరళలో షూటింగ్", అన్నారు శరత్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో చలసాని శరత్‌బాబు నిర్మిస్తున్న సేనా కంబైన్స్ వారి పై చిత్రంలో రాజేంద్రప్రసాద్, రజని, సత్యనారాయణ, శుభలేఖ సుధాకర్, కోట శ్రీనివాస రావు , వేలు, బ్రహ్మానందం, వై. విజయ, శ్రీలక్ష్మి, అన్నపూర్ణ, సూర్యకాంతం అదిగాగల వారు పాల్గొంటున్నారు. గిరిజశ్రీ భగవాన్ కథకు సత్యానంద్ సంభాషణలకర్త. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, శరత్ ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, రఘుబాబు కూర్పు తెర వెనుక హంగులు.

## హరి అనుమోలు దర్శకత్వంలో చిత్రం

"జూలైలో ప్రారంభోత్సవం," అన్నారు ఇదివరకు "శ్రీ వేమన చరిత్ర, గౌతమి" చిత్రాలను నిర్మించిన మండవ గోపాలకృష్ణ. ఈయన విశ్వామిత్ర క్రియేషన్స్ పతాకంలో నిర్మించే చిత్రానికి

సినిమా

ఛాయగ్రాహకుడు హరి అనుమోలు తొలిసారిగా దర్శకత్వం వహిస్తారు. నరేష్, కార్తిక్, గౌతమి అదిగాగల వారు పాల్గొంటారు.

## రూపశిల్పి నిర్మించే చిత్రం

"భూమియులే రాజా కన్మార్ - అనే విజయవంతమైన మలయాళ చిత్రం అధారం.




సెప్టెంబర్ నుంచి మన రాష్ట్రంలో ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు విజయశాంతి కార్యదర్శి, మేకప్‌మన్ ఎ. ఎం. రత్నం. ఈయన భగీరధ అర్ట్ పిక్చర్స్ బానర్‌లో నిర్మించే చిత్రంలో డాక్టర్ రాజశేఖర్ హీరో. ముత్యాల సుబ్బయ్య దర్శకుడు.

## నాగార్జునతో అన్నపూర్ణా స్టూడియోస్ చిత్రం

"జూన్ 16 నుంచి 24 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది. జూలై, అగస్ట్, సెప్టెంబర్‌లలో ప్రతి నెలా 11-25 తేదీల మధ్య జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు బి. గోపాల్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించే అన్నపూర్ణ స్టూడియోస్ వారి 11వ చిత్రంలో నాగార్జున, జయసుధ, విజయశాంతి, శరత్‌బాబు, నూతన్‌ప్రసాద్, పి. ఎల్. నారాయణ, అల్లు రామలింగయ్య, వేలు, రమణారెడ్డి, నర్రా వెంకటేశ్వరరావు, సంజీవి, డి. ఎస్. ఎన్. మూర్తి, వై. విజయ, మోహన్‌బాబు పాత్రధారులు. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. ఎన్. గోపాలరెడ్డి ఛాయ, భాస్కరరాజు శిల్పం, రఘు నృత్యాలు, మాణిక్యరావు- జానకిరాం ప్రొడక్షన్, మార్తాండ్ కూర్పుతో అక్కినేని వెంకటరత్నం ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. అక్కినేని వెంకట్ నిర్మాత.

## "నవ భారతం"

"అర్హతలన్నీ ఉండి ఉద్యోగాలు దొరకని యువతరం నిరాశా నిస్పృహలకు లోను కానక్కర్లేదు. స్వయం ఉపాధి కల్పించుకుని, ఎలా నవభారతం సృష్టించి, తమవంతు కర్తవ్యాన్ని ఎలా నిర్వహించుకోవచ్చో అనే ప్రాతిపదికపైన అల్లబడిన కథ," అన్నారు ముత్యాల సుబ్బయ్య. ఈయన దర్శకత్వంలో పోకూరి బాబూరావు సమర్పించే ఈతరం ఫిలిమ్స్ వారి పై చిత్రంలో రాజశేఖర్, నరేష్, శుభలేఖ సుధాకర్, రాఘవ, పి. ఎల్. నారాయణ, వేలు, నర్రా, సంజీవి, జీవిత, కల్పన, నిర్మల, చంద్రిక వగైరా నటవర్గం. మరుధూరి రాజా కథ, సంభాషణలు రాశారు. జాలాది, అదృష్టదీపక్, వంగపండు గీతాలను చక్రవర్తి స్వరపరిచారు. ఆర్. రామారావు ఛాయ, సోమనాథ్ శిల్పం, శివసుబ్రహ్మణ్యం – ప్రమీల నృత్యాలు, యోగి సంయుక్త దర్శకత్వం, శ్రీనివాస సహకార దర్శకత్వం, బి. వి. సుబ్బారావు – బెజవాడ కోటేశ్వరరావు, సి. హెచ్. కోటేశ్వరరావు ప్రొడక్షన్, గౌతంరాజు కూర్పుతో ఈ చిత్రాన్ని నిర్మించే పోకూరి వెంకటేశ్వరరావు "ఒంగోలు సమీపాన ధేనువు కొండ పరిసరాలలో జూన్ 15 నుండి జూలై 15 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది," అని తెలియజేశారు.

## వెంకటేశ్, రేవతిల "ప్రేమ"

"మా సురేష్ సంస్థ నవంబర్‌కు పాతికేళ్ళు నిండుతాయి. ఈ రజితోత్సవ సందర్భంగా డి. రామానాయుడు చారిటబుల్ ట్రస్టు'ను ఏర్పాటుచేశాను. ఈ ట్రస్ట్ సమర్పణలో ఏడాదికి ఒక చిత్రం చొప్పున నిర్మిస్తూ, వచ్చే ఆదాయంలో అరవై శాతం దాన ధర్మాలకు వినియోగిస్తాను. ఈ ట్రస్ట్ సమర్పణలో రాజేశ్వరి ఫిలిమ్స్ బానర్‌లో నిర్మిస్తున్న మొదటి చిత్రం ద్వారా సురేష్‌కృష్ణను డైరెక్టర్‌గా పరిచయం చేస్తున్నాను. జులై 6-25, ఆగస్ట్ 1-20, సెప్టెంబర్ 11-20 షెడ్యూల్‌లో హైదరాబాద్, వైజాగ్‌లో షూటింగ్ జరిపి, విజయదశమికి విడుదల చేస్తాను" అన్నారు డి. రామానాయుడు. ఈ చిత్రంలో వెంకటేశ్, రేవతి, మంజుల, గొల్లపూడి మారుతీరావు, నూతన్ ప్రసాద్, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. ఎల్. నారాయణతో పాటు మరో నాయిక ఉంటారు. అనంతన్ స్క్రీన్‌ప్లేకు సాయినాథ్ సంభాషణల కర్త. ఇళయరాజా స్వరకల్పనలో ఆత్రేయ గీతాలు రాశారు. పి. ఎస్. ప్రకాష్ ఛాయ, రఘు నృత్యాలు, షిందే సంయుక్త దర్శకత్వం, కోటేశ్వరరావు-పొన్నుస్వామి ప్రొడక్షన్, మార్తాండ్ కూర్పు నిర్వహిస్తున్నారు.

## "జీవనజ్యోతి"

"తనకు మాతృత్వం లేదనుకున్న ఓ గృహిణి, తన కుటుంబ వారసత్వం కోసం, భర్త సంతోషం కోసం, ఆయనకే రెండో పెళ్ళి చేస్తుంది. రెండో భార్య ఆ ఇంట్లో ఏకు మేకై తననే ఆ ఇంటి నుండి వెళ్ళగొట్టే పరిస్థితి ఏర్పరుస్తుంది. దరిమిలా ఆ రెండో భార్య కూతురికి వరకట్న సమస్య వల్ల పెళ్ళి ఆగిపోయే స్థితిలో తానే తాలిదానం చేసి ఆదుకుంటుంది. ఎన్నో మలుపులు గల 'తాలిదానం' అనే తమిళ చిత్రం ఆధారం. నా డైరెక్షన్‌లో జయసుధ నటించే మొదటి చిత్రమిది", అన్నారు రేలంగి నరసింహారావు. ఈయన దర్శకత్వం వహిస్తున్న నవభారత్ ఆర్ట్ మూవీస్ వారి పై చిత్రంలో శరత్‌బాబు, మనోచిత్ర, ఝాన్సి, శ్రీలక్ష్మి, నిర్మల, జయవిజయ, వీరభద్రరావు, పొట్టి ప్రసాద్, బ్రహ్మానందంతో పాటు ఓ కీలకమైన ముస్లిమ్ పాత్రలో రాజేంద్రప్రసాద్, ఈయన జోడీగా కుష్బూ నటిస్తున్నారు. ఎ. వి. మోహన్ కథకు సత్యానంద్ సంభాషణల కర్త. రాజ్-కోటి సంగీతం, శరత్ ఛాయ, రమణబాబు సంయుక్త దర్శకత్వం, రాజేష్ సహకార దర్శకత్వం, ఎ. నాగరాజు నిర్వహణ, రాజేంద్రప్రసాద్ శిల్పం, చిన్నికృష్ణ- నరసింహమూర్తి ప్రొడక్షన్, రవి కూర్పు నిర్వహిస్తున్నారు. "జూన్, జూలైలలో జరిగే రెండు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు నిర్మాత డి. ప్రతాపరాజు. (82 వ పేజీ చూడండి).

"అమ్మకానికో అబ్బాయి"లో నూతన హీరో ఎ. కోటేశ్వరరావు, సాగరిక





# సుమలత సమాధానాలు

### ఎల్. పి. ఆశారాణి, కోవెలకుంట్ల

ప్ర: పెళ్ళయితే బుద్ధి వస్తుందంటారా?

జ: బుద్ధి రావలసిన వయసొస్తుంది.

### చక్కా విజయలక్ష్మి, దొడ్డేరు

ప్ర: గుణమున్న చోట సౌందర్యముండదు. సౌందర్యమున్న చోట గుణముండదు. ఎందుకండీ?

జ: అసలు గుణమే సౌందర్యం కాదా?

### కాజ సత్యభామ, ద్రోణాచలం

ప్ర: స్వభావానికి, అలవాటుకు తేడా ఏమిటండీ?

జ: పుట్టుకతో వచ్చేది స్వభావం. ఆ తర్వాత వచ్చేది అలవాటు.

### పి. ఉమాదేవి, పర్లాకిమిడి

ప్ర: లతక్కయ్యా! పెళ్ళికాని పిల్ల ఇంటికి ముల్లులాంటిది. మరి, పెళ్ళికాని యువకుడు...?

జ: ఊరికే ముల్లు.... కదా?

### ఎం. మహమ్మద్ రఫీ, సోంపేట

ప్ర: డబ్బు కూడబెట్టడం కష్టమా, ఖర్చు పెట్టడం కష్టమా?

జ: కూడబెట్టిన డబ్బు ఖర్చు పెట్టడమే మనసుకు కష్టం.

### సిహెచ్. రాజమౌళి, కాకినాడ

ప్ర: నా అభిమాన తారా! పగటి కలలకు, రాత్రి కలలకు తేడా ఏమిటి? చెప్పగలరా?

జ: పగటి కలలు కనేది సోమరిపోతు. శ్రమించేవారు కనేవి రాత్రి కలలు.

### ఎం. ఎ. సరస్వతి, హుస్నాబాద్

ప్ర: ఎంతటి చిక్కు ప్రశ్నకయినా చక్కని సమాధానమిస్తారు కదా! మీకంతటి బుర్రను ఎవరిచ్చారండీ?

జ: మీ పేరు గలవారే.

### పాయక దక్షిణామూర్తి, రాయఘడ

ప్ర: పేదలకు మద్యపాన నిషేధం అవసరమంటాను. మీరేమంటారు?

జ: ధనికుల మేలుకు మాత్రం అవసరం కాదా?

### జె. ప్రసాదరావు, మండపేట

ప్ర: మన నటీనటులకు, పాశ్చాత్య నటీనటులకు తేడా ఏమిటి?

జ: హాలీవుడ్ తారలు ఒకేసారి ఎన్నో చిత్రాలలో నటించ రు.

### వి. సంధ్యారాణి, రేపల్లె

ప్ర: సోదరీ! సంకల్పానికి, కోర్కెకూ ఉన్న వ్యత్యాసమేమిటో చెప్పగలరా!

జ: మొదటిది విశాల హృదయాలలో ఉద్భవిస్తుంది. రెండోవది మామూలు హృదయాలలో జనిస్తుంది.

### యార్లగడ్డ శేఖర్‌బాబు, ఛత్రపూర్

ప్ర: ఒక తార సామర్థ్యాన్ని సంభాషణోచ్చారణను బట్టి నిర్ణయించవచ్చా లేక భావ ప్రకటనను బట్టి నిర్ణయించవచ్చా?

జ: భావ ప్రకటనే తొలి అంశం.

### పామిడి రంగనాయకమ్మ, డోర్నకల్లు

ప్ర: ఆడది అబద్ధమాడితే గోడ పెట్టినట్లు అంటారు. మరి, మగాడు అబద్ధమాడితే....?

జ: గోడ దూకినట్లు.

### ఎన్. సుగంధి, కావలి

ప్ర: సంసారమనేది ఒక రూపాయి నాణెమనుకుంటే, అందులో భర్త 'బొమ్మ', భార్య 'బొరుసు' అన్నాడో తత్త్వవేత్త. ఐతే, పిల్లలో...?

జ: చిల్లర.

### కాజ శరభయ్య, హనుమాన్‌జంక్షన్

ప్ర: ఈ రోజుల్లో దొరికే కల్తీ లేని సరుకేది?

జ: కొబ్బరికాయలు.

### ఎస్. వి. వినయకుమార్

ప్ర: మేం సంపన్నులం. చిత్రాలను నిర్మించగల స్థోమత నాకుంది. మీరు హీరోయిన్‌గా, నేను హీరోగా ఒక సినిమాను ప్రొడ్యూస్ చేయాలని ఉంది. షూటింగ్ ముహూర్తం ఎప్పుడు పెట్టుకోమంటారు?

జ: ఏప్రిల్ ఫస్టన.

### ఎస్. మహమ్మద్ అలీ, రాయచూరు

ప్ర: సుమలతాజీ! లాటరీలో మీకు లక్ష రూపాయలొస్తే ఏం చేస్తారు?

జ: అందులో సగం డబ్బు మీకిస్తే, ఏం చేస్తారు?

### అర్పేటి మంజునాధ్, పవరుపేట

ప్ర: దుఃఖమునకు హేతువు ఆశయే కదా?

జ: జీవితానికి మూలం కూడా.

— కూపన్ —

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న..........................................................

..........................................................

..........................................................

పంపినవారి పేరు..........................................................

పూర్తి చిరునామా..........................................................

సీరియల్

# తమస్





హిందీమూలం: డా|| భీష్మ సాహ్నీ

తెనుగుసేత: డా|| యార్లగడ్డ లక్ష్మీప్రసాద్

జరిగినకథ– 3: మురాద్అలీ చూపిన ఆశతో నత్తూ అష్టకష్టాలు పడి పందిని చంపేస్తాడు. కాంగ్రెసు నిర్వహించే ప్రభాతప్రదర్శనకు బక్షీ, అజీజ్, మెహతా, కాశ్మీరీలాల్, శంకర్ వస్తారు. పారిశుధ్య కార్యక్రమం కోసం ఇమామిదిన్‌పేటకు బయలుదేరతారు. నత్తూకు ప్రభాత ప్రదర్శన ఎదురవుతుంది. ముస్లింలకు, ప్రభాత ప్రదర్శన బృందానికి ఘర్షణ మొదలవుతుంది. నత్తూ భయపడి పారిపోతాడు. డెప్యూటీ కమీషనర్ రిచర్డ్ భార్య లీజాకు ఆ ప్రాంతాన్ని చూపి చారిత్రక విశేషాలు చెపుతుంటాడు.

(గత సంచిక తరువాయి)

"అక్కడ ఒక మ్యూజియం ఉన్నది. నీకు అది తప్పకుండా నచ్చుతుంది. కొద్ది రోజుల క్రితమే నేనక్కడనుండి గౌతమబుద్ధుని బొమ్మ ఒకటి తెచ్చాను."

"నీ దగ్గర బొమ్మలు తక్కువయ్యాయని మరొకటి తీసుకొచ్చావా."

"లేదు. అక్కడ త్రవ్వకాలు జరుగుతున్నాయి. చాలా బొమ్మలు దొరికాయి. క్యూరేటరు నాకొక బొమ్మను బహుమతిగా ఇచ్చాడు."

వివిధ రకాల బొమ్మలతో, జానపద కళామూర్తులతో, చిత్రాలతో, పుస్తకాల బీరువాలతో నిండిన రిచర్డ్ గది లీజా కళ్ళముందు మెదిలింది. ఈ అలవాటు అతనికి కెన్యాలో ఉన్నప్పుడు కూడా ఉండేది. అక్కడ ఉన్నప్పుడు ఆఫ్రికా జానపద కళామూర్తుల నమూనాల్లను, విల్లు, బాణాలు, పక్షుల ఈకలు పోగుచేస్తూ ఉండేవాడు. ఇక్కడ బొమ్మలు పోగు చేస్తున్నాడు.

లీజా దృష్టి మరల చుట్టుప్రక్కల దృశ్యాలవైపు మళ్ళింది. కుడివైపున కింద భాగంలో దట్టమైన చెట్లతో కూడిన అడవి ఉంది. దానిగుండానే వారు గుర్రాల మీద ఈ గుట్టపైకి వచ్చారు. ఇక్కడ నుండి చూస్తే ఆ దృశ్యం ఎంతో అందంగా ఉంది.

"ఇక్కడ మట్టి ఎట్లా ఉంటుంది. ఎరుపు రంగులో ఉంటుందా?" లీజా గుట్టలవైపు చూస్తూ అడిగింది. మరల రిచర్డ్ వైపు తిరిగి "మనం తిరిగి వెళ్ళే దారి ఎటు? మరలా అడవి మార్గంగుండానే వెళ్ళాలా సరే! అలెగ్జాండరు హిందూ దేశానికి వచ్చినదారి చూపించు?" అడిగింది.

"ఆ రోజుల్లో సరైన రోడ్లు లేవు. ఒక పాతరోడ్డు మాత్రం– నాల్గు వందల ఏండ్లది. ఆ గుట్ట వెనకవైపు నుంచి వెళుతుంది.

లీజా రిచర్డ్ వైపు చూసింది. మందపాటి ఫ్రేము గల కళ్ళద్దాల క్రింద రిచర్డ్ ముఖం ఎంతో నాజూగ్గా ఉంది. రిచర్డ్, ఇక్కడి రాళ్ళు శిథిలాల విషయం వదలిపెట్టి తనతో ప్రేమ ముచ్చట్లు చెబితే ఎంత బాగుండును అన్పించింది లీజాకు. కాని రిచర్డ్ పూర్తి తన్మయత్వంలో మునిగిపోయి ఉన్నాడు.

"ఈ ప్రాంతపు ప్రజలు ప్రాచీన కాలం నుండి వందలాది సంవత్సరాలుగా ఇక్కడే నివసిస్తున్నారు". లీజా వంక చూసి– "నువ్విక్కడి ప్రజలను పరీక్షగా చూసావా? ఒకే మాదిరిగా ఉంటారు. కనుముక్కు తీరు, వెడల్పాటి నుదురు, తేనె రంగు కళ్ళు– నువ్వు వీళ్ళను సరిగ్గా చూశావా లీజా!" రిచర్డ్ అడిగాడు.

"ఒకే రూపంలో ఎట్లా ఉంటారు? పైగా రకరకాల ప్రజలు ఈ మార్గం వెంటే వచ్చారని చెప్పావు.

"అది కాదు లీజా! ఈ విషయమే అందరూ మర్చిపోతూ ఉంటారు" రిచర్డ్ గొంతులో ఉద్వేగం ధ్వనించింది. అతను పరిశోధకుడు వాదించినట్లు మాట్లాడసాగాడు.

మధ్య ఆసియా నుంచి మొట్ట మొదట ఇక్కడికి వచ్చిన వారి సంబంధీకులే శతాబ్దాల తర్వాత ఇతర దేశాల నుండి ఇక్కడికి వచ్చారు. అందరి రూపం, జాతి

ఒక్కటే. ఆర్యులుగా పిలువబడేటటువంటి వారు. వేల సంవత్సరాల పూర్వం ఇక్కడికి వచ్చారు. మహమ్మదీయులని పిలువబడే వారు కూడా వందల సంవత్సరాల క్రితమే ఇక్కడికి వచ్చారు. అందరూ ఒకే మూల జాతికి చెందినవారే."

"ఈ విషయాలన్నీ ఇక్కడి ప్రజలకు తెలుసుననుకుంటాను?" ఇక్కడి ప్రజలకు ఏమీ తెలియదు. మనం చెప్పింది వీళ్ళకు తెలుసు. వీరికి తమ చరిత్ర కూడా తెలియదు. ఏదో బ్రతికేస్తు ఉంటారు." లీజాకు విసుగు మొదలైంది. రిచర్డ్ ఏదైనా విషయాన్ని మొదలుపెడితే సర్వం మర్చిపోతూ ఉంటాడు. లీజా






అంటే అతనికి ప్రాణమే. కాని పుస్తకాలతో, చారిత్రక పరిశోధనలతో, డిప్యూటీ కమిషనర్‌గా తన వ్యవహారాల్లో మునిగిపోయే రిచర్డ్ లీజాతో గడపటానికి సమయమే ఉండదు.

గదిలో పుస్తకాల బీరువా ముందు నిలబడి ఏదైనా పుస్తకం చేతిలోకి తీసుకుంటే పేజీలు తిప్పుతూ ప్రపంచాన్నే మర్చిపోతూ ఉంటాడు. అందుకే లీజా విసుగెత్తిపోతూ ఉంటుంది. ఆ విసుగుకు అంతం ఉండదు. దేశీయులు శత్రువుల్లాగా చూస్తూ ఉంటారు. చివరకు ఆ విసుగు కారణంగా 'నెర్వస్ బ్రేక్‌డౌన్'కు గురి అవుతుంటుంది. తత్ఫలితంగా నెలల తరబడి విదేశాలకు వెళ్ళిపోతూ ఉంటుంది.

"ఇక్కడేమైనా పిక్‌నిక్ స్పాట్ ఉన్నదా?" రిచర్డ్ దృష్టిని మళ్ళించటానికి లీజా అడిగింది.

రిచర్డ్‌కు చెళ్ళున చరిచినట్లయింది. కాని ఈ ప్రశ్న అతనికి అసంగతంగా అన్పించలేదు.

"చాలా ఉన్నాయి". అంటూ చేతిలోని కమ్చీతో ఎత్తుగా ఉన్న పర్వతం వైపు చూపిస్తూ చెప్పసాగాడు. "ఆ కొండ పై భాగంలో జలపాతాలు దట్టమైన చెట్లు, పొదలు ఉన్నాయి. నీటి ధారలు కొండపై నుండి జారుతూ ఎంతో మనోహరంగా కన్పిస్తాయి. హిందూవులు ఈ జలపాతాల క్రింద కొన్ని రాళ్ళను ఎన్నుకుని అక్కడ.... ఏర్పరుచుకుంటారు. ఈ జలపాతాలకు వేరు వేరు పేర్లు పెడుతుంటారు. రాముడు, సీత మొదలైన పౌరాణిక పేర్లు పెడుతూ ఉంటారు". లీజా వైపు తిరిగి– "ప్రతి చోట గుర్తు తెలియని ప్రసిద్ధ వ్యక్తుల సమాధులు ఉంటూ ఉంటాయి. ప్రజలక్కడ దీపారాధన చేస్తుంటారు. ప్రాచీన దేవాలయాలు, కోటలు చాలా ఉన్నాయి. కొంచెం కుడి వైపున సన్న విహార క్షేత్రం ఉన్నది. అక్కడ ఎవరో మహ్మదీయ సాధువు సమాధి ఉన్నది. అక్కడ వసంతరుతువులో పెద్ద ఉత్సవం జరుగుతుంది. దూర ప్రాంతాల నుండి ఆటకత్తెలు, పాటకత్తెలు అక్కడికి వస్తారు. ఆ ఉత్సవం పదిహేను రోజుల పాటు జరుగుతుంది. ప్రజలు పగలంతా జూదమాడి రాత్రి తాగి తందనాలాడుతారు. నిన్ను కూడ ఎప్పుడైనా అక్కడికి తీసుకువెళ్తాను".

"ఇప్పుడక్కడ ఉత్సవం జరుగుతున్నదా?"

"అవును. కాని, ఇప్పుడు అక్కడికి వెళ్ళటం మంచిదికాదు".

"ఎందుకని?"

"ప్రస్తుతం అక్కడ హిందూ మహమ్మదీయుల మధ్య స్పర్థలు పెరిగి ఉన్నాయి. గొడవలు జరిగే ప్రమాదముంది".

లీజా హిందూ మహమ్మదీయుల సంగతి కొంచెం విని ఉన్నది. కాని ఆమెకు అర్థమయింది చాలా తక్కువ.

"నేను, ఈ హిందూ - ముస్లింలను వేరు వేరుగా, గుర్తించలేను రిచర్డ్! ఎవరు హిందూవో, ఎవరు ముస్లిమో నీవు వేరు వేరుగా తెలుసుకోగలవా?"

"ఆఁ నేను తెలుసుకోగలను!"

"మన ఇంటిలోని వంటవాడు– హిందూవా? మహమ్మదీయుడా?"

"మహమ్మదీయుడు".

"నువ్వెలా తెలుసుకున్నావు?"

"అతని పేరునుబట్టి, అతని చిన్న గడ్డం, వేష భాషలు. పైగా నమాజు చేస్తాడు. అతని ఆహారపు అలవాట్లు కూడా వేరుగా ఉంటాయి.

"నీకన్నీ తెలుసా రిచర్డ్?"

"ఏదో కొద్ది కొద్దిగా తెలుసు".

"కొంచెమేమిటి. నీకు చాలా విషయాలు తెలుసు. నాకైతే ఏమీ తెలియదు నువ్వు నాకు కూడా అర్థం అయ్యేటట్లు చెప్పాలి. ఆ రోజు స్టేషన్‌కు వచ్చిన నీ సెక్రటరీ ఎవరు?"

"అతను హిందూవే!"

"నువ్వెట్లా తెలుసుకున్నావు?"

"అతని పేరును బట్టి".

"పేరును బట్టి తెలుసుకోగలవా?"

"అది చాలా తేలిక లీజా! మహమ్మదీయుల పేర్ల చివర అలీ, దీన్, అహమద్, మొదలగు శబ్దాలుంటాయి. హిందువుల పేర్ల చివర లాల్‌చంద్, రామ్ మొదలైన మాటలుంటాయి. రోషన్‌లాల్ అయితే హిందువని రోషన్‌దీన్ అయితే మహమ్మదీయుడని, ఇక్‌బాల్‌చంద్ అంటే హిందువని, ఇక్‌బాల్‌అహమద్ అయితే ముస్లిం అని తెలుసుకోవచ్చు".

"ఇట్లా అయితే నేనెప్పటికి తెలుసుకోలేను"లీజా నిరుత్సాహంగా అన్నది.

"నీ బండి నడిపే ఆ తలపాగా చుట్టుకొన్న పెద్ద గడ్డపు మనిషి ఎవరు?"

"అతను సిక్కు".

"ప్చ్... అతన్ని గుర్తు పట్టడం పెద్ద 'కష్టం కాదనుకుంటాను!" లీజా నవ్వుతూ అన్నది.

"సిక్కులందరి పేర్ల చివర 'సింగ్' అన్న మాట తగిలించబడుతుంది" రిచర్డ్ చెప్పాడు.

ఇద్దరూ గుట్టమీద నుండి మెల్లగా కిందకు దిగసాగారు. చల్లటి గాలి మెల్లగా వీస్తుంది. సూర్యుడు అప్పుడే పైకి వస్తున్నాడు.

"ఈ ప్రాంతం తిరగడానికి ఎంతో బాగుంటుంది. నీక్కూడా ఎంతో సరదాగా ఉంటుంది. లీజా! ప్రతి వారాంతానికి ఎక్కడికో ఒక చోటుకు వెళదాం".

రిచర్డ్ గుర్రం ముందు నడుస్తుంది. ఇద్దరూ చిన్న చిన్న రాళ్ళతో నిండిన చిన్న కాలువను దాటుతున్నారు.

"ఈ వారాంతంలో ఎక్కడకు తీసుకు వెళతావు?..... తక్షశిలకా?"

లీజా మాటల్లో రిచర్డ్‌కు కొద్దిపాటు వ్యంగ్యం తోచింది. రిచర్డ్‌కు తక్షశిల ఎంతో సుందరంగా గొప్పగా ఉంటుంది. అతను అక్కడికి తరచూ వెళ్ళాలనుకుంటాడు. అక్కడకు వెళితే గంటల తరబడి తిరుగుతూ ఉంటాడు. కాని, లీజా! లీజాకు శిథిలాలలో తిరగటం ఇష్టం ఉంటుందా?

"కొద్ది రోజులపాటు అక్కడికి వెళ్ళలేం. ప్రస్తుతం ఇక్కడ పట్టణంలో పరిస్థితులు తీవ్రంగా ఉన్నాయి. చక్కబడితే వెళ్ళవచ్చు. ఈ వారాంతం..... ఎక్కడకు తీసుకు వెళ్ళేదీ రిచర్డ్ స్పష్టంగా చెప్పలేకపోయాడు. ఏం జరుగుతుందో అతనికే తెలియదు.

"చెప్పు. ఎక్కడికి వెళదాం?" లీజా అడిగింది. రిచర్డ్ సమాధానం చెప్పలేకపోయాడు.

టిఫిన్ చేయడానికి ముందు లీజా రిచర్డ్ ఇద్దరూ బంగళాలోని చిన్న గదులు దాటి పెద్ద గదిలోకి వచ్చారు. ఏప్రిల్‌నెల మొదలు కాగానే గది లోపల కొంచెం చీకటిగా ఉంచడానికి తలుపులకు, కిటికీలు, పరదాలు వ్రేలాడదీస్తారు. ఆ కారణంగా పగలు కూడా విద్యుత్కాంతి అవసరం అవుతూ ఉంటుంది. ఆ గదిలో




గోడలకు ఉన్న అల్మారాలన్నీ పుస్తకాలతో నిండిపోయాయి. గోడల నానించి కర్ర ముక్కల ఆధారంగా బుద్ధుడు మరియు బోధిసత్త్వులవి ఎన్నో బొమ్మలు నిలబెట్టబడి ఉన్నాయి. ప్రతి బొమ్మకు ప్రత్యేకంగా విద్యుత్కాంతి ఏర్పాటు చేయబడి ఉంది. ఇవి కాకుండా గోడలకు భారతీయ చిత్ర కళకు సంబంధించిన అనేక చిత్రాలు వ్రేలాడదీయబడి ఉన్నాయి. దగ్గరలో నే నల్లకర్రతో చేసిన పొడవైన వెడల్పాటి టీపాయ్‌లు ఉన్నాయి. రిచర్డ్ అక్కడే కూర్చుని పైప్‌తో పొగ పీలుస్తూ చదువుకుంటూ ఉంటాడు. బట్లర్, టీ కెటిల్ అక్కడికే తెస్తాడు. స్వయంగా టీ కలుపుకుని త్రాగటం రిచర్డ్‌కు ఎంతో ఇష్టం. టీపాయ్ మీద తెరచి ఉంచిన పుస్తకాలు, పత్రికలూ ఉన్నాయి. పక్కనే ఏడెనిమిది రకాల పైప్‌లున్న పైప్ స్టాండ్‌కూడా ఉన్నది. ఆ పైన గుండ్రని షేడ్ కలిగిన లైటు వేలాడుతున్నది. చదువుకునేటప్పుడు లైట్ వేస్తే కాంతి అక్కడి వరకే వ్యాపించి మిగతా గదంతా చీకటిగా ఉంటుంది.

లీజా దేశంలో లేనప్పుడు తాను పోగు చేసిన బౌద్ధ విగ్రహాలను ఆమె నడుం చుట్టూగా చేయి వేసి చూపిస్తున్నాడు రిచర్డ్.

బంగళా బయట ఉంటే హిందూస్తాన్‌లో ఏదో ఒక పట్టణంలో ఉంటాను. బంగళాలోకి తిరిగివస్తే మొత్తం హిందూదేశంలో నే ఉన్నట్లుంటుంది". రిచర్డ్ అన్నాడు.

నల్లటి పెద్ద కళ్ళజోడు నోటిలో పైప్, పాత చారల కోటు, కింద కార్డ్రై ఫాంట్‌తో ఆ గదుల మధ్య తిరిగే రిచర్డ్ ఏదో మ్యూజియం క్యూరేటర్‌లాగా ఉంటాడు. అతను ఒక బుద్ధుని బొమ్మకు ఎదురుగా వచ్చి ఆగిపోయాడు.

"బుద్ధుని బొమ్మలలోని విశిష్టత ఆ బొమ్మలోని చిరునవ్వులో ఉంది. బుద్ధుని ముఖాన్ని ఆ చిరునవ్వు కన్పించే విధంగా వెలుగులో ఉంచాలి" అంటూ లైట్ స్విచ్ వేసి కాంతి ఆ ముఖంపై పడేటట్లు సర్దాడు.

"లీజా! ఇప్పుడు చూడు".

లీజాకు కూడా బుద్ధుని ఆ ముఖంలో చిరునవ్వు కన్పించినట్లయింది. శాంతంగా, స్నిగ్ధంగా, కొంచెం వ్యంగ్యంగా ఆ చిరునవ్వు ఆమెకు తోచింది.

ఆ చిరునవ్వు పెదవుల చివర దాగింది. నలభై అయిదు డిగ్రీల కోణంలో సన్నటి వెలుగు రేఖను ప్రసరింపజేస్తే ఆ చిరునవ్వు కన్పిస్తుంది. ఆ కోణం మారిస్తే చిరునవ్వు మాయమవుతుంది.....

లీజా ఒక్కసారిగా తల తిప్పి రిచర్డ్ వైపు చూసింది. ఈ మనుషులు ఎంత విచిత్రంగా ఉంటారు. ఎంత మమేకంతో ఆ బొమ్మలను గురించి, శిథిలాలను గురించి వర్ణిస్తుంటారు. లీజా, రిచర్డ్‌ను దగ్గరగా పొదవుకొని అతని భుజం మీద తన తల వాల్చింది.

"ఆ సన్నని చిరునవ్వే బుద్ధుని విగ్రహాల విశిష్టత" అంటూ లీజా తలపై ముద్దు పెట్టుకున్నాడు.

ఆ బంగళాలో ప్రతి గదిలోనూ రకరకాల దీపాలున్నాయి. ఎక్కడ కూర్చుని స్విచ్ నొక్కినా వంట గదిలో, బయట వరండాలో కాలింగ్‌బెల్ మ్రోగే ఏర్పాటు చేయబడింది.

ఆ గదులమధ్య తిరిగే రిచర్డ్‌ను చూస్తే అతను జిల్లా అధికారి అని ఎవరూ నమ్మరు. ఇక్కడ అతను భారతీయ చరిత్ర పరిశోధకుడు, భారతీయ కళామర్మజ్ఞుడు. తన కార్యాలయంలో కుర్చీలో అతను బ్రిటిష్‌సామ్రాజ్య ప్రతినిధి. లండన్‌లో తీసుకున్న నిర్ణయాలను అధికారాలను ఖచ్చితంగా అమలుచేసే కార్యనిర్వహణ అధికారి. ఒక పనితో రెండో పనిని వేరుగా ఉంచడం, ఒక భావంతో మరొకభావాన్ని గలగనీయకుండా వుండడం అతని స్వభావపు విశిష్టత. అతను ఒక పనిలోనుండి రెండో పనిలోనికి వెంటనే మారగలడు. ఒక ప్రత్యేకమైన క్రమశిక్షణ అతని జీవితాన్ని నడిపిస్తుంది. వారంలో మూడు రోజులు. జిల్లా న్యాయాధికారిగా అతను కేసులు పరిశీలిస్తాడు. అప్పుడు భారతీయ శిక్షాస్మృతిని ఖచ్చితంగా అమలుపరుస్తూ న్యాయం చెప్తూవుంటాడు. ఒక రంగంలోని భావాలు మరో రంగంలో అతనిని ప్రభావితంచేయలేవు. ద్వైధీభావన అతని దగ్గరకేచేరదు. అతని నమ్మకాలు, భావాలను గురించి ఖచ్చితంగా

చెప్పటం కష్టం. బహుశా రిచర్డ్ కూడా ఈ ప్రశ్న ఎప్పుడూ వేసుకొనివుండడు. అతను ఖచ్చితమైన కార్యనిర్వహణాధికారిగా బ్రిటిష్ ప్రభుత్వపు నియమాలను అమలుచేస్తూ వుంటాడు. ఆ పరిస్థితులలో అతని స్వంత విలువలను గురించి ప్రశ్నించుకోవటం అసంగతమే అవుతుంది.

ఒకరి నడుంచుట్టూ ఒకరు చేతులువేసుకుని యిద్దరూ డైనింగ్‌రూమ్‌వైపు నడిచారు. లీజాకు ఆ బంగళా మొత్తంమీద ఈ గది అంటేనే యిష్టం. నల్లటి గుండ్రని టేబిల్‌పై ఎర్రని గులాబిపూలు వుంచిన 'ఫ్లవర్‌వాజ్' ఎంతో అందంగా వుంది. ఆ టేబుల్‌పైన అంతవరకే వెలుగునిచ్చే షేడ్ వున్న దీపంవున్నది. ఆ వెలుగుకు టేబుల్‌పై వున్న చైనా పాత్రల అందం మరింత పెరిగింది. రిచర్డ్‌కు ఈవిధమైన అలంకరణ యిష్టమని లీజాకు తెలుసు. అతనితో వున్నంతవరకు అతని యిష్టాలనే తన యిష్టంగా మార్చుకొనే ప్రయత్నంచేస్తుంది.

టేబుల్‌దగ్గర కూర్చోడానికి ముందు రిచర్డ్ గడపదగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు.

"ఏదో ఆలోచిస్తున్నట్లున్నావే?" లీజా రిచర్డ్ భుజంమీద తలవాస్తూ అడిగింది.

"ఎక్కడనుండి మొదలుపెట్టాలా? అని ఆలోచిస్తున్నాను."

"ఏమిటి మొదలుపెట్టేది?"

"నువ్వు ఇక్కడి ప్రజలుగురించి, పరిస్థితులగురించి తెలుసుకోవాలనుకున్నావుగదా......"

"నేనేమి తెలుసుకోవాలనుకోవటంలేదు. నువ్వు ఆఫీసునుండి ఎప్పుడు తిరిగివస్తావోనని మాత్రమే తెలుసుకోవాలనుకుంటున్నాను" అంటూ లీజా చేయిచాచి రిచర్డ్ వక్షస్థలాన్ని నవరించసాగింది. రిచర్డ్ వంగి తన పెదవులతో ఆమె పెదవులందుకున్నాడు.

రిచర్డ్ ఆమెను వేగంగా కౌగిట్లోకి తీసుకున్నాడు. కాని రిచర్డ్‌కు ఈ చర్యలో ఏ మాత్రం ఆనందం కలగలేదు. ఈసారి లీజాతో రోజులు ఎట్లా గడపాలన్న ఆలోచన అతన్ని పీడించసాగింది. తన పెదవులతో లీజా ముఖాన్ని ముద్దులతో ముంచెత్తుతున్నా అతనికి ప్రత్యేకమైన ఉత్తేజమేమీ కలగటంలేదు. రాత్రిపూట ఎంతో తమకంతో, ఉద్వేగంతో తనను చుట్టుకొనే లీజా శరీరం అతనికి మామూలుగా తోచింది. లీజాను అలరించడానికి అతను కేవలం అభినయం చేస్తున్నాడు. ఒకరకంగా తన బాధ్యత నిర్వర్తిస్తున్నాడు.

అప్పుడే టేబుల్ వెనక చీకట్లో వున్న బట్లర్ నెమ్మదిగా ముందుకువచ్చాడు. వెలుగు వలయంలోకి వచ్చేసరికి తెల్లని దుస్తులపై కట్టిన ఎర్రని బెల్టు తళుక్కున మెరిసింది. శబ్దంలేకుండా టేబుల్‌పై టిఫిన్ ఏర్పాటుచేశాడు.

లీజా, రిచర్డ్ ఇద్దరూ ఒకరి కౌగిలిలో ఒకరు కరిగిపోతూనేవున్నారు. మొట్టమొదట ఈవిధంగా తెరిచిన తలుపులుమధ్య వీరి ప్రేమ సాగుతున్నప్పుడు ఎవరైనా పనివాళ్ళు అటుగావస్తే లీజా సంకోచంతో కౌగిలివిడిపించుకుంటూ వుండేది. కాని రిచర్డ్ ఆమెను వదిలేవాడుకాదు. పనివాళ్ళు తమ పని తాము చేసుకుపోయేవాళ్ళు. బట్లర్ రాకను గుర్తించనట్లే మైకంతో లీజా కళ్ళు మూసుకునేది. ఆ బట్లర్ దేశీయుడేనని పట్టించుకోదగినంత వ్యక్తి కాడని ఆమె భావించింది. పనివాళ్ళను, బట్లర్‌లను ఇప్పుడు ఆమె తమ ప్రేమకు అవరోధంగా భావించడంలేదు.

"ఈసారి నువ్వు ఏదో ఒకపనిలో ఇంట్రస్ట్ కల్పించుకోవడం మంచిది లీజా!"

"ఏ పనిలో??"

"ఏ పనిలోనైనా సరే! డిప్యూటీ కమిషనర్ భార్యగా నీకు జిల్లా ప్రథమ మహిళా హోదావున్నది. నువ్వు ఏపని మొదలుపెట్టినా మిగిలిన అధికారుల భార్యలు నీకుసహాయం చేస్తారు."

"నాకు తెలుసు. నాకు తెలుసు – రెడ్‌క్రాస్‌కు చందాలుపోగుచేయటం, ఫ్లవర్‌షోలు ఏర్పాటుచేయటం, సైనికుల సహాయార్థం బట్టలు, చెప్పులు పోగుచేయటం యివేగా?"

"మరొక సంస్థకూడా ఇక్కడ ప్రారంభించే ఉద్దేశ్యం వున్నది: జంతువుల సంరక్షణకోసం. ఇక్కడ యింతవరకూ యిటువంటి సంస్థలేదు. కంటోన్మెంటు రోడ్లపై వూరకుక్కలు తిరుగుతూ వుంటాయి. వాటిని తొలగించటం, గుర్రపుబళ్ళకు – ముసలి గుర్రాలు కట్టబడివుంటాయి.

## విజ్ఞానం-వినోదం

బాచ్ బ్రౌన్



**సమస్య**
వొంపు తిరిగే కాంతి కిరణం.

**అవసరం**
దువ్వెన, ఫ్లోరొసెంట్ దీపం.

**ఈ విధంగా చేయండి.**
బాగా దగ్గరగా పెట్టిన వేళ్లగుండా కాంతిని చూడండి. వేళ్ల మధ్య గల సన్నని సందులగుండా కాంతి కిరణ అంచులను చూడవచ్చు

**ఇలా ఎందుకని?**
కాంతి ఎల్లప్పుడూ రుజు మార్గంలో ప్రయాణం చేస్తుందని అనుకుంటారు. ఇది నిజం కాదని మనం ఇక్కడ తెలుసుకున్నాం. కాంతి మూలల చుట్టూ స్వల్పంగా వొంపు తిరుగుతుంది. ఈ నూతన కాంతి రేఖలను "పలు రంగులుగా విశ్లేషించిన కాంతి కిరణ అంచు" అంటారు.

## తమస్

"వాటినేం చేస్తావు?"

"వాటిని చంపించివేయాలి. ఊరకుక్కలు రోగాలను వ్యాపింపజేస్తాయి. నువ్వు నీ కిష్టమైన పనిని ఎన్నుకో."

"నువ్వు డిప్యూటీ కమీషనర్ పనిచేస్తూ వుండు. నేను వీధులవెంట తిరిగి కుక్కలను చంపిస్తూ వుంటాను. నువ్వెప్పుడూ నన్ను ఎగతాళి చేస్తూనే వుంటావు."

"నేను నిన్ను ఎగతాళి చేయటంలేదు. నువ్వు ఏదో ఒకపనిలో అభిరుచి పెంచుకోమనే నేను చెబుతున్నాను."

"నేను నీ పనులలోనే అభిరుచి పెంచుకుంటాను. ఉదయం ఈ దేశవాసుల గురించి చెబుతానన్నావుగదా! చెప్పు."

రిచర్డ్ చిరునవ్వు నవ్వాడు.

"విను. ఈ హిందూదేశపు వాసులందరూ ఎక్కువ ఆవేశపరులు. చిన్నచిన్న విషయాలకే ఆవేశపడిపోతూవుంటారు. మతం పేరిట హత్యలు చేసుకొంటూ వుంటారు. అందరూ స్వార్థపరులే. అంతేకాదు అందరూ తెల్లతోలు వున్న స్త్రీలనే యిష్టపడుతూవుంటారు."

ఆఖరుమాట వినగానే రిచర్డ్ తనను ఎగతాళిచేస్తున్నాడేమో అన్పించింది. లీజా దృష్టిలో అతడు గొప్ప పండితుడు. యోగ్యుడైన వ్యక్తి. అయితే తనను అమాయకురాలుగా భావిస్తాడని అనుకుంటుంది. అందుకే గంభీరమైన విషయాలను వివరించేటప్పుడు కూడా మధ్యమధ్యలో ఆటలుపటిస్తుంటాడని ఆమె ఉద్దేశ్యం.

"నువ్వు ఏ విషయమూ సీరియస్‌గా చెప్పవుగదా?" లీజా ఉడుక్కుంటూ అన్నది.

"సీరియస్‌గా మాట్లాడుకుంటే మజా ఏముంటుంది? విను! ఇక్కడేదో గొడవ జరిగేటట్లుంది."

"ఏం గొడవ జరుగుతుంది. మరలా కొట్లాటలు జరుగుతాయంటావా?"

"కాదు. కాని హిందూ – ముస్లింల మధ్య అభిప్రాయబేధాలు ఎక్కువైపోతున్నాయి. ఏవో గొడవలు జరిగేటట్లే వున్నాయి."

"వీళ్ళలో వీళ్ళు కొట్టుకుంటారా? వీళ్ళిద్దరూ కలిసి మనకు వ్యతిరేకంగా పోరాడతారని నువ్వు లండన్‌లో వున్నప్పుడు చెప్పానుకదా!"

"మనకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు. వాళ్ళలో వాళ్ళు కొట్టుకుంటున్నారు.

"నువ్వు మళ్ళీ వగతాళిచేస్తున్నట్లున్నావు!"

"మతం పేరుతో వాళ్ళలో వాళ్ళు కొట్టుకుంటారు. దేశం పేరుతో మన మీదకొస్తారు" రిచర్డ్ నవ్వుతూ అన్నాడు.

"రిచర్డ్! తెలివిగా మాట్లాడకు. నాకు అంతా తెలుసు. దేశంపేరుతో వాళ్ళు నీతో పోరాడుతున్నారు. మతం పేరుతో నువ్వు వాళ్ళలో వాళ్ళు కొట్టుకునేటట్లు చేస్తున్నావ్. అంతేకదూ?"

"మేము చేయటం లేదు. వాళ్ళే కొట్టుకుంటున్నారు.

"వాళ్ళు కొట్టుకోకుండా నువ్వు ఆపవచ్చుగదా! పైగా వాళ్ళందరూ ఒక జాతివాళ్ళేకదా!"

రిచర్డ్‌కు తన భార్య అమాయకత్వంతో యిష్టాన్ని కల్గించింది. ఆమె బుగ్గపై ముద్దుపెట్టుకుంటూ చెప్పసాగాడు. "పాలకులు ప్రజల్లో వున్న ఏకాభిప్రాయాలను పట్టించుకోరు. ప్రజలలోని బేధాభిప్రాయాలను తెలుసుకోవటంలోనే పాలకులకు మజా వుంటుంది డార్లింగ్!"

అప్పుడే ఒక బట్లర్ టీ తీసుకువచ్చాడు. అతన్నిచూసి "ఇతను హిందువా? మహమ్మదీయుడా?" అని ప్రశ్నించింది లీజా.

"నువ్వే చెప్పు?" అన్నాడు రిచర్డ్.

లీజా ఆ బట్లర్‌వంక పరీక్షగా చూసి చెప్పింది 'హిందువే!"

"తప్పు" రిచర్డ్ నవ్వుతూ అన్నాడు.

"ఎందుకని?"
"సరిగ్గా చూడు?"

లీజా పరీక్షగా చూసి "ఇతను సిక్కుగదా? ఇతనికి గడ్డం, పైన తలపాగా వున్నాయి."

రిచర్డ్ మరలా నవ్వాడు. ఆ బట్లర్ నిశ్చేష్టుడుగా వుండిపోయాడు.

"ఇతను గడ్డాన్ని కత్తిరించాడు. సిక్కులు గడ్డాన్ని కత్తిరించరు. అది వారి మతానికి విరుద్ధం."

"నువ్వు ఈ విషయం నాకు చెప్పలేదు."

"నేను ఇంకా చాలా విషయాలు నీకు చెప్పలేదు."

"ఎటువంటివి?"

"సిక్కులకు ఐదు గుర్తులుంటాయి. వెంట్రుకలేకాకుండా మరో నాలుగు గుర్తులుంటాయి. హిందువులకు తలమీద పిలక వుంటుంది. మహమ్మదీయులకు కూడా వాళ్ళవాళ్ళ ప్రత్యేక చిహ్నాలుంటాయి. ఆహార విషయంలో కూడా ప్రత్యేకమైన అలవాట్లుంటాయి. హిందువులు ఆవు మాంసం తినరు. మహమ్మదీయులు పందిమాసం తినరు. సిక్కులు చంపిన జంతువు మాంసం, మహమ్మదీయులు హలాల్‌చేసిన మాంసం తింటారు."

"నేను ఈ విషయా లేవీ నేర్చుకోగూడదని నీ వుద్దేశ్యం కదూ? లేకపోతే ఒక్కసారి ఇన్ని విషయాలు చెబితే ఎలా గుర్తుంటాయి?" అంటూ బట్లర్‌వైపు తిరిగి అడిగింది లీజా – "ఈ విషయాలన్నీ తెలుసుకొంటే మనుషులను చూడగానే వాళ్ళు ఏ మతంవాళ్ళో నేను చెప్పగలనా?"

"సరే! బట్లర్! నువ్వు మహమ్మదీయుడవు కదూ?"

"అవును! మేడమ్ నేను మహమ్మదీయుడనే."

"నువ్వు హిందువులను చంపుతావా?"

బట్లర్ సమాధానం చెప్పడానికి కంగారుపడ్డాడు. అతను తలఎత్తి ఒక్కసారి లీజా వైపుచూసి చిరునవ్వు నవ్వుతూ రిచర్డ్‌వైపు తిరిగాడు. తర్వాత కాగితం వున్న ఒక ప్లేటును రిచర్డ్‌ముందుపెట్టి వెనక్కు వెళ్ళాడు. రిచర్డ్ ఆ కాగితం చదివి మరల ఆ ప్లేట్లో పెట్టేశాడు.

"రిచర్డ్ అధి ఏమిటి?"

"పట్నంలోని పరిస్థితులకు సంబంధించిన రిపోర్టు" నెమ్మదిగా చెబుతు రిచర్డ్ తన ఆలోచనలో మునిగిపోయాడు.

"ఏమి రిపోర్టు అది?"

"పట్నానికి సంబంధించినది. నీకు తెలుసుకదా. నాకు రోజూ సివిల్ సప్లయ్ ఆఫీసరు నుండి, హెల్త్ ఆఫీసరునుండి, పోలీస్ సూపరింటెండెంట్ నుండి మూడు రిపోర్టులు వస్తాయికదా! ఎక్స్‌క్యూజ్‌మి....." అంటూ రిచర్డ్ గది బయటకు వెళ్ళిపోయాడు.

(ఇంకావుంది)

# నేటి వివాహ వ్యవస్థ స్త్రీకి భద్రతను చేకూరుస్తుందా?

"కన్యాశుల్కం
వరకట్నం
ఆటవిక తెగలలో
ఇచ్చే ఓలి
ఏ రకంగా డబ్బు
మార్పిడి జరిగినా
ఆడబ్రతుకులే బలి"

అన్నట్లుగా ఉంది ఈనాటి వివాహ వ్యవస్థ. రాను రాను వివాహ వ్యవస్థలో స్త్రీ భద్రతను పొందడం లేదు. సరికదా భంగపాటే ఆమెకు మిగులుతుంది. భవిష్యత్తుపై ఎన్నో ఆశలు పెట్టుకున్న ఆడపిల్ల ఆశోపహతురాలిగా మిగిలి పోవడానికి కారణాలు ఆర్థిక, సాంఘిక పరిస్థితులు, కులమతాల అడ్డు గోడలు, సాంప్రదాయపు శృంఖలాలు ఇలా ఎన్నెన్నో!

స్త్రీ వివాహ విషయంలో స్వయం నిర్ణయం తీసుకొని, అభ్యుదయ పథంలో పయనించాలని ఆశించినా, సాంఘిక వ్యత్యాసాల వల్ల అది సాధ్యపడటం లేదు.

కుల మత ప్రమేయం లేకుండా వివాహం చేసుకుంటే సంఘం గేలిచేస్తుంది. వెలి వేస్తుంది.

ప్రేమ వివాహం విషయానికొస్తే, మనసులు కలిసినా, ఆర్థిక వ్యత్యాసాలు, కులమతాలు, వాటి తాలూకు సంఘంలోని పలుకుబడి వీటివల్ల పెద్దవాళ్ళు ప్రేమ వివాహానికి



ఆమోదాన్ని అసలే తెలుపరు.

ఇక కట్నం తీసికునే వరుడు, తనకు ఉద్యోగం లేకపోయినా, అందగాడు కాకపోయినా, నేను మొగపిల్లవాడిని సుమా! నేనెలాగైనా ప్రవర్తించవచ్చు అనే భావంతో ఆడపిల్లల కన్న తల్లితండ్రులను దశమగ్రహంలా పీడిస్తున్నాడు. శ్రీమతిగా సద్గుణ వంతురాలు, చదువుల సరస్వతి, అందాలరాశి, వీలైతే ఉద్యోగవంతురా లైన అతివను కావాలని కోరుకోవడంలో తప్పులేదు, కాని మరి ఆడపిల్లకు కూడా కొన్ని ఆశలు, ఆశయాలు ఉంటాయని, ఆమె కూడా తాను అభిలషించే గుణాలు వరుడిలో ఉండాలని కోరు కుంటుందని ఎందుకనుకోరు? చెప్పండి.

అన్నీ సిద్ధం చేసుకున్నాక చివరి క్షణంలో పెండ్లి ఆగిపోయిన ఉదంతాలు ఎన్నో!

ఇవన్నీ వింటూంటే, కళ్ళారా చూస్తుంటే అనిపిస్తుంది వివాహ వ్యవస్థలో స్త్రీకి భద్రత లేకుండా పోతుందనీ, ఇంకా దీనివలన స్త్రీకి వివాహం పట్ల విముఖతాభావం ఏర్పడుతుందనీనూ.

వివాహం జీవితంలో ముఖ్యమైన సంఘటన. ఒక మలుపు. జీవితపు వాహనము ఆ మలుపు వద్ద, సరిగ్గా పయనించి ఆశించిన గమ్యాన్ని అందుకోవాలని, క్రొత్త ఆశలకు ఊపిరి పోయాలని ఆశిస్తుంది స్త్రీ. ఆమె ఆశలు ఫలించాలంటే....

"వరకట్నపు చావులు"

"కట్నం గురించి భర్త, అత్తా, ఆడపడుచుల వేధింపులు"

"ఇది హత్యే"

అంటూ పత్రికలలో మనం నిత్యం చదివే ఉదంతాలు, ఇకముందు తరాలలోనైనా జరగకుండా మనం ఒక నవలోకాన్ని, ఆదర్శప్రాయమైన యువలోకాన్ని ఆవిష్కరిస్తే వివాహ సమస్యతో ఆడపిల్లల కన్న తల్లితండ్రులు ఆవేదనకు గురి అయ్యే అవసరమే ఉండదు.

వివాహ వ్యవస్థలో మార్పు రావాలంటే:-

పెద్దవాళ్ళు సాంప్రదాయపు గిరి నుండి బయటకు అడుగువేసి విశాల దృక్పథంతో మార్పును ఆహ్వానించాలి.

"స్త్రీకి స్త్రీయే శత్రువు" అనే నానుడిని స్త్రీలు అబద్ధం అని ఋజువు చేసే రోజు రావాలి.

కట్న పిపాసులగు మొగపిల్లవాడి తల్లితండ్రులు ఆడపిల్ల కన్న తల్లితండ్రుల ఆక్రందనలను విని వారి దృక్పథంలో మార్పు తెచ్చుకోవాలి.

డబ్బే సర్వస్వం అనుకునే వరులు డబ్బు ఇవ్వలేని హాయిని ఒక మంచి మనసు పంచి ఇస్తుందని గ్రహించాలి.

మరి ఆ రోజు ఎప్పుడొస్తుందో వేచి చూద్దాం.

-యం. పద్మావతి, నల్లగొండ

★ ★ ★

# "వివాహం అన్నది వ్యాపారం కాకూడదు

వివాహం అనేది ఓ పవిత్రమైన బంధం. రెండు మనసులు పెనవేసుకుని అల్లుకునే మధురమైన ఓ నందన వనం.

కాని నేటి కాలం పెళ్ళిళ్ళు ఓ వ్యాపారంలా సాగుతున్నాయి. వరుని తల్లి, తండ్రులు అదో లాభసాటి వ్యాపారంగా భావిస్తున్నారు. మగపిల్లడిని కన్న తల్లిదండ్రులకున్న విలువ, గౌరవం (డబ్బుతో) మరెవరికీ లేవని ఏస్తున్నారు. మగపిల్లడ్ని కన్న దగ్గర్నుండి ఉద్యోగస్థుడయే వరకు పెట్టిన ఖర్చు ఆడపిల్ల (అదే- కోడలు) ద్వారా రాబట్టుకుంటున్నారు వరుని తల్లి దండ్రులు, కోడలు తెచ్చిన కట్నంతో కొన్ని సమస్యలు తీరవచ్చని తండ్రి అనుకుంటే, కోడలుకి పని, పాటలు అప్పజెప్పి విశ్రాంతి తీసుకో వచ్చని తల్లి అనుకుంటే అబ్బాయి ఆలోచనలు ఉద్యోగిని భార్య అయితే బాగుంటుంది అని వుంటాయి. ఇటు



తండ్రికి కట్నం యిచ్చి, అటు తల్లికి పనిలో సాయపడుతూ తనకీ ఆర్థికంగా సాయపడే అమ్మాయి కావాలని కోరుకుంటున్నారు నేటి వీరులు. ఇన్ని పాత్రల్ని పోషిస్తున్న ఆడదానికి ఆఖరికి శాంతి, సుఖం వుంటున్నాయా? చదువు, ఉద్యోగం, అందం, చందం, పని, పాటూ అన్నీ వున్న ఆడపిల్ల కట్నం యిచ్చి భర్తని కొనుక్కుని అత్తింట్లో అందరికీ సహాయం అందిస్తున్నా సుఖమన్నది గగన కుసుమమే అవుతోంది. అన్ని యోగ్యతలు కలిగి వున్నా అత్తింట సుఖం లేక, భర్త ఆదరణ కరువై, జీవితం నిస్సారమై, బతుకు మీద ఆశ చచ్చి, తనని తాను చంపుకోడమో, చంపబడడమో జరుగుతోంది. ఎక్కడుంది లోపం?

ఆడపిల్లలు తమ కాళ్ల మీద తాము నిలబడగలిగే అర్హత సంపాదించి, ఆత్మస్థైర్యం, మనో నిబ్బరం కలిగి వుండాలి. అత్తింటి బాధలు పడలేక మరణమే శరణం అనే దుస్థితిని రానీయకూడదు. సమస్యలని ధైర్యంతో ఎదుర్కోవాలి. చావే సమస్యలకి పరిష్కారం అనుకుంటే ప్రపంచం చాల వరకు శ్మశానమే అవుతుంది.

-పూడిపెద్ది నీలవేణి,
శృంగవరపు కోట.

ఈ శీర్షికని ఇంతటితో నిలిపి వేస్తున్నాము —సం.

# రాలినపూవు

## బొజ్జా సత్యనారాయణ

నాకు హార్టువీక్‌నెస్ ఉంది. వ్యాధి నివారణకై చాలా ఆస్పత్రులు తిరిగి ట్రీట్‌మెంటు తీసుకున్నాను. వ్యాధి తాత్కాలికంగా తగ్గినా పూర్తిగా తగ్గదని నాకు తెలుసు. ఈ మధ్య మళ్ళీ గుండె దడ ఎక్కువైంది. నన్ను చూడటానికి మా బావ సూకరాజుగారు, చెల్లాయ్ కలిసి వచ్చారు. ఆర్థిక పరిస్థితి వల్ల వ్యాధికి నేను చికిత్స చేయించుకోలేక పోవటం బావగారు గ్రహించారు. వెంటనే శ్రీనివాస నర్సింగ్‌హోమ్‌కు నన్ను స్కూటర్‌మీద తీసుకెళ్ళారు.

మేడ ప్రహరీ గేటు కుడి ప్రక్క నేమ్‌బోర్డు, దాని మీద శ్రీనివాస్ నర్సింగ్‌హోమ్, "డా. సూర్యారావు యం. యస్. యఫ్. ఐ. సి. యస్. (జనరల్)" అని నీలి రంగులో అక్షరాలు కనిపించాయి. లోపల బాట కిరువైపులా వున్న పూల మొక్కల్లో కత్తిరించబడిన రెండు కోనీఫర్ చెట్లునెమిళ్ళలా నిలిచి ద్వారపాలకుల్లా వచ్చేవారికి స్వాగతం పలుకుతున్నాయి.

ఓ. పి.లో కూర్చున్నాం. కన్సల్టింగ్ రూమ్ స్ప్రింగ్‌డోర్ తెరచుకుంది! నర్సు మమ్మల్ని లోపలకు పంపింది. పెద్ద టేబిల్ మీద ఫ్లవర్‌వాజ్‌లో విరిసిన రోజాలు ఎరుపు, తెలుపు రంగుల్లో ఉన్నాయి. గోడకు గాంధీగారి చిత్రపటం. కుషన్ ఛైర్‌లో కూర్చున్న డాక్టరుగారికి నమస్కరించాం.

చిరునవ్వుతో మమ్మల్ని కూర్చోమని కుర్చీలు చూపించారు. ఒడ్డు పొడవులతో అందర్నీ ఆకర్షించే సుందర రూపం డాక్టరుగారిది. వయసు నలభైఆరు సంవత్సరాలుంటుంది. కాఫీకలర్ హాఫ్‌షర్ట్, తెల్లపేంటు ఆయన అందానికి మెరుగులు దిద్దుతున్నాయి. నా గురించి బావగారు చెప్పారు. నన్ను పరీక్షించి డాక్టరుగారు మృదువుగా మందలించారు. "ట్రీట్‌మెంటుకు రాకుండా వ్యాధి ముదరబెట్టుకున్నారేమిటి?"

నాకు ఐదవ నెంబరు స్పెషల్ రూంలో ఏర్పాటు చేశారు. నా వ్యాధికి చికిత్స జరుగుతోంది. మూడవరోజుకల్లా ఉపశమనం కలిగింది. నర్సునడిగి డాక్టరుగారి వివరాలు తెలుసుకున్నా. ఆయన్ని మనసులోనే అభినందించా, ఆయన జనరల్ హాస్పటల్లో సర్జన్‌గా ఉన్నప్పుడు ఎటువంటి ఆపరేషన్ అయినా చాక చక్యంగా చేసేవారు. రాష్ట్రపతి గోల్డుమెడలు కూడా పొందారు. డాక్టర్ సూర్యారావుగారు దయామయులని పేషెంట్లు చెప్పుకోగా విన్నాను.

నేనున్న గది రెండు ప్రక్కలా ఆకర్షణీయంగా ఇంటర్ కిటికీలున్నాయి. ఒక కిటికీ వెనక పిందెలుతో దానిమ్మచెట్టు. ప్రహరీ గోడ అవతల వరిపొలం. రెండో కిటికీ నుంచి కనిపించే అందమయిన పూలతోట కన్నుల పండుగ్గా వుంది. పరిమళాలు గుబాళించే రంగు రంగుల పూలు. పూల మీద వాలే సీతాకోక చిలుకలు, చెట్ల మీద వాలే చిన్న చిన్న పిట్టలు ముచ్చట గొలుపుతూ రోగుల బాధల్ని మరిపిస్తున్నాయి.

హాస్పటల్ గురించి కథ రాయాలని ఆలోచనలో పడ్డాను. బెడ్‌మీద కూర్చుని, మూడ్ రాక కిటికీ నుండి బయట పూలతోట వంక చూస్తున్నాను. వరండాలో స్తంభానికి జేరబడి కూర్చుని నాలుగు సంవత్సరాల పాప రొట్టె తింటోంది. ఏమరుపాటుగా ఉన్న పాప చేతిలో రొట్టె లాక్కొని కోతి పారిపోయింది. ప్రహరీగోడమీద కూర్చుని తింటోంది.

కెవ్వున అరిచిన పాప అరుపుకు గదిలోంచి ఒకామె వచ్చి పాపని సముదాయిస్తూ "రొట్టేదీ" అని అడిగింది.

ఏడుస్తూ గోడమీద ఉన్న కోతి వంక చూపించింది పాప.

ఆమె కోపం నటిస్తూ, చిరునవ్వుతో కోతిని కసిరింది.

కోతి పళ్ళికిలించి ఆమె మీదకు ఉరకబోయింది. ఈలోగా దాని చేతిలోంచి జారిన రొట్టె ముక్క ఎత్తుకు వెళ్ళి చెట్టుకొమ్మమీద కూర్చున్న కాకి వంక బాధగా చూస్తున్న కోతిని చూడగానే ఆమెకు జాలేసింది. మరో రొట్టెను తెచ్చి, కోతి వైపు విసిరింది.

కోతి దాన్ని పట్టుకు పారిపోయింది.

కన్న కూతురు రొట్టె కోసం ఏడుస్తున్నా, కోతికే ముందుగా రొట్టె పెట్టిన ఆమె ఉదార స్వభావానికి ఆశ్చర్యపడ్డాను. మూగ జీవాలమీద చూపే కారుణ్యానికి మనసులోనే ఆమెను అభినందించాను. ఆమెని పరిశీలనగా చూసేను.

నుదుట బొట్టులేదు. కావిరంగంచు తెల్ల చీర, రవిక ధరించింది. సిగముడి, మెళ్ళో మూడు పేటల బంగారు గొలుసు, చేతులకు బంగారు గాజులు, చెవులకు తెల్లరాళ్ళు బంగారు కమలాలు ఉన్నాయి. మంచి శరీర ఛాయతో, ఒద్దికగా పాలరాతి బొమ్మలా ఉంది. అందమయిన గులాబికి ముల్లులా మిసమిసలాడే యవ్వనంలో ఈమెకు వైధవ్యం ఏమిటి? అంతా విధి విలాసం.

ఆమెను గురించిన బాధలో గుండె బరువెక్కింది. పక్కమీద నెమ్మదిగా నడుంవాల్చాను. రెప్పలు మూతలు పడ్డాయి.

"సత్తిబాబుగారూ!" భుజం తడుతూ డాక్టరుగారు.

"నమస్తే డాక్టర్‌గారూ" అన్నాను. ఆయన ప్రక్కన నర్సు ఉంది. డాక్టరుగారు నా గుండెల దగ్గర స్టెతస్కోపుపెట్టి పరీక్ష చేశారు.

"ఎలా ఉంది డాక్టర్"

"మీ గుండె రాయిలా ఉంది. మీరు ఈ వ్యాధి గురించి దిగులు పడకండి. వ్యాధిని పూర్తిగా తగ్గించి మిమ్మల్ని మామూలు మనిషిని చేస్తాను. మీరు సాహిత్యం చదవడం తగ్గించి, గుండెకు విశ్రాంతి నివ్వండి."

"చదవకపోతే భావాలను మరచిపోతానండి."

"అంటే?"

"నేను రచయితనండి."

"వెరీగుడ్. మీరు కథకులా....! అయితే మిమ్మల్ని ప్రత్యేకించి పరీక్ష చేస్తుండాలి. ఈ ఆస్పత్రి గురించి కథ రాయండి" అంటూ భుజం తట్టి ముందుకు నడిచారు.

పది నిముషాల తరువాత నర్సు వచ్చి బీ. పీ., టెంపరేచర్ చూసి, "మీరు కథలు రాస్తుంటారటగా!" విని అంది ఉత్సాహంగా.

"ఏదో అప్పుడప్పుడు...."

"థేంక్యూ సార్" అని చెప్పి వెళ్ళిపోయింది.

అరగంటపోయాక ఇంకొక నర్సు వచ్చి నాకు ఇంజక్షన్ చేస్తూ, "మీరు కథలు రాస్తుంటారట. మీ కథలు ఇవ్వండి చదువుతాను. నాకు కథలు చదవడం సరదా!"

"అమ్మా.....!" ఇంజక్షన్ చేసింది.

"రచయిత బాధ పడితే ఎలా!" ఆమె ఛలోక్తి.

"రచయితకు బాధ, మనసు ఉండదా?"

"పేషెంట్లు గురించి కథ రాయాలంటే మీరు ముందుగా ఇంజక్షన్ చేయించుకోవాలి. తప్పదు. భయపడితే కథ నడవదు" అంటూ స్టూలుమీద పుస్తకాల్లో 'చెలియలి'కట్ట పుస్తకం పేజీలు త్రిప్పుతూ, "విశ్వనాథవారి మంచి నవల్లో ఇదొకటి చదివి తెస్తానండి" అంది.

"సిస్టర్! మీకు ఇంజక్షన్లు చేయడం కొత్తనుకుంటా? చేతిని రుద్దుకుంటూ అన్నాను."

"ట్రైనింగ్ పూర్తి అయితేగాని సిరంజి పట్టుకో నివ్వరని మీకు తెలీదా!" అంటూ వెళ్ళిపోయింది.

* * * * * * *

ఆస్పత్రిలో ఉన్న కొంతమందర్లు, నర్సులు

అందరూ స్నేహమయ్యారు. ఆప్యాయతగా మాట్లాడుతున్నారు. కాని స్టేఫ్ నర్స్ మాత్రం పలకరిస్తే కాని మాట్లాడేదికాదు. ఆమెకు ముప్పై సంవత్సరాలుంటాయి. చామనఛాయ శరీరంతో ఆకర్షణీయంగా కన్పిస్తోంది. ఆమెదంతా అదో ప్రత్యేక తరహా. అందరితోనూ ముక్తసరిగా మాట్లాడేది. తెలియనివాళ్ళు గర్వం అనుకుంటారు. ఇంజక్షన్ సున్నితంగా చేసేది.

ఆమె నా దగ్గర పుస్తకాల వంక చూసేది కాని. పుస్తకం పట్టుకు వెళ్ళేదికాదు. పుస్తకం పట్టుకు వెళితే తన నియమానికి భంగం వస్తుందేమోనని ఊహించుకు ఉండొచ్చు. మిగతా నర్సులు నన్ను చదువుకోనివ్వకుండా నా పుస్తకాలను పట్టుకు వెళ్ళేవారు.

ఆమె గురించి మరో నర్సుని అడిగి తెలుసుకుని బాధ పడ్డాను. భర్త ఆమె శీలాన్ని శంకించి వదిలేశాడట. ఆమె అందరితోనూ అరిమరికలు లేకుండా నవ్వుతూ, తుళ్ళుతూండేదట. కాని తప్పుడు నడకలు నడిచేది కాదట. అందరితోనూ క్లోజ్‌గా ఉండటంవల్ల ఆడదానికి, అపవాదులు ఎదురవుతాయని పర పురుషులతో చనువుగా మాట్లాడటం తగ్గించుకొందట. అత్యంత అవసరం అయితేనే తప్పనిసరై క్లుప్తంగా మాట్లాడుతుందట. తన పిల్లలిద్దరిని హాస్టల్లో చేర్పించి చదివిస్తోంది. నర్సుగా జీవనోపాధి సాగిస్తోంది. తప్పు చేయకపోయినా ఆడది అణిగి ఉండటం తప్పదేమో! అందుకే అంటారు ఆడదాని జీవితం అరటాకని.

తరువాత కోతికి రొట్టె పెట్టిన పాప తల్లి జబ్బు సంగతి నర్సు ద్వారా విన్నాను. నాలో కట్టలుత్రెంచే బాధ. జాలితో సతమతమైపోతున్నా.... ఆనాడు దూర్వాసుని శాపంతో శకుంతల భర్తృ వియోగానికి గురైంది. విధి నిర్దేశంవల్ల ఈ శకుంతల నుదుటి కుంకుమ చెరిగి పోయింది. యౌవ్వన వసంతంలో భర్తృ వియోగాగ్ని దగ్ధమై పోతూన్న అభాగ్యురాలు! ఈ శిక్ష చాలనట్లు ఆధునిక కలుషిత వాతావర్ణం ప్రసాదించిన కేన్సర్ తోడై ఆమె కడుపులో పెరుగుతూంది. ఆమె బ్రతుకును తినేస్తోంది. ఏమిటీ విపరీతం! భగవంతుడా! ఎందుకామెమీద నీ కా నిర్ణయ?

ఈ లోకంలో ఎందరి జీవితాల్లోనో సుఖ శాంతులు ఎండిపోయిన ఆకుల్లా రాలి, మోడుబారి పోతున్నాయో! చీకటి బారిన జీవితం వెలుగులోనికి తెచ్చుకొనటానికి నర్సుతో పునర్వివాహం చేసుకోమని చెప్తే?" ఆలోచనలతో నా గుండె బరువెక్కింది.

* * * * * * * *

శకుంతలకు త్వరలో ఆపరేషన్ చేస్తారు. ఆపరేషన్ సక్సెస్ అవుతుందో లేదో! దిక్కుమాలిన ఆ వ్యాధి రాకపోవాలే కాని వచ్చిందటే వదిలిపోవడం కష్టం. ఆమె గదిలోంచి బాధగా మూలుగు వినిపిస్తోంది. మళ్ళీ కడుపునొప్పి వచ్చినట్టుంది. ఆమె దగ్గర ఉంటున్న నౌకరు పరుగులాంటి నడకతో వెళ్ళి నర్సుతో చెప్పింది. నర్సు శకుంతలకు మత్తు ఇంజక్షన్ చేసిన అలికిడి. నాలో చెప్పరాని ఆవేదన.

పావు గంట తరువాత మూలుగు ఆగిపోయింది. శకుంతలమీద ఈ అభిమానం దేనికి.... ఆదరాభిమానాలకు కారణాలేమిటి.... ఆమె అలా బాధ పడుతుంటే ఆపరేషన్ చేయటానికి డాక్టరుగారు ఎందుకు జాగు చేస్తున్నారో ఆయన్ని అడిగితే....

ఆపరేషన్ థియేటర్ నా రూం ఎదురుగా ఉంది. రోజూ రెండు మూడు ఆపరేషన్లు చేస్తూనే ఉన్నారు డాక్టరుగారు. నిన్న బోదకాలుకి కూడా ఆపరేషన్ చేశారు. ఆయన చేసే ఆపరేషన్లు చూస్తుంటే ఆయన చేయలేని ఆపరేషన్ లేదనిపిస్తోంది.

మధ్యాహ్నం పన్నెండవుతుంది.

మ్యూజికల్ హారన్ వినిపించింది. డాక్టరుగారి కారు రాగానే వార్డులో తిరుగుతున్న పేషెంట్లు ఎవరి బెడ్ మీదకి వారు చేరుకున్నారు. గబాలున సిగరెట్టు పెట్టె బెడ్ కింద దాచేశాను.

ఓ. పిలో ఉన్న పేషెంట్లను ముందు పరీక్ష చేసి, వార్డులో వారిని వరుసగా చూస్తూ వచ్చి నన్ను పరీక్ష చేస్తున్నారు.

"శకుంతల బాధతో తల్లక్రిందైపోతుంటే ఆపరేషన్ చేయరేం డాక్టర్" అడిగాను.



## ఇ'వేమన' పద్యాలు / పాపాల బదిలీ




ఒకరి కీడు వేరె యొక్కరికియ్యడు
ఒకరి మేలు వేరె యొకరికియ్యడు
కీడు మేలు వారు పోడిమి తెలియడు
విశ్వదాభిరామ వినుర వేమ

## రాలిన పూవు

"ఆమెకు బ్లడ్ తక్కువగా ఉంది" అన్నారు.

"నా బ్లడ్ ఇస్తాను సార్"

"మీ బ్లడ్ ఆమెకు పనికిరాదు."

"ఆమె బ్రతుకుతుందంటారా?"

చురుగ్గా చూస్తూ. "రోగి తుది శ్వాసవరకూ ప్రయత్నిస్తూ ఉండడమే మా విధి."

"మీ సామర్థ్యం గురించి డౌట్ కాదు. ఎలాగైనా ఆమెను బ్రతికించండి సార్" అన్నాను కళ్ళల్లో నీరు తుడుచుకుంటూ.

ఆయన మందహాసం చేశారు.

"..............."

"శకుంతలగారు మీకు తెలుసా?"

"లేదండి. ఆమె బాధ చూడలేక...."

నా భుజం తట్టి డాక్టరుగారు వెళ్లారు.

* * * * * * *

స్టేఫ్ నర్సు ఇంజక్షన్ యిచ్చింది.

"సిస్టర్ మీ కో విషయం చెప్పాలనుకుంటున్నాను. నన్ను అన్యథా భావించకండి."

అంగీకారంగా ఆమె చిరునవ్వు నవ్వింది.

"మీకు జరిగిన అన్యాయానికి పరిష్కారం కావాలంటే వీరేశలింగంగారి సంస్కరణ విధానాన్ని పాటించడమే. ఏ పాపం ఎరుగని మీ కీ శిక్ష విధించిన మీ భర్తకు తగిన గుణపాఠం"

వెంటనే ఆమె కళ్ళు ఎరుపెక్కాయి. మరుక్షణంలో ఆ కళ్లలోని ఎరుపు ఆమె పెదవులమీద మెరుపులు తీర్చింది.

* * * * * * *

ఈమధ్య డాక్టరుగారు ఒక చిత్రమయిన ఆపరేషన్ చేసి అందరిమెప్పు పొందారు. ఒక పాపకు పుట్టిన దగ్గర నుంచి మర్మాంగం ద్వారా విరోచనం ఔతోంది. ఆ పాప తల్లిదండ్రులు ఆ వింత పరిణామానికి భయపడి అనేక ఆస్పత్రుల్లో డాక్టర్ల చేత పరీక్ష చేయించారు. కాని ఫలితం శూన్యం.

ఎంత ఖర్చయినా ఆపరేషను చేయించి పాపకు సహజస్థితి రప్పించాలని ఆ తల్లిదండ్రుల తపన. ఆ పాపకు పది సంవత్సరాలు వచ్చేవరకూ ఆస్పత్రులు త్రిప్పుతూనే ఉన్నారు. వారి ఆశ ఫలించే సమయాన డాక్టర్ సూర్యారావుగారి దగ్గరకు తీసుకువచ్చారు.

ఆ అమ్మాయి కేసు జాగ్రత్తగా స్టడీ చేసి. డాక్టరుగారు ఆపరేషన్ చేశారు. కేసు సక్సెస్ అయింది. ఇలాంటి వెన్నెన్నో క్రిటికల్ ఆపరేషన్స్ చేసి డాక్టరుగారు ఘనత వహిస్తున్నారు. ఇలాంటివెన్నో సరి చేసిన డాక్టర్‌గారికి శకుంతల వ్యాధి ఒక సమస్య కాదని నాకు నమ్మకం ఏర్పడింది.

* * * * * * *

అస్తమయ సూర్యుని చీకటి ఛాయలు వెలుగు రేఖల్ని కబళిస్తున్నాయి.

రేపు ఉదయం శకుంతలకు ఆపరేషన్ చేస్తారు. ఆపరేషన్ సక్సెస్ అవుతుందో లేదో నా గుండెల్లో కమ్ముకుంటూన్న చీకట్లలో దారి కానక కొట్టు మిట్టాడే ఆలోచనలు. ఎడతెరిపి లేకుండా కాలిపోయే శవాల్లా పొగలు గక్కుతున్న సిగరెట్లు తెల్లవార్లూ జాగరం. గడియారం కొట్టే గంటల్లా ఆగకుండా అదే పనిగా ఆందోళనలో కొట్టుకొంటున్న గుండెలు, లేవలేని నీరసం. చేయలేకపోయా స్నానం.

ఆపరేషన్ మొదలు పెట్టారు. హాస్పటల్ బల్లలనిండా శకుంతల బంధువులే.... ఎందరున్నా ఎవరు మాత్రం ఏం చేయగలరు? ఇప్పుడెలా ఆమె బ్రతుకుతుందా...

"అబ్బా!" మళ్ళీ నా గుండెల్లో రేగిన నొప్పి. అందరి చూపులూ ఆపరేషన్ థియేటర్ తలుపులుమీదే నిలిచిపోయాయి. నాలో పెరిగిపోతూన్న టెంన్షన్. ఈలోగా థియేటర్ తలుపులు తెరుచుకున్నాయి. బరువుగా పడుతూన్న డాక్టరుగారి అడుగులు. బావురుమని ఏడుస్తూ బిక్కు బిక్కుమని చూస్తున్న పాప చూపులు. నా చెంపల్ని తడుపుతున్నాయి కన్నీళ్ళు. ■




విధి వక్రించడం వల్లనో లేక మరే దురదృష్టం వల్లనో వికలాంగులైన వారు కొందరుంటే, పుట్టుకతోనే కొన్ని అవయవాల లోపంతో జన్మనెత్తి, ఆజన్మాంతం బాధపడేవారు కొందరున్నారు.

ఏదైనా దుర్ఘటన సంభవించినపుడు ఏదైనా అవయవాన్ని పోగొట్టుకొన్నవారు కొందరుంటారు. అలాంటి వారిని మనం వికలాంగులు అంటాం. ఇలా ఏదైనా అవయవాన్ని పోగొట్టుకున్నా, నేడు కృత్రిమమైన అవయవాన్ని అమర్చవచ్చు. సాంకేతిక పరిజ్ఞానావకాశాలు అంత ఎత్తుకు ఎదిగినాయి. ఆత్మ విశ్వాసంతో మానవుడు తను సాధించ లేనిది లేదంటూ ధృడ నిశ్చయంతో ముందుకు సాగుతున్నాడు. క్రొంగ్రొత్త విషయాలను, పరికరాలను కనుగొంటున్నాడు.

ఇదే విధంగా ఆత్మ విశ్వాసంతో ఎలాంటి పనినైనా సాధించ వచ్చుని, నిరూపించిన మహిళా శిరోమణి హెలన్ కెల్లర్.



"నా యింట్లో నేను కూర్చొని తెలుసు కోవడం కంటె లోకంలోకి, ప్రజల మధ్యకీ వెళ్ళి నేను చేయవలసింది ఎంతో ఉంది"

– హెలన్ కెల్లర్

పై సూక్తిని ఆమె ఆచరణలో ఉంచింది. హెలన్ కెల్లర్ 19 నెలల ప్రాయంలోనే తీవ్రమైన జబ్బుకు గురైనోటి మాటను, కంటి చూపును, చెవి వినికిడిని కోల్పోయింది. అంటే మూగ చెవిటి గ్రుడ్డి దైంది. అంటే త్రివిధ వైకల్యం ప్రాప్తించిందన్న మాట. ఈమె అల్బమా రాష్ట్రంలో, టస్కంబియా నగరంలో 1880లో జన్మించింది.

హెలన్ కెల్లర్‌కు తల్లి స్నానం చేయిస్తూ అమె గ్రుడ్డిదైందని అనుకుని వైద్య పరీక్ష చేయించి తెలుసుకొంది. గణగణమని బడి గంట మ్రోగితే ఏ మాత్రం చలించని కెల్లర్‌ను చూచి చెముడు ప్రాప్తించిందని భావించింది. మూడేండ్ల ప్రాయంలో కనీసం పలుకులను కూడా పలకనందున, మూగతనం సంప్రాప్తించిందని తల్లిదండ్రులు తెలుసు కొన్నారు.

మూడు విధముల అంగ వైకల్యం కల్గినా ఆమె శరీరం ఎదుగుతూనే ఉన్నది. కల్లర్‌కు చిన్నప్పటి నుండి "పట్టుదల" అనేది ఎక్కువగా ఉండేది. ఆ పట్టుదలే ఆమె భవిష్యత్తును తీర్చి దిద్దింది.

ఆ రోజుల్లో మూగ, గ్రుడ్డి చెవిటి పిల్లలకు పెర్కిన్స్ విద్యాలయంలో శిక్షణ నిచ్చేవారు. హెలన్ కెల్లర్‌ను అక్కడ చేర్చారు. మిస్ అర్నసుల్లివాన్ అనే ఉపాధ్యాయిని ఆమెకు పాఠాలను నేర్పడం ప్రారంభించింది.

ఇకపోతే లూయీ బ్రెయిలీకి బాల్యంలోనే కంటి చూపు పోయింది. అయితే గ్రుడ్డి వాళ్ళు వేళ్ళతో తడిమి చదవగల భాష, లిపిని కనుగొన్నందు వల్ల దానిని బ్రెయిలీ భాష అన్నారు. మూగ, చెవిటి, గ్రుడ్డిగా గల కెల్లర్‌కు వారి ఉపాధ్యాయిని బ్రెయిలీ భాష నేర్పి, స్పర్శ ద్వారా డి- ఒ- ఎల్- ఎల్ అనే అక్షరాలు స్ఫురించేటట్లు చేసింది. మొదట హెలన్ చక్కగా నేర్వక పోవడంతో సుల్లివాన్‌కు నిరుత్సాహం కల్గినా, ఆమె మాత్రం ఓర్పుతో నేర్పింది.

సుల్లివాన్ ద్వారా శిక్షణ పొందిన కెల్లర్ తనకు రొట్టె అవసర మైనప్పుడు పళ్ళెంలో చేతులు త్రిప్పేది. తండ్రిని గురించి తెలిపేటప్పుడు కళ్ళ జోడు పెట్టు కుంటున్నట్లు అభినయించేది. గ్రుడ్డి వారు నేర్చుకుంటున్న బ్రెయిలీ లిపిని కూడా నేర్చుకున్నది. ఒక నార్వే దేశపు బాలిక గ్రుడ్డి, చెవిటి, మూగదైనా 1890లో మాట్లాడడం నేర్చుకున్నదని కెల్లర్‌కు తెలిసింది.

కెల్లర్ ఆ విషయాన్ని బ్రెయిలీ లిపిలో వ్రాసి తమ ఉపాధ్యాయినికి తెలిపింది. సుల్లివాన్ ఆమెను చెవిటి పిల్లల పాఠశాలల ప్రధానోపాధ్యాయినియైన మిస్ సారాఫుల్లర్ పద్ద చేర్పించింది. అక్కడ కెల్లర్ మామా, పాపా అనే మాటలను స్పష్టంగా ఉచ్చరించ గలిగింది. "నేనిప్పుడు మూగదాన్ని కాదు" అనే వాక్యాన్ని స్పష్టంగా ఉచ్చరించి అందరిని ఆశ్చర్య చకితుల్ని చేసింది.

ఒక రోజున మిస్ సుల్లివాన్ హెలన్ కెల్లర్‌కు చేతిపై నీటిని వేసి డబ్ల్యు- ఎ- టి- ఇ- ఆర్ అనే అక్షరాలను స్పర్శతో కలిగించి, దానిని "నీరు" అని అర్థం అయ్యేట్లు చేసింది. ఈ విధంగా సుల్లివాన్ శిక్షణలో కెల్లర్ చైతన్యాన్ని పొందింది. వాటర్ అనే పదం నేర్చుకున్నట్లు, ఇంట్లో గల ఇతర వస్తువులను కూడా స్పర్శ ద్వారా నేర్చుకొనగలిగింది. తర్వాత కెల్లర్ రాయటం నేర్చుకున్నది. పెన్సిల్‌తో కెల్లర్ రాసిన రాత కూడా అందంగా ఉండేది.

పెర్కిన్స్ పాఠశాలలో 8 సం.రముల వయస్సులో కెల్లర్ ఉపాధ్యాయుల ముందు తన ప్రతిభను వెల్లడించి వారితో అభినందనలందుకొంది. టెలిఫోన్‌ను కనిపెట్టిన అలెగ్జాండర్ గ్రహంబెల్‌కు కెల్లర్ ఒకసారి ఉత్తరం కూడా రాసింది. తరువాత దానిని ఒక చెవిటి, మూగ, గ్రుడ్డి అమ్మాయి రాసిందా అని అతడు ఆశ్చర్యం వ్యక్తం చేసాడట. ఇదే విధంగా బోస్టన్ నగరంలో గల మేధావి వర్గం హెలన్ కెల్లర్‌లో వికసించిన మేధా సంపత్తిని తిలకించి అచ్చెరువు నొందినారట.

క్రేంబ్రిడ్జిలో ఆంగ్ల విద్యాభ్యాసం గావించి 1904లో కెల్లర్ తన 24వ యేట పట్టభద్రు రాలైంది. ఈ విషయం నలుగురికి తెలిసింది. ఇది తెలిసిన పలు సంస్థలు ఆమెను ఉపన్యసించ డానికి ఆహ్వానించాయి. 1913లో కెల్లర్ పలుచోట్లకు వెళ్ళి ఉపన్యసించింది.

కెల్లర్ ఎన్నో గ్రంథాలను రచించింది. అవి బ్రెయిలీ భాషలో ప్రచురించ బడ్డాయి. అంతేకాదు, అనేక భాషలలో కూడా వెలు వడ్డాయి. ఆమె అనేక దేశములు పర్యటించి, వికలాంగులను గూర్చి, వారి పరిస్థితులను గూర్చి ఉపన్యాసాలిచ్చింది. 1936లో సుల్లివాన్‌కు, కెల్లర్‌కు ఇరువురి కృషికి "రూజ్‌వెల్ట్ పతకం" బహూకరించ బడింది. కెల్లర్ 1968 జూన్‌లో తన 88 సం.ల వయస్సులో పరమ పదించింది.

– జయసుమన్

సీరియల్

# రాబందులు - రామచిలుకలు

హరికిషన్

(గత సంచిక తరువాయి)

## పుట్టుమచ్చలు - బ్లాంక్ చెక్

రుక్మిణి చెప్పిన సలహా ప్రకారం శ్రీవిద్య తన సేవింగ్స్ ఎకౌంట్‌లో జమపడిన పాతిక వేలూ విత్‌డ్రా చేసి మరో బ్యాంక్‌లో తన పేర ఫిక్స్‌డ్ డిపాజిట్ చేసింది. తన ఎస్. బి. ఎకౌంట్‌లో కొద్ది డబ్బే ఉన్నది. ఆ రోజున ఇంటికి రాగానే తల్లి ఇచ్చిన సీల్డ్ కవరు చించి చూస్తే ఒక ఉత్తరం, సంతకం చేసిన బ్లాంక్ చెక్, ఒక చచ్చిన తేలు పిల్లా ఉన్నయ్యి. ఉత్తరాన్ని చదువుకున్నది-

డియర్ శ్రీవిద్యా,

నీ ఎడ్వర్టయిజ్‌మెంట్ నాకు ఊపిరి పోసింది. నేను ఎవరో నీకు తెలీదు. నువ్వే కాదు నీ శరీరం కూడా నాకు బాగా తెలుసు. నీకు ఎక్కడ పుట్టు మచ్చలున్నదీ నాకు తెలుసు. ఎట్లా తెలుసునంటావా, నావి ఎక్స్‌రే కళ్ళు.

2. నా పేరు ఎ. ఎ. బి. బి. సి. సి. డి. డి. హేమంత్. పూర్తి పేరు చెప్పగలిగితే నీకు చక్కని వరునితో, నువ్వు మెచ్చిన వాడికి ఇచ్చి పెళ్ళి చేస్తాను. ఆలోచించి నా పూర్తి పేరు పూరించు.

3. పాతికవేలూ మరో బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేసిన సంగతీ నాకు తెల్సు.

4. బ్లాంక్ చెక్ పంపాను. నీకు ఎంత కావాలో నువ్వే రాసుకో పాతిక వేలకు మించకుండా.

5. నాది వృశ్చిక లగ్నం. అందుకే నీ మనస్సులో బాగా నాటుకుపోయేందుకు చచ్చిన తేలుపిల్లని కవర్లో ఉంచాను. నేను నీకు, కనపడుతూనే ఉంటాను. నన్ను నువ్వు పోల్చుకోలేవు.

6. నాకేమయినా అపకారం చెయ్యాలనే ఉద్దేశ్యం ఉంటే నాకేం అభ్యంతరం లేదు. అపకారం చెయ్యి. కాని నాది వృశ్చికలగ్నం అని గుర్తుంటే చాలు.

7. నీ వయస్సు పద్ధెనిమిదయినా నీ భావాలు పాతికేళ్ళ వివాహిత యువతి భావాలకన్న మిన్న. అందుకే నిన్ను ఎంచుకొన్నాను.

8. నీ ఎత్తు అయిదడుగుల నాలుగు అంగుళాలు.

నీ మనస్సును, హృదయాన్నీ, వయస్సునూ గిలిగింతలు పెట్టే,

ఎ. ఎ. బి. బి. సి. సి. డి. డి. హేమంత్

ఉత్తరం చదివి నిర్విణ్ణురాలయింది శ్రీవిద్య. మనస్సు స్థాణువే అయింది. గోడకు ఆనుకుని మోకాళ్ళ మీద తలానించి కూర్చుండిపోయింది. జగదాంబకూ ఏమీ అర్థం కాక ఈ ఉత్తరాన్ని తీసుకుని చదివింది. ఆవిడ మనస్సూ వికలమై పోయింది. ఉన్న ఒక్క కొడుకూ ఆ తీరుగా వెళ్ళిపోయాడు. ఒక్క కూతురు చరిత్ర ఇట్లా మారిపోతున్నది.

ఆ రోజున ఇద్దరూ భోజనం చెయ్యనేలేదు. మర్నాడు ఆ ఉత్తరాన్ని రుక్మిణికి చూపించింది. రుక్మిణి ఈ జరుగుతున్న విషయాలన్నీ భర్త వాసుకు చెప్పింది. అతను విన్నాడు. మాట్లాడలేదు. రాత్రి పన్నెండయింది. గాఢ నిద్రలో ఉన్నది రుక్మిణి. కళ్ళు మూసుకోగానే నిద్ర పట్టేస్తుంది. వాసు ఆ చెప్పిన వివరాలన్నీ నెమరువేసుకున్నాడు. రుక్మిణి పెదవుల్ని తన పెదవులతో బంధించాడు. రుక్మిణికి మెలుకువ వచ్చింది.

"ప్లీజ్, వంట్లో బావుండలేదు, క్షమించండి". మళ్ళీ కళ్ళు మూసుకున్నది.

"అందుక్కాదు, నువ్వు పరాయి స్త్రీగా నటించు. పరాయి పురుషుడుగా నేను పుట్టుమచ్చలు ఎట్లా చూడాలో తెల్సుకుంటాను".

నవ్వుతూ చూసింది రుక్మిణి.

"ఆడపిల్ల వంటి మీద, నగ్న సౌందర్య భాగాల మీద పుట్టుమచ్చలు చూడాలంటే లవ్వింగ్, టీజింగ్, ఈజింగ్, ఊయింగ్, ఈ నాలుగు సందర్భాల్లోనే వీలయ్యేది. శ్రీవిద్యకు బాయ్ ఫ్రెండ్స్ ఉన్నారా".

"నాకు తెల్సినంత వరకూ ఆ పిల్ల అట్లాంటిది కాదు. పేదపిల్లకు ప్రేమించే టైమెక్కడుంటుంది. సినిమా కథ కాదు, నిజ జీవితం. చదువుకూ, ట్యూషన్లకే వ్యవధి సరిపోదు" అన్నది రుక్మిణి.

**జరిగినకథ– 18:** బ్యాంకులో డబ్బు ఎవరు జమ చేశారో తెలియక అన్న జగదీష్ దగ్గరికి వెళ్ళి విషయం చెబుతుంది శ్రీవిద్య. అభిలాష్ జమచేసి ఉండవచ్చునని శార్వాణి అంటుంది. అభిలాష్‌ను బాగుచేసేందుకు పర్సనల్ అసిస్టెంట్‌గా సావిత్రిని నియమిస్తుంది శాంతాదేవి. హేమంత్ ఎవరో తెలుసుకోవడానికి శ్రీవిద్య యత్నాలు మొదలుపెడుతుంది. త్యాగరాజు పేరుతో వచ్చిన ఆగంతకుడు సావిత్రిని మోసగించి పాతిక వేలు తీసుకుపోతాడు.

"బాత్‌రూంలో బట్టలు విప్పుకుని స్నానం చేసేటప్పుడు ఎవరన్నా చూశారేమో".

"కావచ్చు, చాలామంది మగవాళ్ళకు అదొక దౌర్భాగ్యపు అలవాటు"

"ఆ దౌర్భాగ్యుడిని నేనే అనుకో, పక్కలో ఉన్న పర్మనెంట్ భార్య అవయవాల్నే ప్రతీ సెంటీ మీటరూ, ప్రతి రోజూ కొత్తదనం కోసం చూసే నేను పరాయి ఆడపిల్ల ఫ్రెష్ అవయవ సౌందర్యాన్ని, రిఫ్రెషర్ కోర్సు కోసం చూస్తే తప్పు లేదంటాను. ఆ పని నేనే చేశాననుకో, నా మీద నువ్వు తీసుకునే చర్య" ప్రశ్నార్థకంగా చూసేడు.

పక్కమీద లేచి కూర్చున్నది. ఆలోచనా భావంతో చూసింది. ఈ మనిషిలో ఇటువంటి దుర్బుద్ధి ఉన్నదని తెల్సుకోవటం తనకు ఇదే మొదలు-

"నేను తీసుకునే చర్య, ఏమిటని అడిగారు కదూ".

"అవును, కాని నేను చూడటం సమర్థనీయమే అంటాను, నీలో యవ్వనం, భావోద్వేగం మరో ముప్పై ఏళ్ళు ఉండొచ్చు. కాని శరీరం కాస్త పాతబడింది. కొత్త వస్తువులో ఆకర్షణ పాత వస్తువుకు ఎంత మెరుగు పెట్టినా ఉండదు. అందుకే చూశాను. ఈ చర్య తప్పు అని నువ్వనుకుంటే నాకు భార్యగా శిక్ష విధించు, అనుభవిస్తాను" నవ్వు ముఖంతో చూసేడు. మానసిక వ్యథతో తల వంచుకున్నది రుక్మిణి.

"నా కాపరంలో చిచ్చు నేనే పెట్టుకుంటున్నానన్నమాట. ఇల్లు కాళీ చెయ్యమని రేపే చెప్పేస్తాను" కోపం, క్రోధం పోటీపడినయ్యి. నవ్వేశాడు వాసు.

"రుక్మిణీ, ఎంత చదువుకున్న, ఎంత తెలివితేటలున్నా ప్రతీ ఆడదీ సెక్స్ సబ్జక్ట్‌లో స్వార్థపరురాలే, తన భర్త తను చెప్పినట్టే వినాలి. తన మాటే నెగ్గాలి. తన అభిప్రాయాల్నే గౌరవించాలి, అనే మనస్తత్వాన్ని పెంపొందించుకుంటే ఆ భర్త తనకు తెలీకుండానే తన భావాల నుంచీ దూరమైపోతాడు. నీలోనూ ఈ భావాలు ఉండటం హర్షణీయం కాదు. ప్లీజ్ రెక్టిఫై యువర్ సెల్ఫ్. కమోంగ్ టుది పాయింట్. నీ మనస్తత్వాన్ని టెస్ట్ చేశాను. దట్సార్ రైట్. శ్రీవిద్య మీద నువ్వు అనుమాన పక్ష భావం నాకు లేదు. నంబర్ టూ వాళ్ళు ఇల్లు కాళీ చెయ్యక్కర్లేదు. నంబర్ త్రీ పెళ్ళి కాని ఆడపిల్ల వంటిమీద పుట్టుమచ్చలు మనస్సులు కలిసిన, సిగ్గు లేకుండా మనస్సు విప్పి మాట్లాడగలిగిన మరో పెళ్ళికాని పిల్లకే తెలుస్తయ్యిగాని, మరొకరికి తెలీవు. బాయ్ ఫ్రెండ్ ఉన్నా వాటిని గురించి తపతపా లాడటాడు గాని ఈ పుట్టుమచ్చల్ని గురించి పట్టించుకోడు. శ్రీవిద్యను లొంగదీసుకోటానికి ఒక చిన్న ముఠా ఉన్నదనే నా ఉద్దేశ్యం. అందులో ఒక ఆడపిల్ల కూడా ఉన్నదనే నా అనుమానం. నేనూ ఆచూకీ తీస్తాను. కాని ఆడబుద్ధితో ఈ మగవాడి మీద అనుమానపడి నీ ఔన్నత్యాన్ని పోగొట్టుకోకు. శ్రీవిద్య నీకూ, నాకూ కూడా చెల్లెలు. ఈ కామన్ చెల్లెలికి ఇద్దరు అండగా నిలుద్దాం, ఓ-కే' అన్నాడు వాసు. అనునయంగా దగ్గరకు తీసుకున్నాడు.



ఆ అర్ధరాత్రి రుక్మిణి మనస్సు, శరీరము అనంత లోకాల్లో విహరించాయి.

* * * * * * * * *

ఆ మర్నాడు ఉదయం ఏడు గంటలయినా శ్రీవిద్య నిద్ర లేవలేదు. జగదాంబ కూడా కూతుర్ని నిద్ర లేపనేలేదు. రుక్మిణి వెళ్ళి నిద్ర లేపింది. ఆవులిస్తూ బద్ధకంగా నిద్రలేచి కాళ్ళు ముడిచి పెట్టుకుని కూర్చున్నది నడిమంచం మీద శ్రీవిద్య.

"కొత్త గర్భాదానపు పాత పెళ్ళి కూతురిలా ఇంకా నిద్రపోతూనే ఉన్నావా నీరజాక్షీ" అన్నది భుజం మీద చిన్న దెబ్బ వేసి రుక్మిణి

"రాత్రంతా నిద్ర లేదు. ఆందోళన" రుక్మిణిని కూర్చోమని చేత్తో చెప్పింది, మంచం మీద కూర్చున్నది.

"సరయిన తిండి కూడా గతిలేని నాకు ఈ పరీక్షలేమిటో అర్థం కావటంలేదు. నాకు వయసొచ్చాక మా అమ్మకూడా నా శరీరాన్ని అంత పరీక్షగా ఎప్పుడూ చూడలేదు. సూర్యభగవానుడూ, వెన్నెల చల్లదనమూ కూడా చూడలేని ప్రదేశాల్లోకి కవీ, రచయితా తమ కలం, కాగితాలతో వెళ్ళగలరనేది ఈనాటి నిజం. నా శరీరం మీద పుట్టుమచ్చల్ని ఓ అజ్ఞాత వ్యక్తి అంత విపులంగా చూశాడంటే అతను నిజంగా ఎక్సరే కళ్ళతోనో, ఎలక్ట్రానిక్ పరికరంతోనో చూసి ఉండాలి. ఈ పరిస్థితిలో నాకు తెలీకుండానే నేను గర్భవతినయినా ఆశ్చర్యపడక్కర్లేదు ఆడపిల్లలో జాగ్రత్త ఎక్కువైనకొద్దీ ప్రైవేట్ పార్ట్స్ బజార్న పడుతున్నయ్యి" అన్నది శ్రీవిద్య.

అట్లా మాట్లాట్టం విన్న రుక్మిణి, శ్రీవిద్య మనస్సుని మరో కోణంలో అర్థం చేసుకున్నది.

"నువ్వంటే అంత మోజుపడిన ఆ ధీరుణ్ణి పెళ్ళి చేసుకోవటం నీకు ఇష్టమేనా" అన్నది రుక్మిణి.

"పెళ్ళికాదు, జైలుకు పంపిస్తాను".

"నీవల్ల కాదు".

"ఎందుకని".

"పాతిక వేల ఫిక్సెడ్ డిపాజిట్, మరో బ్లాంక్ చెక్ కనిపిస్తే అల్లరి పడకుండా సరదాగా సరంతరయినట్లు నటించు దొంగయితే జైలుకు పంపుదాం, దొరయితే మాంగల్యం తంతునేనా మమ జీవన హేతునా, ఆ తరవాత పుట్టుమచ్చుల వెరిఫికేషన్" ఎగతాళిగా అన్నది రుక్మిణి.

* * * * * * * * *

ఆ సాయంత్రం ఆరు గంటలకు యధా ప్రకారం ట్యూషన్ చెప్పే ఇంటికి వెళ్ళింది శ్రీవిద్య. అయిదు, ఆరు, ఏడో క్లాసు పిల్లలు ఆరుగురూ ఒక ఇంటికే వస్తారు. అక్కడే ఆరు నుంచీ ఏడున్నర వరకూ వాళ్ళకు ట్యూషన్ చెప్తుంది. ఆ రోజునా అట్లాగే వెళ్ళింది.

తర్వాత ఒక తెల్లని కారు వచ్చి ఆగింది ఆ ఇంటి ముందు అందులో నుంచీ స్మార్ట్‌గా, తెల్లగా డ్రస్ చేసుకున్న యంగ్, ఎనర్జెటిక్ యువకుడు దిగాడు. పచ్చని శరీర ఛాయ, కోలముఖం, కోటేరు వేసిన ముక్కు. కుడిచేతి ఉంగరపు వేలికి వెంకటేశ్వరస్వామి ముద్ర ఉన్న బంగారు ఉంగరం. ఆకర్షణీయమైన కళ్ళు. చేతిలో బ్రీఫ్‌కేస్, కాలికి కొత్త చెప్పులు, చేతికి ఎలక్ట్రానిక్ రిస్ట్ వాచి.

వస్తూనే "పిల్లలూ గుడీవినింగ్, అంటే మంచి సాయంత్రం, మిస్, టీచర్ నమస్కారం, వీళ్ళు బాగా చదువుతున్నారా" కిటికీ పక్కన ఉన్న సోఫాలో కూర్చున్నాడు.

"చదువుకుంటున్నారు" క్లుప్తంగా సమాధానం చెప్పింది శ్రీవిద్య.

"అంకుల్ ఎప్పుడొచ్చావు. బొంబాయి వెళ్ళావన్నారు. ఆ, టీచరగారూ ఈయనగారు మాకు దూరపు బంధువు, నేను అంకుల్ అంటాను, పేర్లు మూడు కలం పేరు, వ్యాపారం పేరు, బారసాలనాటి పేరు, చాలా చాలా చాలా డబ్బున్నవాడు. పెద్ద నాన్న అంకుల్ని ఎస్. ఎస్. పి. అంటాడు. అంటే నాగార్జున



# రచయిత జవాబులు

పుత్తూరు శ్రీకాంత్, బళ్ళారి

ప్ర: మీ ధారావాహిక నవలలో శ్రీవిద్య, సత్యభామ మాటలలో చాలా ఆంగ్ల పదాలు వాడారు. అందులోనూ మీరే సృష్టించిన కొన్ని సామెతలు ఇంత మంచి విషయాన్ని ఎన్నుకొని కూడా, ఇట్లా వ్రాయకుండా ఉంటే మంచిదేమో?

జ. సందర్భానుసారంగా మనస్సులోని భావాల్ని ప్రతిబింబింప చేయటానికి కొన్ని కొన్ని ఆంగ్ల పదాలు వాడక తప్పదు

మాడభూష నరసింహాచారి, నర్సాపురం

ప్ర. మీ ఉద్దేశ్యంలో, ఇప్పటి పరిస్థితులలో దేనిని బట్టి రచయిత(త్రు)ల స్థాయిని నిర్ణయిస్తారు అంటే రచనాపరంగా ఉన్నతమైన వారా? లేక రాశి పరంగా రచనలు చేసి డబ్బు పుష్కళంగా సంపాదించినవారా?

జ: రచనాపరంగా ఉన్నతమైన స్థాయి గలవారంటె పాత రచయితల పేర్లు ఉదహరించక తప్పదు డబ్బురీత్యా అంటే నేటి రచయితల్లో కొంతమంది

సోమయాజుల సాయిప్రసాద్, హైద్రాబాద్

ప్ర : ప్రేరణనుంచీ వచ్చిన రచన, అనుభవం నుండీ వచ్చిన రచన ఈ రెంటిలో ఏది గొప్పది?

జ : అనుభవం నుండి వచ్చిన రచన. కాని అనుభవానికీ కొన్ని నియమ, నిబంధనలూ మార్గదర్శిక సూత్రాలూ ఉన్నాయ్యి.

సింగం దత్తాత్రేయమూర్తి, ఒంగోలు

ప్ర . హరికిషన్‌గారూ! ఒక రచయితగా ఆడవారి అనుభవాలు గురించి వ్రాయటం వింతగా ఉన్నది. బహుశా ఈ అనుభవాలు, అవమానాలూ, అభిలాష్‌లా మీరూ పొంది ఉంటారా?

జ : ప్రతి రచయిత, రచయిత్రీ కేవలం అనుభవాలతో నే రచనలు చేస్తుంటే వీరందరూ ఓ మినీ సృష్టికర్తలే అవుతారు. యదార్థ సామాజిక వాతావరణాన్ని అర్థం చేసుకునే అవగాహనాశక్తి ఉంటే చాలు.

## ఉత్తమ ప్రశ్న

వై. నిర్మలా చంద్రశేఖర్‌రెడ్డి, చిత్తూరు

ప్ర : అందం, తెలివి తేటలూ ఉన్న అమ్మాయిలు స్వాతిశయంతో, దుందుడుకుగా ఏదయినా చేసేస్తూ ఉంటారు. ఆ సమయంలో ఎవరు ఏం చెప్పినా వినిపించుకోరు. తమ ప్రయత్నం విఫలం కావటంతో మరింతగా స్పందించి విచారిస్తూ ఉంటారు. ఈనాటి అమ్మాయిల్లోని ఈ మార్పుకి కారణం? ఇది అభిలషణీయమేనా?

జ : అందం తెచ్చిన మనోగర్వం, ఆత్మన్యూనతాభావం ముఖ్య కారణాలు. ఇది అభిలషణీయంకాదు.

---

పి. ఉమ, బళ్ళారి

ప్ర: 1)ఆధునిక స్త్రీపై మరియు సాహిత్యంపై మీ అభిప్రాయం ఏమిటి?

2) యండమూరి వీరేంద్రనాథ్ గారిపై మీ అభిప్రాయం?

జ: ఆధునిక స్త్రీ, అంటే స్త్రీ, స్వాతంత్ర్యాన్ని గురించి ఒక అభిప్రాయాన్ని సంతరించుకుని సాటి సోదరీమణుల బాగోగులను గురించి విచారణ చేసి వారి అభ్యున్నతికి సహాయకారి కాగల మగువ. కాని అలాంటి ఆధునిక స్త్రీలు చాలా అరుదు.

2) వీరేంద్రనాథ్ పాఠకుల నాడి తెలిసిన నాణ్యమైన, అదృష్టవంతుడైన రచయిత.

శామల శ్రీనివాస్, ఖర్గపూర్

ప్ర : ఆకాశమే ఓ కాగితం అయితే, సముద్రమే ఓ సిరాబుడ్డి అయితే మరి మీలాంటి రచయితలు ఏమవుతారు?

జ : అంతటి కాగితం, సిరాబుడ్డి మీరు తేగలిగితే మీకు రచయిలంతా నక్షత్రాభిషేకం చేస్తారు.

కలగ శ్రీనివాసరావు, మద్రిపాలెం

ప్ర : తన ఫార్ములాలతో ప్రేక్షకులకు ఏవో ప్రయోజనాలూ, కొత్తదనాన్ని చూపించాలని కొందరు ఆలోచిస్తూ ఉంటారు, మీరు...?

జ : సాహిత్యంలో ఫార్ములా ఎప్పుడూ చోటు చేసుకునే ఉంటుంది

పాటీంది చక్రరావు, విశాఖపట్నం

ప్ర : స్త్రీ మీద అత్యాచారం జరిగితే, ఆమె చెడిపోయిందంటారు. అందుకు పాల్పడ్డ మగాడికి రిమార్క్ లేదా? అతను పరస్త్రీ కోసం పరుగులు తీస్తుంటే సమాజం తప్పుపట్టదేం. స్త్రీకి ఒక న్యాయం, పురుషుడికి ఒక న్యాయమా?

జ : న్యాయం విషయానికి వస్తే, పురుషుడికన్నా స్త్రీకే చట్టం రక్షణ ఇస్తున్నది. కాని రక్షణ వ్యవస్థలో భక్షకుల ప్రాతినిధ్యం ఎక్కువ. పురుషునికన్న స్త్రీకి నైతిక విలువలు చాలా ఉన్నాయ్యి. ఆ నైతిక విలువలమీద దెబ్బ తీసేది సమాజం కాని న్యాయం, చట్టం కాదు.

---

ఈ వారం ఉత్తమ ప్రశ్నని పంపిన వై. నిర్మలా చంద్రశేఖరరెడ్డిగారికి రచయిత నవల 'హృదయ కుసుమాలు' బహుమతిగా పంపబడుతుంది.

---

సాగర్ ప్రాజెక్ట్ కాదు. నిస్వార్థ సేవాపరాయణుడు, అమ్మ వెల్ త్రెడ్ అంటుంది. వెల్ అంటే బావి, త్రెడ్ అంటే తాడు. అంటే చాంతాడు. నాన్ స్టాప్‌గా పేజీ డైలాగ్ చెప్పగల దిట్ట. నేను ఎమ్. ఎమ్. అంటాను. అంటే మంచి మనిషి అని నా అర్థం''. అన్నది సరస్వతి.

''విన్నారుగా, నన్ను గురించి అర పేజీ చెప్తుంది, ప్రస్తుతం పావు పేజీతో సరిపెట్టింది. డబ్బు వస్తుంది, పోతుంది. బ్యాంకులు, చిట్‌ఫండ్ కంపెనీలు, కాని మనస్సు మాత్రం ఒకే అభిప్రాయానికి కట్టుబడి ఉంటుంది. వ్యాపారం విషయంలో కాదు, అర్థాంగిని తెచ్చుకునే విషయంలో నేను బ్యాచిలర్ ఆఫ్ ది బ్యాచిలర్స్'' అన్నాడు నెమ్మదిగా, సరళంగా, స్వీట్‌గా, మళ్ళీ, మళ్ళీ ఆ గొంతు వినాలి అని అనిపించేటట్టుగా. తల వంచుకుని విన్నది శ్రీవిద్య-

శ్రీవిద్య వైపు చూసి ఇంట్లోకి వెళ్ళిపోయాడు అతను.

''మా అంకుల్‌ని మీరెప్పుడూ చూళ్ళేదు. విజ్ఞాన, వినోద, వివాహ, వ్యాపార, వ్యవహార విషయాలు చాలా చక్కగా చెప్తాడు. అన్నట్టు రేపు ఆదివారం కదూ. మీరు భోజనానికి ఇక్కడికి రావాలి. వస్తున్నారు. వస్తారు. వచ్చి తీరాలి. రాకపోతే ఎమ్. ఎమ్ తో మాట్లాడే అవకాశాన్ని పోగొట్టుకుంటారు. రావాలి, . తప్పదు. అమ్మకు ఇప్పుడే చెప్పేస్తాను'' అని ఇంట్లోకి వెళ్ళింది సరస్వతి- తల్లి హేమలత కూడా వచ్చి చెప్పింది భోజనానికి రమ్మని. సరేననక తప్పలేదు.

* * * * * * * * *

మర్నాడు ఉదయం పదిగంటలకు వెళ్ళింది శ్రీవిద్య. అతను ఉన్నాడు. సరస్వతికి పాఠం చెప్తున్నాడు. చూడగానే లేచి నిల్చున్నాడు. సిగిరెట్‌ని కిటికీలో నుంచీ పారేశాడు.

''గుడ్‌మార్నింగ్ మిస్. శ్రీవిద్యా, రండి, కూర్చోండి''.

కూర్చున్నది, మనస్సులో నే క్వశ్చన్ పేపర్ తయారు చేసుకు వచ్చింది.

''మీ పేరు? అదే మిమ్మల్ని ఒక్కొక్కరూ ఒక్కో రీతిగా పిలుస్తారు. ఎన్. ఎస్. పి- నిస్వార్థ సేవాపరాయణుడు, ఎమ్. ఎమ్. అంటే మంచి మనిషి, వెల్ త్రెడ్ అంటే మీ పేరు చాంతాడంత పెద్దది అవునా సర్'' అన్నది.

నవ్వుతూ చూసి కళ్ళజోడు సవరించుకున్నాడు.

''నామకరణం రోజున, ఆ తరవాత కాబోయే ఐ. ఎ. యస్. ఆఫీసరయినా, నాకు ఫలాని పేరు పెట్టండి అని చెప్పలేదు. అట్లాగే తను ప్రేమించి పెళ్ళి చేసుకోబోయే అమ్మాయిని కూడా అమ్మాయితో ఏమాత్రం పరిచయం లేకుండా



# న్యాయపీఠం



బి.బి.రావు. ఎమ్.ఎ.ఎల్ఎల్.బి.

## సవతి కొడుకుకు ఆస్తి హక్కు లేదు

బట్టన్ సింగ్‌నకు ఇద్దరు భార్యలు. మహాన్‌కౌర్, ఖేమ్‌కౌర్. మహాన్ కౌర్ కొడుకులు లచ్మన్ సింగ్, గుర్‌దాస్ సింగ్. మహాన్‌కౌర్ మరణించింది. ఖేమ్‌కౌర్ కొడుకు కిర్పాల్‌సింగ్ గుర్‌దాస్ సింగ్ భార్య గుర్‌బక్స్ కౌర్. వారి కొడుకు అమర్‌జీత్ సింగ్. గుర్‌దాస్ సింగ్ కూడా మరణించాడు. బట్టన్ సింగ్ చని పోవడంతో అతని ఆస్తి అతని వారసులకు సంక్రమించింది. అతని రెండవ భార్య ఖేమ్ కౌర్‌కు కూడా ఆస్తిలో భాగం వచ్చింది. ఆ తర్వాత ఖేమ్‌కౌర్ కూడా మరణించింది. ఆమెకు చెందిన ఆస్తి మీద వివాదం ప్రారంభ మైనది. ఆమె కొడుకు కిర్పాల్‌సింగ్ ఆమె ఆస్తి అంతా తనకే చెందుతుందని నకోదర్ సబ్‌జడ్జి కోర్టులో దావా వేశారు. లచ్మన్ సింగ్, గుర్‌బక్స్ కౌర్, ఆమె కొడుకు అమర్‌జీత్ సింగ్ ఖేమ్‌కౌర్ ఆస్తిలో మూడొవంతు భాగం మాత్రమే కిర్పాల్ సింగ్‌కు వస్తుందని మిగిలిన రెండు భాగాలు లచ్మన్ సింగ్‌కు, అమర్‌జీత్ సింగ్‌కు చెందుతాయని వాదించాడు. హిందూ వారసత్వపు చట్టంలోని శెక్షన్ 15 (1) (ఎ) ప్రకారం "కొడుకులు" అనగా సవతి కొడుకులకు కూడా ఈ శెక్షన్ వర్తిస్తుందన్న వాదాన్ని తిరస్కరిస్తూ ఖేమ్‌కౌర్ ఆస్తి అంతా ఆమె కొడుకు కిర్పాల్ సింగ్‌కు మాత్రం చెందుతుందని 1984 ఫిబ్రవరి 18 తేదీన సబ్‌జడ్జి తీర్పు చెప్పారు. లచ్మన్ సింగ్ జలంధర్ జిల్లా జడ్జి కోర్టుకు అప్పీలు చేసుకున్నాడు. అప్పీలు 1986 ఫిబ్రవరిలో కొట్టి వేశారు. దానిపై లచ్మన్ సింగ్ హైకోర్టుకు అప్పీలు చేసుకోగా హైకోర్టు కూడా అప్పీలు డిస్మిస్ చేశారు. లచ్మన్ సింగ్ సుప్రీమ్ కోర్టుకు అప్పీలు చేసుకున్నాడు. శెక్షన్ 15 (1) (ఎ) ప్రకారం ఒక హిందూ స్త్రీ యొక్క ఆస్తి ఆమె మరణానంతరము మొట్ట మొదట ఆమె కొడుకులకు, కూతుళ్లకు చెందుతుందని, ఆ తర్వాత ఆమె వారసులకు చెందుతుందని, సవతి పిల్లలు శెక్షన్ 15 (1) (ఎ) క్రిందకు రారు అని సుప్రీమ్ కోర్టు 1987లో తీర్పు చెప్తూ, లచ్మన్ సింగ్ పిటిషన్‌ను కొట్టి వేశారు. □

## ఆడపిల్లలు- అనుభవాలు

ఫోర్ క్యాస్ట్ చేసి చెప్పలేదు. నా పేరు కూడా అప్పుడు కొండవీటి చాంతాడంత పెట్టారు. వీర వెంకట సత్యపాండురంగ వరప్రసాద లక్ష్మీసాంబ సదాశివ బ్రహ్మేంద్ర పార్వతీశ్వర మల్లిఖార్జునరావు. నా అయిదో ఏట నుంచీ ఏడో ఏడు వరకూ కాపీ రాయించినా, ఇంపోజిషన్ రాయించినా, చూచి రాత రాయించినా ఆ పేరు నాకు రానేరాలేదు. నా పేరు నేను పెట్టుకోడానికిక్కూడా నాకు స్వతంత్రం, హక్కు, ఆదర్శం లేకపోతే, ఇంకా నేను ప్రేమించి పెళ్ళి చేసుకుని, అమ్మాయిని కాపరానికి తీసుకొచ్చి, ముచ్చటగా, మురిపెంగా సంసారం చేసి, కుటుంబ నియంత్రణ పరిధిలో ఇద్దరు పిల్లల్ని కని, అదే నా భార్య చేత కనిపించి, వాళ్ళని పెంచి పెద్దచేసి డాక్టరుగానో, ఇంజనీరుగానో, యాక్టరుగానో, ఆఫీసరుగానో ఎట్లాచేస్తానా అని మథనపడి, వ్యథిత మనస్కుడనై, మనస్సు ఆక్రోశిస్తుంటే, ఆ రోజున అఖండ గోదావరిలో, కోటి లింగాల రేవులో తలస్నానం చేసి, పెద్ద కుంకం బొట్టు పెట్టుకుని, శివలింగాలకు గోదావరి నీటితో అభిషేకం చేసి, రావిచెట్టుకీ, వేపచెట్టుకీ మూడుసార్లు ప్రదక్షిణం చేసి, ఆదిత్యాయ, సోమాయ, మంగళాయ బుధాయచ, గురు శుక్ర శని భ్యస్య, రాఘవేకేతవేనమః అని నవగ్రహ ప్రదక్షిణ చేసి, కోదండరాముడినీ, దశరథరాముడినీ, సీతారాముడునీ, కౌసల్యా రాముడినీ, కల్యాణ రాముడినీ, భద్రాచల రాముడునీ, జానకీరాముడునీ, హనుమత్ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న సమేత శ్రీరామచంద్రునీ తల్చుకుని, ప్రతి విగ్రహానికీ ఒక నమస్కారం పారేసి, నన్ను నేను సంస్కరించుకుని, నా పన్నెండో ఏట, వంటరిగా కూర్చుని ఆలోచించి , ఆ చాంతాటి పేరుని అసహ్యించుకుని, పరిత్యజించి, గోదావరిలో వదిలేసి, బుద్ధ భగవానుడికి బోధి వృక్షం కింద జ్ఞానోదయం అయినట్టు, ఆ కోటి లింగాల రేవులో చీడీల మీద కూర్చున్న నాకు, నా పేరుని చిన్నదిగా పెట్టుకోటానికి ముందుగా, ఇత్తడి బిందెల్ని తెల్లగా తోముకుంటున్న పెద్దింటి స్త్రీలు కనిపించగానే, వాళ్ళకు చెయ్యెత్తి నమస్కరించి, వాళ్ళ ఆశీర్వాదం కూడా పొంది, ఎంత చిన్న పేరు పెట్టుకుందామా అని ఆలోచిస్తూ, ఆ చీడీల మీద పచార్లు చేస్తుంటే, కాలుజారి, ఓ ఇల్లాలి కాళ్ళ ముందు పడగానే, ఆవిడ ఖంగారుపడి, "అయ్యో నా ఆదిత్యా. పడ్డావా, నాయనా" అని లేవదీసేసరికి, సిగ్గుపడి, భయపడి, భిడియపడి-

"నేను మీ ఆదిత్యను కాను" అని గబగబా వెళ్ళిపోయి, ఆనాటి నుంచీ నా ఆ పెద్ద పేరుని, ముద్దుగా, స్టైలిష్‌గా, ఆదిత్య అని మార్చుకున్నాను" అన్నాడు అతను.

పొట్ట చెక్కలవుతుంటే చేత్తో పుచ్చుకొని నవ్వింది శ్రీవిద్య. నవ్వుతూ మంచం మీద పడుకుని దొర్లసాగింది సరస్వతి.

"పెద్ద కాంప్లెక్స్ సెంటెన్స్" అన్నది శ్రీవిద్య.

కాసేపట్లోనే మళ్ళీ మూడ్ మార్చుకున్నది.

"ప్రేయసికి ప్రియుడు, కాదు కాదు గరల్ ఫ్రెండ్‌కి బోయ్ ఫ్రెండ్ కాదు కాదు, బీద పిల్లకి భాగ్యవంతుడయిన యువకుడు బ్లాంక్ చెక్ సంతకం చేసి ఇస్తే, ఆ బీద పిల్ల ఆ చెక్కు మీద ఎంతకు రాసుకోవచ్చు" ప్రశ్నించింది.

గదిలో అటూ ఇటూ తిరుగుతున్నాడు. క్షణం ఆగి అన్నాడు.

"కావాల్సింది, అదే అతనికి కావాల్సింది ఆ పిల్ల శరీరమే అయితే ఒక్క రాత్రికి వంద చాలు. కాబోయే పెళ్ళికి ఆర్థిక సహాయం అయితే నలభైవేలు చాలు. జీవనరాగానికి ప్రాతిపదికగా నిలిచే అజరామరమయిన ప్రేమ అయితే ఆ బ్లాంక్ చెక్‌ని అతనికి తిప్పి పంపటమే మంచిది".

"అతని అడ్రస్ తెలీకపోతే" ఆ మాట అన్నందుకు నాలుక కర్చుకున్నది శ్రీవిద్య.

"భోజనానికి రండి" అన్న హేమలత పిలుపుతో ఆ ప్రస్తావన ఆగిపోయింది- ఆవిడ భర్త పోయి రెండేళ్ళయింది. సరస్వతి ఒక్కర్తే కూతురు. ఏదో క్లాసు చదువుతున్నది. ఈ ఆదిత్య ఆవిడకు వేలు విడిచిన మేనమామ కొడుకు. అప్పుడప్పుడూ వచ్చి యోగక్షేమాలు కనుక్కుని పోతూ ఉంటాడు.

"టీచర్ శ్రీవిద్యా, వెల్ ట్రెడ్ అంటే చాంతాడంత పేరుగల ఈ ఆదిత్య, మిత భాషి కాదు. అమిత భాషి. సర్పయాగం నుంచీ, సన్యాసి కాషాయ వస్త్రాల వరకూ అనర్గళంగా ఉపన్యసించగల దిట్ట. మాటల రాకెట్‌లో చంద్రమండలానికి తీసుకువెళ్ళి, జాగ్రత్తగా తీసుకు రాగల నేర్పరి" అని హేమలత అతనికి కాంప్లిమెంట్స్ ఇస్తుంటే, తన చిక్కు సమస్య ఇతని వల్ల తీరుతుందా! అనుకున్నది శ్రీవిద్య....

(ఇంకా ఉంది)



# ఈ కాలం పిల్లలు....

కె. నాగేశ్వరి

మనం మాట్లాడుకొనేది రాసేది ఒకలా ఉండడమే 'రోజుల్లో భాషంటే! అయితే సినిమాల భాష, నాటకాల భాషలో మాట్లాడడం కొందరికి సరదా! ఎమోషనల్‌గా స్లోగన్స్ చెప్తున్నట్లు బరువుగా మాట్లాడడం మంచి ఉద్రేకపరులకీ, ఆవేశపరులకీ ఉంటుంది. యువత ఈ విషయంలో చాలా ముందుంటారు. నిదానంగా, ఎదుటివారికి మనం ఎంతవరకూ ఉపయోగం, ఎంతవరకూ ఇష్టులుగా ఉన్నాం అని ఆలోచించేవారు అతికొద్దిగా ఉంటారు. శారీరక దారుఢ్యం కలిగి, మానసిక బలం కూడా తోడైనవారు ఇలా విచక్షణతోనూ, వివేకంతోనూ ప్రవర్తిస్తారు. పెద్దవాళ్లు ఇటువంటి వారిని గుర్తించి మిగతా పిల్లలనూ, లేదా స్నేహితులను, ఇలా ఉండమని నచ్చ జెప్తితే మంచిది. అలాకాక వాళ్లనో చేతకాని దద్దమ్మల్ని చూసినట్లు చూసి ఆవేశంగా, ఉద్రేకంగా మాట్లాడిన వారిని గొప్ప తెలివిగల వారిగా భావిస్తే ఇంక పరిణామాలు కొంచెం చెడు మార్గానే వెళతాయి.

వీళ్లు నిమిషాల మీద నిర్ణయాలు తీసుకుంటారు. ఏ చిన్నపని చేసినా సినిమాటిక్‌గా, లేదా హీరోయిజం, హీరోయినిజం ప్రదర్శిస్తారు. అన్నంలో వేసుకున్న నెయ్యి దగ్గర్నుంచీ, ఇంటికొచ్చే బంధువులతో స్నేహితులతో మాట్లాడేప్పుడూ, ప్రవర్తించేప్పుడూ కూడా తమకు తామే గొప్పతనంగా ఊహించు కుంటారు. అవతలి వారు వీళ్ల గురించి ఏమను కుంటారో తెలుసుకోలేనంత ఫూలిష్‌గా క్రమేణా దిగజారుతారు. వెర్రి కుదిరింది రోకలి తలకు చుట్టమన్నట్లు వీరి ఊహల్ని పద్దెనిమిది సమీపిస్తుండగా ఆచరణలో



పెట్టడానికి సిద్ధపడతారు.

అయితే వీరిలో మాత్రం స్త్రీ పురుషులకు సమాన స్థాయిలో ఫలితాలు లభించవు. మగవారు కొంచెం ఆచరణలో. పెట్టే విధంగా ఎంచుకుంటారు. ఎంచుకోడం అన్నమాట ఎందుకొచ్చిం దంటే ఈ కాలం పిల్లలు చాలా గడుగ్గాయిలు కద! ఒకతరం క్రిందయితే మగపిల్లలు క్లిష్టమైనవి ఆశయాలుగా పెట్టుకుని ఎదురీదే వారు. మగవాడంటే బరువును, బాధ్యతను జీవిత లక్ష్యాలుగా ఎంచి, సుఖాన్ని పక్కకి నెట్టాలి అన్నట్లుండాలి. అదే నైతిక బాధ్యత అని తల్లి తండ్రులు, ఒక్కవేళ్ళ ప్రియురా లుంటే ఆమె చెప్పేది. ప్రేమను కూడా త్యాగాలు చేసిన ధీరోదాత్తులు మన తెలుగు దేశంలో కొల్లలు. ఆ బరువు మోయలేనంత పెరిగి పోవడం వల్లనో ఏమో ఈ తరం వారికి కష్టం వస్తే వెనకటితరం వారైన వాళ్ల తండ్రులే అల్లాడి పోతారు. వాళ్లు కష్టపడి కప్పు టీ కూడా త్రాగకుండా ఫానైనా లేకుండా ఆరు బైట చదువుకుని ఏదో కోల్పోయినట్లు పిల్లలకి వేరే రూములు దగ్గర్నుండీ అమరుస్తున్నారు. చి చిన్న బజారు పన్లు చేయడం ఈ కాలం కుర్రకారు నామోషీ! ఇవే చేయించలేని వారు త్యాగాలు ఈ పిల్లలు చేస్తే తండ్రులు తట్టుకో గలరా? అందుకనే ఈ కాలం మగపిల్లలు ఎంచుకునే ఆశలు, ఆశయాలు, ఆదర్శాలు ఏటికి ఎదురీదేంత గట్టివి కావు. ముఖ్యంగా ఆడ పిల్లల గురించి గట్టిగా ఆలోచించరు. వాళ్ల చెల్లెలో అక్కో ఉంటే వీళ్లకంటే చదువులో కొంచెమైనా ముందుంటుంది. దానికి ఉదాహరణ గత కొద్ది సంవత్సరాల ఇంటర్ రిజల్ట్స్! అందుకని చెల్లెలిని చదివించాలి, తోడుండాలి అనుకోరు. ఆస్తుల కోసం ఆడపిల్లలు కోర్టుకు వెళ్లగల చట్టాలు వచ్చాయి గనుక వీరు స్త్రీ నుండి నిరభ్యంతరంగా ఆశించ వచ్చు. కాలేజీ అమ్మాయిలకి బాయ్ ఫ్రెండ్ కూడా మాచింగ్ గుడ్స్‌లో ఒక భాగంగా మారుతున్న దశ కనుక అమ్మాయిలతో చనువు చెడు లక్షణం కాదు. ఎటొచ్చీ లెక్చరర్లను తిట్టడం, కొట్టడం, అమ్మాయిలను వంచించడం, పరీక్షలలో మాల్ ప్రాక్టీసు చెయ్యకపోడం పెట్టుకున్నవాడే సదాశయాలు గల నాయకుడు. ఏ స్నేహితుడి బోధన వల్లో పైవాటిలో ఏ ఒక్కటి చేసినా, కొంచెం భయభక్తులు గల పిల్లవాడు తల్లి లేక తండ్రి పెట్టే చీవాట్లతో రియలయిజవడమే గొప్ప నాయక లక్షణం. "నాన్నా! తెలియక అటువంటి ఈవెంట్స్‌కి కమిట్ అయ్యాను, ఎక్స్యూజ్‌మీ!" అని ఓ వారం గడ్డం పెంచి కళ్లు లోతుకు పోయే గెటప్‌తో తిరిగితే అతడే గొప్ప నాయకుడు.

ఇంక ఆడపిల్లలు, ఇటువంటి కుర్రాడిని చూసి, "పాపం ఎంతో మంచివాడే! తెలియక అలా చేశాడు. అయినా ఎంత కష్టపడినా ఫార్వర్డ్ కాస్ట్‌కి ఉద్యోగాలు లేవు. మార్కుల కోసం అలా చేశాడు. దీనికి గవర్నమెంట్ ననాలి! అయ్యో! ముల్లు వెళ్లి అరిటాకు మీద పడ్డా అరిటాకు వెళ్లి ముల్లు మీద పడినా ఒకటే! ఆ పిల్లకి మగాళ్లను రెచ్చ గొట్టడం, చెడ గొట్టడం హాబీ! ఇతడు విక్టిమ్‌గా దొరికాడు. ఇంతకీ పని మాడమ్‌కి కులుకు ఎక్కువ. పెద్ద ఆవిడో బ్యూటీక్వీన్ అయినట్లు స్టిల్స్ ఇస్తుంది. స్టూడెంట్స్ కూడా టీజ్ చేసేటంతగా ఎట్రాక్టివ్‌గా

( 78 వ పేజీ చూడండి)



# చదువు

## కొచ్చర్లకోట వెంకట సుబ్బారావు



ఓ గారడీవాడు పాము చర్మాన్ని నేలమీద పరచి నాగస్వరం ఊదుతున్నాడు. మధ్యమధ్యలో అక్కడున్న ప్రేక్షకులను చప్పట్లు కొట్ట మంటున్నాడు. వాళ్ళంతా ఆనందంగా చప్పట్లు చరుస్తున్నారు. రెచ్చిపోయిన ఆనందంతో గారడీవాడు నాగస్వరం ఊదుతున్నాడు. పాము బ్రతికి పైకి లేచి ఎప్పుడు పడగ విప్పుతుందాని ప్రేక్షకులు ఆరాటంగా చూస్తున్నారు.

"చూసిందిచాలుకానీ ఇకపద" అంటాడు తండ్రి.

"కొంచెం వెయిట్‌చేయి డాడీ! ఆ పాము బతుకుతుంది. చూసి వెళదాం" అంటాడు కొడుకు.

"ఆ పాము సంగతి, ఆ గారడీవాడి సంగతి నేను చెబుతాను పద. నువ్వు చూడాల్సినవి ముందు ముందు యింకా చాలా వున్నాయి" అంటూ తండ్రి కొడుకుని వెంటబెట్టుకుని ముందుకు సాగుతాడు.

కొంచెం దూరం వెళ్ళేసరికి ఓ మందులు అమ్మేవాడు కనబడ్డాడు. నేలమీద రకరకాల మూలికలు పరిచివున్నాయి. ఓ మూలికను చూపిస్తూ మందులు వాడు అంటాడు – "ఇది హిమాలయాల్లో మాత్రమే దొరుకుతుంది. ఎంతో శ్రమపడి పట్టుకొచ్చాను. దీనిని అరగదీసి రోజూ రెండుసార్లు పొద్దునా, సాయంత్రం తేనెలో కలిపి తాగితే కీళ్ళనొప్పులు, పక్షవాతం, అజీర్ణం తగ్గిపోయి యవ్వనం వస్తుంది. మతిమరపు తగ్గి జ్ఞాపకశక్తి పెరుగుతుంది. కంటిచూపు మందగించినవాళ్ళకు ఇది అమోఘంగా ఉపయోగపడుతుంది."

"విన్నది చాల్లే కానీ ఇహపద" అన్నాడు తండ్రి.

"అదేమిటి డాడీ! ఇన్ని గుణాలున్న మందు మళ్ళీ దొరకటం కష్టం కదా. మనమూ కొనుక్కుంటే మంచిది. హిమాలయాల్లోంచి తెచ్చానంటున్నాడు" అన్నాడు కొడుకు.

కొడుకు అమాయకత్వానికి తండ్రి చిన్నగా నవ్వి "ఆ మందులవాడి సంగతి, ఆ మూలిక సంగతి నీకు తెలిసేట్టు నేను చెబుతాను పద" అన్నాడు

# "అభినవానంద వర్ధనుడు" జమ్మలమడక మాధవరామశర్మ

సంస్కృతాంధ్ర భాషలతో నిరుపమానమయిన పాండిత్యం కలిగి సుమారు ఆరు దశాబ్దాలపాటు అనితర సాధ్యమయిన భాషా సేవ చేసిన శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు జూలై 13వ తేదీ సాయంత్రం బంధుకోటిని, అశేష జనాలిని, దుస్తరమయిన దుఃఖసాగరంలో ముంచి తమ 82వ ఏట కీర్తిశేషులయ్యారు

శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు తెనాలి సమీపంలోని కొడితాడిప్రరు అగ్రహారంలో జన్మించారు. తండ్రి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. తల్లి హనుమాయమ్మగారు.

శ్రీ శర్మగారు విజయనగరం మహారాజా సంస్కృత కళాశాలలో "ఉభయ భాషా ప్రవీణ" చదివారు. సంస్కృతాంధ్ర భాషలలోను, అలంకార శాస్త్రంలోనూ విశేషమైన కృషి చేసారు. అలంకార శాస్త్రం ఆయనకు కరతలామలకం. "ధ్వన్యాలోకం" రచించిన ఆనంద వర్ధనుణ్ణి", "రసగంగాధరం" రచించిన జగన్నాథ పండితరాయని ఆయన క్షుణ్ణంగా అధ్యయనం చేసారు. పెక్కు అలంకార శాస్త్రాలను సంస్కృత భాషలో నుంచి తెలుగులోకి అనువదించారు. భరతముని ప్రణీతమయిన నాట్య శాస్త్రాన్ని "నాట్యవేదం" అనే పేరుతో తెలుగులోకి మార్చారు.

అభ్యసించినవిద్యకు "అధీతి బోధాచరణ ప్రసారాలని నాలుగు దశలు. సంప్రదాయసిద్ధ



మయిన జ్ఞానం ఎవరయితే పొందుతారో, వారు, దానినే చెప్పడం, ఆ చెప్పినటువంటి దానిని ఆచరించడం, ఆ ఆచరించిన దానిని ప్రచారం చెయ్యడం: ఇవి ఆ నాలుగు దశలు.

శ్రీ శర్మగారు సంస్కృతాంధ్రాలను అధ్యయనం చేసి వాటిలోని శాస్త్ర విశేషాలను జీర్ణించుకుని, వాటిని విద్యార్థి లోకంలో ప్రచారం చేసారు. విద్య వలన పొందిన బుద్ధిని లోకానికి విద్యతో పాటుగా పంచిపెట్టిన ప్రాతః స్మరణీయుడు ఆయన.

రచయితగా, కవిగా, వక్తగా, శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మగారు ఆంధ్రదేశానికి సుపరిచితులే.... తెనాలి సంస్కృత కళాశాలలోను, నెల్లూరు వేద సంస్కృత కళాశాలలోను, గుంటూరులోని ఎ. సి. కళాశాలలోను, డా కె. వి. కె. సంస్కృత కళాశాలలోను సంస్కృతోపన్యాసకులుగా పని చేసి అపారమయిన విజ్ఞానాన్ని పంచిపెట్టారు.

ఆయన పాండిత్య ప్రకర్షకు ఎన్నో ప్రశంసలు లభించాయి. మహామహోపాధ్యాయ, దర్శనాచార్య సాహిత్యాచార్య లాక్షణిక శిరోమణి, శాస్త్ర విశారద, సాహిత్య సమ్రాట్, సాహిత్య విద్యాతీర్థ, అభినవానంద వర్ధన, రసజగన్నాథ మొదలయిన బిరుదులకు ఆయన అన్వర్థ నామధేయుడు. వీరు సత్యసాయి భగవానుని స్తుతిస్తూ 40 వేల శ్లోకాలను వ్రాయడం అద్భుతమయిన విషయం.

సంస్కృత భాషాభివృద్ధికి ఎంతో కృషి చేసి దేశవ్యాప్తంగా చాలా చోట్ల ప్రసంగించారు. భువన విజయం అనే సాహిత్య ప్రధానమయిన నాటకంలో స్వయంగా ఆయన తిమ్మరుసు పాత్ర ధరించి విశేషమయిన ప్రచారం చేసారు. ప్రాచ్య కళాశాలల పాండిత్య వైభవానికి శ్రీ శర్మగారు ప్రతీక.

కూలంకషమయిన సంస్కృతాంధ్ర భాషల అధ్యయనానికి ప్రాచ్య కళాశాలలే పట్టుకొమ్మలు. అటువంటి కళాశాలలో చదివిన శ్రీ మాధవరామ శర్మగారు తరువాతి కాలంలో ఆ కళాశాలలోనే అధ్యాపక వృత్తిని చేపట్టి తమ ఆశయాలకు అనుగుణంగా విద్యాబోధన చేసారు. అటువంటి మహా మహోపాధ్యాయుడు, ఆమరణం అవిశ్రాంత సాహితీ కృషీవలుడు తెలుగువారి హృదయంలో ఎల్లప్పుడూ నిలిచి ఉంటారనడంలో ఎంత మాత్రమూ అతిశయోక్తి లేదు.

- ఐలూరి నాగభూషణమ్

## చదువు

ఇద్దరూ కొంచెం ముందుకు వెళ్ళారు. అక్కడ జనం బాగా మూగివున్నారు. ఏవో కేకలు, అరుపులు వినబడుతున్నాయి. 'కొట్టండి, తన్నండి' అన్న అరుపులు వినబడుతున్నాయి. ఏమిటాని తండ్రి కొడుకులు గుంపులో తలబెట్టిచూశారు. ఎవడో జేబుదొంగ, డబ్బుకొట్టేసి పట్టుబడ్డాడు. అందరూ 'కొట్టండి, తన్నండి' అంటున్నారు కానీ ఎవరూ ముందుకురావడంలేదు. కొడుకు చాలా ఆదుర్దాగా చూస్తున్నాడు.

తండ్రి 'పదచాలు' అనేప్పటికి కొడుకుకు కోపం వచ్చింది. సస్పెన్స్ వదలిరావాలనిపించలేదు. అప్పుడు తండ్రి లాలనగా కొడుకుతో అన్నాడు "నాయనా! వాళ్ళు అతనిని ఏమీ చేయరు."

"ఎందుకని" అడిగాడు కొడుకు.

"నీకు సరిగ్గా వినబడిందో లేదో ఆ దొంగ అన్నాడు "నా దగ్గర ఓ చిన్న కెమేరావుంది. ఎవరైతే నన్ను కొడతారో వాళ్ళ ఫొటోలు అందులో పడతాయి. మీరు నన్ను మర్యాదగా పోలీసులకు అప్పగించండి. చట్టాన్ని చేతుల్లోకి తీసుకునే అధికారం మీకులేదు."

"అయితే ఆ దొంగను వాళ్ళు కొట్టరా! పోలీసులు శిక్షిస్తారా?" అడిగాడు కొడుకు.

"అవును. ప్రతివాడికి ఏ పనైనా ముందు ఇతరులు చేయాలని వుంటుంది. అందుకే ఎవరూ ముందుకు రారు. ఇకపోతే పోలీసుల సంగతి దొంగని కంటే దోచుకున్నవాణ్ణే పోలీసులు యక్ష ప్రశ్నలువేసి విసిగించి చంపుతారు. స్టేషను చుట్టూ తిరగలేక వాడి మచ్చుమాస్తుంది. అందుకే రిపోర్టు చేయటానికి స్టేషనుకు వెళ్ళరు. నువ్వు కూడా జేబుదొంగతనం చాకచక్యం నేర్చుకోవాలి. తప్పుచేసినా సమయస్ఫూర్తితో తప్పించుకోవాలి."

"అయితే ఆ గారడీవాడి సంగతి ఏమిట? పాము నిజంగా బ్రతుకుతుందా?"

"లేదు. అవి వొట్టిమాటలు. కొంచెంసేపైనతర్వాత అతడు పేకముక్కలు బయటకుతీసి గాలిలోకి విసురుతూ గారడీచేస్తాడు. అప్పుడు అందరూ పాముసంగతి మర్చిపోతారు. దీనినే . దృష్టి మళ్ళించడం అంటారు. ఓ పెద్ద సమస్యతో సతమతమౌతూంటే దానినుంచి దృష్టి మళ్ళించేందుకు మరో సమస్య సృష్టించాలి. అప్పుడు ప్రజలు మొదట సమస్యను మర్చిపోతారు."

"మరైతే ఆ మందులు అమ్మేవాడి సంగతి ఏమిటి?"

"ఏ మందులోనూ అన్ని శక్తులుండవు. ఉన్నా అన్నిటికీ అది పనిచేయదు. అతడు హిమాలయాల్నుంచి దానిని పట్టుకునిరా లేదు. మందులు అమ్మేవాడిలా మాటలు నేర్చుకోవాలి. లేనిదానిని వున్నట్టు నమ్మించాలి."

ఇలా మూడు రకాల వింతలు చూసిన తర్వాత వాటిని అర్థంచేసుకున్న తర్వాత కొడుకుకు జ్ఞానోదయం కలిగింది.

"నాయనా! చదువులు ఎన్నివున్నా లాభం ఏమీలేదు. ఈ చదువుకున్నవాళ్ళని శాసించేది రాజకీయనాయకులే. వాళ్ళకు చదువుతో పనిలేదు. అందుకే నీకు ఇలాంటి చదువునేర్పాను. నువ్వు ఆ ముగ్గురి గుణాలు నేర్చుకుంటేచాలు దేశాన్ని ఏలవచ్చు. చరిత్రకు ఎక్కవచ్చు." చిన్నప్పుడు తండ్రి అన్న మాటలు యిప్పటికీ మంత్రిగారికి గుర్తుకువస్తూంటాయి. ◻

ప్రజాస్వామ్యం,
సామ్యవాదం, మత నిరపేక్షత,
ఐక్యత, సమైక్యతలు
శాంతి, పురోగతులకు మన
పటిష్టమైన పునాదులు.



davp 88/245 Tel.

## నిత్య నూతన సీరియల్




## ఇరువది రెండవ అధ్యాయము

(గత సంచిక తరువాయి)

సుసాని ఇంగ్లండు పోయిన తరువాత సింహళముదాక ఆమెను పంపించుటకు పోయిన రంగారావుగారొక లంకిణిని తెచ్చెను. ఆమె పరాసు మనోహారిణి. సుసానీ మనసు మాత్రమే హరించెను. ఈమె యసువులు, మనసు రెండును హరించెను. ఈమె పేరు "బియాట్రిస్ రంగారావు బియాట్రిస్‌తో తన కదివఱకు వివాహమే కాలేదని చెప్పెను. సింహళములోనే వారిదద్దరకు "సివిల్ మ్యారేజి" జరిగెను. కోటకి క్రొత్త రాణి వచ్చెను. ముక్కులమీదఁ వ్రేళ్ళు వేసికొను వారు, గుసగుసలాడువారు, క్రొత్త తగాదా పుట్టినను వారు, పరిచారకులు రక రకమై పోయిరి. వచ్చిన ఆఱు నెలలకు బియాట్రిసుకు సుసానీ కథ తెలిసెను. ఆమె చెన్నపురిలో బోయి ఉందమనును, రంగారావుకు చెన్నపురి పట్టదు. అచ్చటికి పోయినచో సుసానీకథ బియాట్రీసుకు మొదటనే తెలిసెడిది సుసానీ లండనులో నుండగా ఆమెకు రంగారావు రెండవ పెండ్లి సంగతి యెవరో స్నేహితులు వ్రాసిరి. ఆమె మొదట ననుమానించెను. తరువాత న్యాయవాదులను పోయి సలహా అడిగెను. వారు కథ యంతయు వినిరి. - "ఇదివఱకే ఒక కుమారుడుండె నంటివి. అతడు రస్యుడు, జ్యేష్ఠుడు. రాజ్యముని భాగించరానిదనుచుంటిని. నీకు సంతానము లేదు. సంతానము కలిగినను లాభము లేదు. వారు దేవాలయ ధర్మకర్తలనుచుంటివి. తిరువాన్కూరు లోననో కొచ్చిన్‌లోననో యిట్టి యిబ్బందియే కలిగినది. ఇతర వర్ణ స్త్రీకి కలిగిన సంతానమునకు ధర్మ కర్తృత్వార్హతయు లేద"ని తీర్పు చెప్పిరి. "ఇందులో నెక్కువ ప్రయోజనమున్నట్టు కనిపించదు. తప్పించుకొని వెక్కిరించుచున్నారు. రాదగినంత రాబట్టుకొని, మనోవృత్తిగా కొంత తీసికొని యింటికి చేరుట మంచిది" అని సలహా చెప్పిరి. బియాట్రిసుకు తనకు మధ్య వ్యాజ్యములు బలిసి కాబోవు ఫలితమేమియో ఆమెకు తెలియదు. హిందూ దేశమునకు మఱల వచ్చి రంగారావు మీద వ్యాజ్యము వేసి తన మనోవృత్తి ధనము తాను తీసికొనిపోదునని మఱల హిందూ దేశమునకు వచ్చెను. అచ్చటివారు హిందూ దేశమునకు పోవుట ఎందుకనిరి. సుసానీ యెందుకో వచ్చినది. రంగారావు సుసానీకి వ్రాసిన ఉత్తరములు చమత్కారముగా ఉన్నవి. సుసానీని వదలినట్లు వ్రాయడు. ఆమె ధనము పంపించు మన్నచో పంపించెను. బయలుదేఱి వచ్చుచుంటిననగా రమ్మని వ్రాసెను. ఓడకేవు పంపించెను. సుసానీకర్థము కాలేదు. ఆమె సుబ్బన్నపేటకు వచ్చెను.

తెల్లసవతు లిద్దరును ముఖాముఖి కలిసిరి. ఒకతె కింగ్లీషు దాననని గర్వము, ఒకతె ఫ్రెంచి దాననని గర్వము. భారతీయస్త్రీనని గర్వపడువారు లేక పోయిరి. నాల్గుదినములైన తరువాత రంగారావునకు తెలిసెను. "ఇర్వురిలో నెవరికో యొకరికి మనోవృత్తి యిచ్చిపంపించవలయు" నని; "చివరకు ఇద్దరికి నీయవలయునేమో!" అని అనుమానము కలిగెను. తనయెడలగల ప్రేమ యిద్దరిలో ఎవరియందెక్కువ అని విచారించెను. ప్రేమలేనిచో సుసానీ మఱల ఇంత దూరము రాదు. బియాట్రిసును మనోవృత్తి ఎంత యిచ్చిన వెడలిపోయెదవని అడిగెను. రంగారావు బియాట్రిసుకైనచో మనోవృత్తి తక్కువలో తేలిపోవుననుకొనెను. బియాట్రిసు కొలంబోలో ఒక ఫరములో పనికత్తె. ఆమె కచట నెలకు నూరు రూపాయల జీతమిత్తురు. ఆమె కొక ప్రియుడు కొలంబోలో కలడు. అతనిని వదలి రంగారావు వెంటవచ్చుట బియాట్రిసు కిష్టములేదు. కాని ఆశచేత వచ్చెను. ఈ రెండేండ్లును ప్రియునకు ఆమెకు ఉత్తరములు జరుగుచునే యుండెను. ఆ యుత్తరములు కొన్ని రంగారావునకు దొరకెను. వాని ద్వారా అతడు చర్య జరుపవచ్చును. కాని అతడేమియు చేయలేదు. మనోవృత్తి విషయము వచ్చినప్పుడు బియాట్రిసు లొంగి మాటాడవలసి వచ్చెను. కొన్ని ఉత్తరములు రంగారావు చేతిలో చిక్కినవి. తన్ను రెండవ పెండ్లి చేసికొనెను. ఎవరి తప్పులు వారికున్నవి. వ్యవహారము మధ్యే మార్గమున పైసలయ్యెను. నెల కయిదువందలతో తృప్తిపడి బియాట్రిసు కొలంబో పోయెను. ఆమెకు మఱల పూర్వపు టుద్యోగము దొరకెను. ప్రియా ప్రియులు సంతోషించిరి. సుసానీ మఱల కోటకు రాణి అయ్యెను. రంగారావుగారికి గడచిన సంవత్సరము నుండి ఒక మహావ్యాధి పుట్టెను. దివారాత్రములు నిదురలేదు. తెల్లవారులు కంగు కంగున దగ్గుచు కూర్చుండును. వైద్యులు వాయు విమానముల మీద వత్తురు. "మందులిత్తురు. తచ్చాంతి కలుగును. వైద్యులతో బాటు గుణము కూడ ఆకాశ సంచారము చేయును. శస్త్ర చికిత్సయైనచో ఎప్పుడో తేలియుండును. దీర్ఘవ్యాధులకు ఇంగ్లీషు మందులు చేయునది ఏమియులేదు. ధనవంతులకు తెలుగు వైద్యులు పనికిరారు. సవతిపోయిన తరువాత సుసానీకి కొంత కోపము తగ్గి మఱల సతీపతులు పొందికగానే ఉండిరి. రంగారావు దీర్ఘరోగి అయ్యెను. భర్త అనుటయేతప్ప మరొకటి లేదు. సుసానీకిపేటలో ఉండుట యిష్టములేక పోయెను. కొంత ధనము తీసికొని, వీరిని వదలిపెట్టి పోవలయునని ఆమె కూహ కలిగెను. మంచిమీద ఆమె ధనము రాబట్ట ప్రయత్నించెను. రోగియైన రంగారావునకు పరిచర్య చక్కగా చేయుచుండెను. అతడు సంతోషించెను. రుక్మిణమ్మారావుగారి, పురోజనీదేవిగారి, నగ కట్టంతయు క్రమ క్రమముగా సుసానీ హస్తగత మయ్యెను. జవాహరీ ఆమె పాలబడెను. రత్నములు, వజ్రములు, మాణిక్యములు, మరకతములు, సర్వమును సుసానీ సంగ్రహించెను. ప్రతి రెండు

జరిగినకథ- 54: రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటారు. దేవదాసి ప్రతి రోజూ దేవాలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది... ధర్మారావు భార్య అరుంధతి ఆరోగ్యం చెడిపోతుంది. సుబ్బన్నపేటలో నాగరికత పెరుగుతుంది. ఒకనాడు ఒక క్రైస్తవ సన్యాసిని గణాచారిని సూటిగా చూచి దడుచుకుని మంచం పడుతుంది. గణాచారి ఉన్న ఇంటిని వదలి దేవాలయంలో నివాసం ఏర్పాటు చేసుకుంటుంది. రంగమ్మ మహిళా మండలిలో చేరుతుంది.

రోజులకును వేయి, రెండు వేల రూపాయల రొక్క మామె చేతికి చిక్కుచుండెను. నాగేశ్వరరావును రంగారావు ధనము కొఱకు పీడించును. అతడు మొట్ట మొదట శిస్తువసూలు చేసి, తరువాత అప్పులుతెచ్చి, చివరకు గుఱ్ఱములు, ఇండ్లు అమ్మి తెచ్చి యిచ్చుచుండెను. కాలము గడచినకొలది రంగారావు మంచము నుండి లేచుటయేలేదు. దివాను పాతిక లక్షలదాక అప్పుచేసెను. అందులో నిరువది లక్షలు సుసానీ చేతికి చిక్కెను. అదీ రత్నములు, నగలు కాక.

మరియొకనాడు రంగారావునకు వ్యాధి ఎక్కువయినట్లు తోచెను. అతడు జీవించడనియే అంద అనుకొనిరి. వైద్యులకు పోసిన డబ్బు పోయకుండ పోయుచున్నారు. రాను పోను రైలు ఖర్చులే వేలగుచున్నవి. ఆయనకు పరిచర్య చేయుటకు పదిమంది దొరసానులయిన ఉపచారికలను నియమించిరి. వారందరు జమీందారు వద్ద ధనము సంపాదించుచునే ఉండిరి.

హరప్పకు పందొమ్మిదేండ్లు దాటినవి. అతడు సన్నగా తాచుపామువలె ఉండెను. మొగములో రాచతీవి క్రమ క్రమాభివృద్ధి పొందుచుండెనే కాని తరుగు పోవుటలేదు! ఆయన తండ్రి నొకసారి చూచుటకు పోయెను. గదియంతయు తెల్ల పరిచారికలతో నిండియుండెను. హరప్ప తెల్లని పట్టు జరీ తలగుడ్డతో, మెడలోని రత్న హారముతో, ఖద్దరు చొక్కాతో చుంగులువాఱ గట్టిన పొందూరు జరీపేటంచు ధోవతితో, గదిలోనికి వచ్చినంతనే పరిచారిక లందరును భయగ్రస్తలై దూరదూర మొఱగిరి. రంగారావు వ్యాధి ఆరంభించిన నాటనుండి కుమారుని దెస సానురాగుడయ్యెను. హరప్పనాయడు వచ్చి తండ్రి పాదముల యొద్ద సోఫామీద కూర్చుండెను.



కుమారుం "డెట్లున్న"దని అడిగెను, తండ్రి దృష్టి మాత్రము చేత తన ప్రేమయు తన దీన పరిస్థితియు ప్రకటించెను. హరప్ప అరగంట కూర్చుండి నమస్కారము చేసి వెడలిపోయెను. పోవుచున్న హరప్ప వంక సుసానీ చూచెను. వేయిమంది చక్రవర్తు లట్లు నడవలేరు. "ఓహో! యిదియా భారతదేశపు ప్రభువులనగా!పూర్వ మిట్లుండెడివారు కాబోలు!".

వెనుక నుండి చూ చిన, హరప్ప భుజస్కంధము కఠినమై, యయఃపీఠమువలె నుండెను. చాల బలహీనుడుగా అనుకొన్నారేమి జనులు?

సుసానీ తానింక స్వదేశమునకు పోయిననే బాగుండునని అనుకొన్నది. రంగారావుతో జెప్పి పోవుటయా? చెప్పకుండ పోవుటయా? అతడు మృతినొందక మునుపే పోవుట నిశ్చయమైనది, తరువాత నైనచో తనకు దమ్మిడి చిక్కదు. చేతిలో నున్న ప్రతి గవ్వయు తన వద్ద నుండి పోవును. ఇప్పుడే పోవలయును. చెప్పి పోవుటయా? చెప్పక పోవుటయా? చెప్పినచో రంగారావు పోనీయడేమో! చెప్పకుండ పోయినచో దొంగతనము అంట కట్టిదరేమో, చెప్పియే పోవలయును.

తరువాత నాలుగు నాళ్ళకు రంగారావేకాంతగా ఉన్నప్పుడు సుసానీ "నీవు వ్యాధిగ్రస్తుడవైతివి. నా తండ్రి ఒక్కడు; ముసలివాడు. అందుకనియే నేను వెళ్ళి రెండేండ్లు వరకును రాలేకపోయితిని. నేను మా దేశము పోయెదను. నీకు వ్యాధి నెమ్మదించినంతనే వ్రాసినచో వచ్చెదను" అని చెప్పెను. రంగారావు దీర్ఘముగా విచారించి అంగీకృతి ఒసగెను. తరువాత వారము రోజులలో సుసానీ ప్రయాణము నిశ్చయించెను. రంగావొక సాయంకాలమున నాగేశ్వరరావును పిలిచి ఏకాంతముగా "సుసానీ వద్ద నిరువది లక్షలున్నవి. కోటలో ని జవాహిరీ అంతయు ఆమె వద్దనే ఉన్నది. ఆమె ఇంగ్లండు పోవుచున్నది. అంత ధనము పోకుండ చూడుము" అనెను. నాగేశ్వరరావు "ప్రయత్నించెద"నని వెడలిపోయెను. మరునాడు సుసానీ నిద్రించు గదిలోని కొక కాసావానిని రాత్రిపూట దొంగిలించుటకు పంపించెను. సుసానీ మేల్కొని ఉండి పిస్తోలు చూపించెను, వాడు పారిపోయి వచ్చెను. సుసానీ ప్రయాణము దాని వలన ఒక రోజు ముందు పడెను!

రేపు సుసానీ పోవుననగా ఆ మధ్యాహ్నము హరప్ప సుసానీ గదిలోనికి పోయెను. సుసానీ కూర్చున్నది. హరప్పను నివ్వెరపోయి చూచెను. హరప్ప తానొక సోఫా మీద కూర్చుండెను. హరప్ప అనెను. "నా తండ్రి యిరువది లక్షలప్పు చేసి నీకిచ్చెను. కోటలోని జవాహిరీ యంతయు నీ పరమైనది. హిందువులు మీరనుకున్నంత ధనవంతులు కారు. మహారాజులేమో నాకు తెలియదు. జమీందారులము, మేమింత వ్యయ పెట్టలేము. మా తండ్రి రాజ్యమునకు వచ్చినది మొదలు సర్వమును వ్యయమే చేసెను. నేను తక్కిన ధనమడగను. రత్నములు, మాణిక్యములు అడుగను. మా నాయనమ్మగారివి, మా తల్లిగారివి నగలు నీ దగ్గరనున్నవి. అవి మాత్రము లండనుకు చేరవు. అవి లక్ష రూపాయల విలువ చేయును. పాతిక ముప్పది లక్షలు పట్టుకొని పోవు నీవు, నా లక్ష రూపాయల వెల నగలు నాకిచ్చివేసినచో నష్టములేదు. నేను వానిని వెల చూచి అడుగుటలేదు. అవి నాకీయవలెను" అనెను.సుసానీ దీర్ఘముగా యోచించెను. హరప్ప మొగము తేజోవంతమై, యొక దృఢ మనోనిశ్చయ సూచకమై ఉండెను. సుసానీ యీయదనుకొమ్ము, హరప్ప ఏమి చేయును?- ఏమి చేయగలడు? ఆమె మొగములో తిరస్కార భావముదయించెను. అతడన్నట్లు లక్ష రూపాయలతో పోవునది ఏమి? అతడు తల్లి నగ లడిగినాడు. న్యాయముగానే ఉన్నది. సుసానీ మొగములో జాలి కనపడెను. లక్షరూపాయలెందుకు వదలిపెట్టవలెను.? ఇంగ్లాడులో తానొకపెద్ద టచెస్ కావచ్చును. ఆమె మొగములో దురాశ గోచరించెను- ఇచ్చివేయుదుననుకొన్నది.

ఆమె మొగము చూచి హరప్ప తన కోర్కె ఫలించిన దనుకొనెను. ఆమె మనస్సులో మరల వెనుకాడినది. హరప్ప ఆమె మొగము చూచి సందేహపడెను. హరప్ప "నేను మరల సాయంకాలము వత్తునా? ఈ లోపుగా విచారించుకొనవచ్చు"ననెను. సుసానీ బయటకు పోయి యిద్దరు సేవకులను పిలిచెను. వారు వచ్చిరి. రెండు పెద్ద పెట్టెలు చూపి, హరప్పతో "ఇవిగో తీసికొని పొండు" అనెను. ఆయన తన వద్ద నున్న నగల జాబితాలు తీసి పెట్టెలు తెరపించి సరిచూచెను. అన్నియు ఉన్నవి. జాబితాలో లేని ఒక సువర్ణాభరణము పెట్టెలో నుండెను. అతడది తీసి, ఇది జాబితాలో లేదు.మీదే అని, యిచ్చివేసెను. పెట్టెలు పట్టుకొని సేవకులు నడిచిరి. హరప్ప పోవుచు సుసానీ వంక ఒక చూపు చూచెను. సుసానీ కలవరపడెను. ఇతడేమి పురుషుడు? తనకు కృతజ్ఞతయైన చూపలేదు. కరస్పర్శ చేయడు. శిరస్సు వంచడు. నోటితో మర్యాద నాచరించడు. తనవంక నొక చూపు చూచెను. అందులో ప్రసన్నతలేదు. వినయములేదు. దయలేదు. మెచ్చుదలలేదు. ఏమున్నదో తెలియలేదు. ఎందుకట్లు చూచెను? మరొకరైనచో తన యౌదార్యమును మెచ్చుకొని ఉందురు. ఇతడు తానేమియు విశేష గుణవతి కానట్లే నటించెను- మరునాడు సుసానీ బయలుదేరినది. పోలీసువారికి తన సామానును, తానును పరిరక్షితముగా మదరాసు చేరుటకు సాయమడిగినది. నాగేశ్వరరావు మంచి వంచకుడు. ఆమెతో మాట్లాడుటకు పోయినట్లు పోయి, గదిలో నున్న కొన్ని పెట్టెలు, వానికి వేసిన తాళములు చక్కగా పరీక్షించి చూచెను. పరిచారకులకు కొందరికాశలు పెట్టెను. సుసానీ మదరాసు చేరి ధనమంతయు పెట్టెల రూపముగా సరిచూచుకొని బొంబాయి చేరెను. కొలంబో మార్గమిది వరకు రెండుసార్లు పరిచితమైనదే. ఆమె బొంబాయి చూడలేదు. మరల ఇచ్చటికి వచ్చునో, రాదో! బొంబాయికేగినది.

అచట,వారము రోజు లాగినది. ధనమంతయు బ్యాంకులో వేసి. యింగ్లండు చేరిన తరువాత అచట తీసుకొనవచ్చునని పెట్టెలు తెరచి చూచెను. సగానికి సగము రాళ్ళుగా కనిపించెను. రత్నములిన్నో లేవు. ధనము పది లక్షలే ఉన్నది. సుసానీ గాబరా పడెను. తక్కిన పెట్టెలేమైనవి? పెట్టెలిచ్చుటనే ఉన్నవి కదా! ఇందులో ధనమేమైనది.



# ఉరితీతల జడ్జి

**1620**-1666 మధ్యకాలంలో జీవించిన బెనెడిక్ట్ కార్పజోవ్ జర్మనీలోని లైప్‌జిగ్‌లో కోర్ట్ ఆఫ్ సెషన్స్‌కి ప్రెసిడెంట్‌గా ఉండేవాడు. ఈయనకి రోజుకి కనీసం ఐదుగురికి ఉరిశిక్ష వేయాలని నియమంగా ఉండేది. ఆయన జడ్జీగా పనిచేసిన కాలంలో ముప్పదివేల కంటే ఎక్కువమందికే ఉరిశిక్ష విధించాడు. చిల్లర దొంగతనాలు, మంత్ర విద్యలు వంటి అల్ప నేరాలకి కూడా ఆయన ఉరిశిక్ష



వేసేవాడు. ఈయన ఉరివేసిన వాళ్ళలో ఇరవై వేలమంది స్త్రీలు. వారు చేసిన నేరం మంత్ర విద్యలు నేర్వడం. ఈ జడ్జిగారు తీర్పు ఇయ్యడంతో ఊరుకొనేవారు కాదు. ఉరితీస్తుంటే స్వయానా వెళ్ళి కళ్ళారా చూసేవాడు. నేరస్థుడు చనిపోయాక అతని శవంతో పాటు ఒక చచ్చిన కుక్కని, పందికొక్కుని కూడా పూడ్చి పెట్టుమనేవాడు. అంటే పరోక్షంగా మనుష్యులతో సమానంగా వాటినీ చంపించేవాడన్న మాట. న్యాయాన్ని ఇంత చక్కగా పాలించిన ఈ పుణ్యాత్ముడు ప్రతి రోజూ క్రమం తప్పకుండా చర్చికి వెళ్ళేవాడట. తన జీవిత కాలంలో బైబిల్‌ను ఆద్యంతం పదిసార్లు చదివానని సగర్వంగా చాటుకొనేవాడట. మరి క్రైస్తవానికి ప్రధానమైన కరుణ ఆయనకి అందులో ఎక్కడా కనిపించలేదేమో! చివరకి ఈ నరపిశాచి తాను అల్లారు ముద్దుగా పెంచుకున్న కుక్క చచ్చిపోతే ఆ ఆవేదన తట్టుకోలేక కొద్ది నిముషాలలోనే కన్నుమూశాడు. ఆ విధంగా 46వ యేటనే చనిపోయాడు కాని, లేకుంటే ఇంకెన్ని వేలమందిని పొట్టన పెట్టుకొనేవాడో? అందుకే అంటారు "నూరు గొడ్లను తిన్న రాబందు ఒక్క గాలివానకి చచ్చింది" అని.

**-కె. ఆర్. కె. మోహన్**

హిందూ దేశస్థులు గొప్ప గారడీవాండ్రు! సుసానీ ఆ మాట నిజమే అనుకొన్నది. తక్కిన డబ్బు మాత్రమెందులకు మిగిల్చిరి? అసలు దొంగతన మెట్లు జరిగినది? ఎవరితో ఫిర్యాదు చేయవలయును? ఎవరి మీద? అన్ని రీతుల ఆలోచించి "దంపినమ్మకు బొక్కినదే కూలి" అని సరిపెట్టుకొని ఓడ ఎక్కెను.

కర్ణాకర్ణిగా హరప్ప నాగేశ్వరరావు జరిపించిన కథ వినెను. ఆయన మనస్సులో ఒక సగము జుగుప్స, ఒక సగము మెప్పుదలయు అయ్యెను. ఆయన నాగేశ్వరరావు గారితో మాట్లాడక రాధాకృష్ణయ్య గారిని పిలిపించి ఆయనతో పది లక్షలు వెంటనే అప్పు తీర్చవలసిందిగా నాగేశ్వరరావునకు చెప్పించెను. దివానట్లే చేసెను. దివాను హరప్ప వ్యగ్రతకు సంతోషించెను. కాని తనకేమి లాభము? అది ధర్మారావునకు లాభమేమో? కేశవ్జీ మతమున కేమి లాభము? శంకరునకు లాభమేమో? తన ప్రార్థనా మందిరమునకేమి లాభము? వేణుగోపాల స్వామికి లాభమేమో? తన కాలేజికి నేమి లాభము? క్రొత్తగా వేదపాఠశాలలు కట్టించినచో వానికి లాభమేమో?- ఏమి లాభము? ప్రాతది కలిపి యిరువది లక్షల అప్పు. సాలునకు వచ్చునది ఆరు లక్షలు. పూర్వమయినచో నాల్గు లక్షలే.

హరప్ప క్రమ క్రమముగా కోటలో అధికారి కాజొచ్చెను. అన్ని పనులలోను తానే జోక్యము కలిగించుకొనుచుండెను. ఒకసారి బయలుదేరి పది తాణాలకు పోయి తనిఖీ చేసి వచ్చెను. తనకున్న ఊళ్ళు, రావలసిన శిస్తులు, వసూలగుచున్న వైనము, గుమాస్తాలు, వారి, వారి జీతములు సర్వమును, కనుగొని వచ్చెను. తాణాలకు పోయిలెక్కలు విచారించిన జమీందారిదివరకులేడు. అందరును హరప్ప నాయడు మరల జమీందారీని కొంత వృద్ధి చేయుననుకొనిరి. ఎచటనైన లోపములున్నవని తోచెనేని. వానిని గురించి నాగేశ్వరరావు గారికి జాబు వ్రాయును. ఆయన మొదటి రెండు మూడుసార్లు సమాధాన మియలేదు. హరప్ప ఆ లోపములను వెంటనే మరియొక అధికారి చేత సరి చేయించెను. చేయించి వారికి జీతములో ముదరా యిప్పించెను. తరువాత జరుగుపని వీరి జీతములో విరుగగ్రోయించుట. ఈ సంగతి నాగేశ్వరరావు గ్రహించెను. వ్యవహారము మించి వచ్చినదని హరప్ప నాయని కనుకూలంగానే వ్యవహరింపనారంభించెను. హరప్ప సర్వాధికార మవలంబించుచున్నాడని రంగారావుతో పోయి నాగేశ్వరరావు చెప్పెను. రంగారావు మౌన మవలంబించెను. తాను మంచములో నుండి లేవలేదు. తెచ్చిన భార్యలిద్దరును చెరొక దిక్కు పట్టిరి. కుమారుడు వ్యవహారము చూచుకొనునేని కావలసినదేమున్నది? కొన్ని ఊళ్ళలో శిస్తు వసూలు కాలేదని నాగేశ్వరరావు దావాలు చేసెను. చివరకు దావాలకయిన ఖర్చులు వచ్చిన శిస్తులకన్న ఎక్కువయినవి. హరప్ప లెక్కలు చూచి "రైతుల వద్ద నుండి శిస్తులు న్యాయముగా రాబట్టవలయుననే కాని న్యాయస్థానములకు డబ్బు పోయరాదు. ఎచట డబ్బు తక్కువ ఖర్చగునో, ఏది లాభమో మొదటనే చూచి విచారించవలయు"నని నాగేశ్వరరావునకు కాగితము వ్రాసెను. దివానుకు క్రమముగా తన అధికారము సన్నగిల్లుచున్నట్లు తెలిసెను. తానే రాజీనామా యిచ్చి వెడలిపోయినచో బాగుగా నుండుననుకొనెను. కాని రంగారావు బ్రదికియున్నాడన్న ఆశ ప్రాణమును వదలలేదు. కేసరి పట్నమన్న గ్రామములో పోరంబోకలో జమీందారుగారివి రెండు తుమ్మలుండెను. ప్రక్క రైతు తుమ్మలను గొట్టుకొని పోయి తన దొడ్డిలో వేసికొనెను. దివానుగారు రైతు మీద చర్య జరిపెను. తుమ్మలు రెండు అమ్మినచో పది రూపాయలు వచ్చును. చివరకు లెక్క చూచుకొనుసరికేబది రూకలు ఖర్చయ్యెను. హరప్పనాయుడు "మరల తమరట్లే చేసితిరి. రైతు రెండు తుమ్మలు కొట్టికొనినందు వలన జమీందారునకు నష్టమేమి? పల్లె రైతునకు వంటచెరకు సమకూడినట్లైనది. తక్కిన ఏబది రూకలెవరికి పోసిరి? వ్యర్థపు చదువులు చదివిన న్యాయవాదులకును, న్యాయస్థానమునకే గదా? నాకు తెలియకుండ తమరింకెపే వ్యాజ్యమును దయచేసి వేయవలద"ని




జాబు వ్రాసెను. నాగేశ్వరరావనుకొనెను. "ఈ జాబులో చదువులు వ్యర్థమనుట కూడ ఎందులకో? తాను పెట్టిన కళాశాల అట్టిదని నిందించుటకా" తన ఉద్యోగముతోపాటు కళాశాల కూడ మాసిపోవునట్లు తోచినది. హరప్ప ఆచూకి తీసి, బెజవాడలోనున్న తమ వకీలునకు నాగేశ్వరరావు గారికిని మైత్రియో, బంధుత్వమో ఉన్నట్లు తెలుసుకొనెను. హరప్ప అనుకొనెను. "నాగేశ్వరరావు నీతిమంతుని వలె నటించుచున్నారు. తాను ప్రభు ధనమును తక్కువ తిన్నది లేదు. నీతి అంతయు దనకిష్టములేని వారికి ఉద్యోగము లిప్పించ కుండుటలోను, సాహాయ్యము చేయకుండుటలోను కనిపించుచున్నది. ఈయనకు కేపట్టీ మతమను దొంగ కోటు దొరికినది. అది కప్పుకొని దుర్నీతియను కుష్ఠు వ్యాధి పైకి కనిపించకుండ చేయుచున్నారు".

హరప్పనాయడు సర్వాధికారియైనాడని తెలిసి కళాశాలలో పన్యాసకులు నాయనితో తమ సంగతులు చెప్పుకొన నారంభించిరి. ప్రతి వాడును ప్రత్యక్షముగా హరప్పతో మాట్లాడవచ్చును.

వారు వచ్చిరి కళాశాలలోని శిక్షాపద్ధతి చెప్పిరి. విద్యార్థులు నాగేశ్వరరావుగారికి గూఢచారులుగా నున్నారు. ఉపన్యాసకుని మీద వారు పితూరీలు చెప్పుదురు. క్రైస్తవ మతమును గాని, కేపట్టీ మతమునుగాని, బ్రహ్మసమాజమునుగాని యేమియు అనరాదు. ప్రార్థనా మందిరములో హిందూమతమును వారు నిరసింతురు. అది యితర మతమును నిరసించినట్లు కాదట! వారు నిరసించిన దానికి హిందువులు సమాధానములు చెప్పినచో అది యితర మతములను నిరసించుట యట! ఉపన్యాసకుడు విద్యార్థులతో కలిసి మెలసి ఉండరాదు. క్లాసులలో నవ్వరాదు. చమత్కార మాడరాదు. కళాశాలలోనికి శవములు రావలయును. శవములు పోవలయును. ఆధునిక నాగరికతను విమర్శించరాదు. నేటి విద్యాపద్ధతిలో దక్కిన సర్వశాఖల యందును సర్వోత్కృష్టత ఉన్నదట! ఉన్నదే యనుకొందము. ఒకడేదైనను తనకు నచ్చునిది చెప్పెనేని వాని ఆయువు మూడినట్లేనా? ఈ దేశములో వాక్స్వాతంత్ర్యము సూత్రమాత్రమున్నది. దేశములో ఎట్లున్నను చివరికిట్టి సంస్థలో కూడ అదిలేదు. భావస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము పెద్ద యధికారులకు మాత్రమే తక్కిన వారి దెసనది ఉత్తుత్తి మాట.-

ఒక సంవత్సరము కడచువఱకు హరప్పనాయడు పూర్తిగా అధికారియయ్యెను. సర్వ వ్యవహారాలను ఆయనయే చూచుచుండెను. తాను సొంతముగా చూచుకొనుచుండెను. అందుచేత ఇతరులకు నెమరాడలేదు. కళాశాల తీసివేయవలెనని హరప్ప ఊహించెను. ఈట్సునుదొరను పిలిచి ముందునాటి నుండి కళాశాల ఉండదనియే చెప్పెను. ఒక్కసారిగా

## వేయిపడగలు

ఎట్లు తీసివేయుటయని యీట్సునుదొర అభ్యంతరము చెప్పెను; హరప్ప "విద్యార్థు లందరికిని ట్రాన్సుఫరు సర్టిఫికెట్లిచ్చి పంపించవచ్చును, దోషమేమియు లే"దనెను, "మీ మిషనరీలు కళాశాల కొందురేమో కనుగొను" మనెను చంద్రారెడ్డిని పిలిపించి "కళాశాల వదలివేయబోవుచున్నాము మీ పురపాలక సంఘము వారేమైన తీసికొందురా?" అడిగెను! కళాశాల సంబంధి సర్వోద్యోగులకును నోటీసులిచ్చిరి. బ్యాంకులో కళాశాల పేర రెండు లక్షలున్నవి. స్థలము, మేడ, కుర్చీలు, బెంచీలు, సైన్సు సామానులు సర్వమును పదిలక్షలు వెలకట్టి పండ్రెండు లక్షలెవ రిత్తురో వారికి కళాశాలా సర్వస్వము విక్రయించునట్లు వెల్లడి చేసెను. ఈట్సునుదొర మిషనరీలతో కళాశాలను కొను ప్రయత్నములు చక్కగా చేసికొనుట కున్ముఖుడై ఉండెను. ఈలోపుగా రాచరికము వారివద్దనుండి గ్రామములో కళాశాల తీసివేయుటకు అభివృద్ధికి భంగకరమనియు, జమీందారుగారు విచారింప వలసియుండుననియు సలహావచ్చెను. హరప్ప సమాధానము వ్రాయించెను. "ఎస్టేటు మీద ఋణము లెక్కువైనవి. ఎస్టేటు ప్రస్తుతములో వ్యయము భరింపజాలదు. రాచరికము వారే ధనము చాలక రాజమహేంద్రవరములోని కళాశాల మూసివేయవలయుననుకొనుచున్నారు కదా! అట్లే మాకును ధనము చాలుటలేదు, ఈ సంగతి చిత్తగించవలయు"నని. మిషనరీ వారు బేరమాడిరి పదిలక్షలైనచో కొందుమనిరి. స్థలము, సౌధము, లైబ్రేరీ, సైన్సు యాపరేటరుసు పదిలక్షలు ధరకట్టుట చాల చవుక. లైబ్రరీ రెండు లక్షల

వెలకలది ఉన్నది. నాగేశ్వరరావుగారు లైబ్రేరి మీదనే ధన మెక్కువ పెట్టిరి. సైన్సు అపరేటసునకు నీ కళాశాలలో నున్నంత సామాగ్రి మరి యొకటి లేదు. పదిలక్ష లెక్కువకాదు. తుట్టతుదకు మిషనరీలు పండ్రెండు లక్షలిచ్చి కళాశాల కొనిరి. హరప్ప పండ్రెండు లక్షలును ఋణము తీర్చెను. దగ్గఱ దగ్గఱ ఇంకను పదిలక్షలుండెను.

ఒకనాడు హరప్ప తండ్రి వద్దకు పోయి, "మీరు తెలుగు మందులు పుచ్చుకొనవలయును. నాలుగైదేండ్లు వరుసగా పుచ్చుకొన్నచో తప్పకుండా గుణము కనిపించు" ననెను. రంగారావుగా రూరకుండెను. ధర్మారావు రాజశేఖరశాస్త్రి అని యొక గొప్ప ఆయుర్వేద వైద్యుని కొనివచ్చెను హరప్ప, రంగారావు, ధర్మారావు, వైద్యుడును కూర్చుండిరి.

రంగారావు: ఏమండీ! మీవద్ద మంచి యౌషధము లున్నవా? ఔషధములు మీరు సరిగా వండరటగదా!

రాజశేఖరశాస్త్రి: పాలించు ప్రభు వుండెనేని సరిగా వండకేమి? ధనమునకు వెనుక దీయనిచో సావకాశముగా ఔషధములు వండి, వాని గుణమునకు సమాధానమిచ్చెదను. అయ్యా! ప్రభువులు, ధర్మము పాలించినచో లోకమున దోషముండదు. పూర్వము తమ సంస్థానములో జరిగిన కథయే ఒకటి చెప్పెదను, వినుడు- "ఒక బ్రాహ్మణుడు పేదవాడై కట్టెలు కొట్టుకొని జీవించుచుండెనట! అతడు కట్టెలమోపు నెత్తిని బెట్టుకొని నిలుచుండి మూత్రవిసర్జన చేయుచుండెనట. హరిహరనాయడు దుర్గోపరి భాగమున నిలుచుండి అతనిని చూచి పిలిపించి "ఏమయ్యా బ్రాహ్మణుడా! తిష్టమూత్రుడవైతి వేమి? మ్లేచ్ఛుల కన్నను 'కనాకష్టమైపోతివి" అనెనట. బ్రాహ్మణుడు "ప్రభూ! నేను పేదవాడను. కట్టెలమోపు శిరస్సు నుండి దింపుకొన్నచో మఱల

## వేగమైన ఆటలో అత్యంత వేగంగా ఆడే ఆటగాడు



ప్రపంచంలో అత్యంత వేగంగా ఆడే ఒక ఏకమైన బంతి ఆట- పెలోటా వాస్కా-లో అతి వేగంగా ఆడే ఆటగాడు జోస్ అరీటో. 1979లో న్యూపోర్ట్ (అమెరికా సం. రా)లో అతను గంటకు 188 మైళ్ల (302 కి. మీ) వేగంతో బంతిని విసిరాడు.

## ఎక్కువ స్కోరు

వ్యక్తిగత రగ్బీ లీగ్ స్కోరులో అత్యధిక పాయింట్లు (10 గోల్స్ 11 ట్రయిస్) సాధించిన ఘనుడు జార్జి 'టిచ్' వెస్ట్. హల్‌కింగ్స్టన్ రోవర్స్‌కి చెందిన అతను 1905 మార్చి 4న దానిని సాధించాడు.



ఎత్తిడివాడులేడు. ప్రభువు నాకు భోజనము పెట్టనేనినే నుత్తమద్విజుడ నగుట ఎంతసే''పనెనట, హరిహరనాయడు వాని దారపుత్రులను బోషించుచుండెను. మఱల కొన్నాళ్ళు గడిచిన తరువాత ఒకనాడు సౌధో పరిభాగమెక్కి చూడగా చెరువు గట్టున ఒక బ్రాహ్మణుడు తపస్సు చేసి కొనుచుండెను.

ఎన కెంద తగులు చుండుట చేత అతడంగ వస్త్రమను పైకెగుర వైచెను. అది నాల్గు పెంగులును మేకులకు చుట్టినట్లు గాలిలో విస్తరించి ఆయనకు నీడపట్టుచుండెను. అది చూచి నాయడు బ్రాహ్మణుని తీసికొని రమ్మని పరిచారకుల పంపెను వారు తిరిగివచ్చి బ్రాహ్మణుడు రానన్నాడనిరి. నాయడే నడచి బ్రాహ్మణుని వద్దకు పోయెనట!ఆయన ఆ బ్రాహ్మణుడే.

రాజు: ఏమయ్యా! నీ దార పుత్రులను నేను పోషించితిని. నీ వందువలన తపస్సు చేయు చుంటివి. నేను పిలిచిన రాగూడదా?

బ్రాహ్మణుడు: నాచేయు తపస్సులో నాల్గవ భాగము నీకెట్లును వచ్చుచున్నది. నాపై నీకింక ప్రభుత్వ మేమున్నది?''- అనెను రాజు సమాదరించినచో వృద్ధి పొందని విద్య యేమున్నది? ఇంగ్లీషు డాక్టరులను చూడుడు! వారికి తత్త్వము తెలియదు నాడి తెలియదు. చిహ్నములనుబట్టి వ్యాధికి మందిత్తురు. ఔషధము శరీర తత్త్వమునుబట్టి యీయవలయును. వాత పిత్త శ్లేష్మములయం దొకగుణము విజృంభించి శరీరైక దేశమున ఒక వ్యాధి జన్మించును. ఆ వ్యాధికి మూలమైన దానిని నశింప చేసినచో ఆ వ్యాధి నశించును. వ్యాధి మొండి చెట్టు వంటిది. వేరుంచి కొమ్మలు నరికినచో వట్టి మోడే మఱల చిగుర్చును. అట్టి ఇంగ్లీషు వైద్యమే రాజాశ్రయమున వృద్ధి పొందుచుండగా, విష్ణ్వవతారమైన ధన్వంతరికృత వైద్యమును, చరక మహర్షి కృత సూత్రమును పనిసేయవా?పతివ్రతయైన భార్య యితర దేశ స్త్రీల యంతమాత్ర ముపచరించదా'' అనెను. రాజశేఖర శాస్త్రికి రంగారావు పాశ్చాత్య స్త్రీలను వివాహ మాడిన మాట తెలియదు. ఏదో ధోరణిలో ఆ మాట అనెను. రంగారావుగారికి కోపము వచ్చెను హరప్ప నాయడు తలపంచెను. ధర్మారావు కొంచెము కలత పడెను.

హరప్ప: ''శాస్త్రిగారూ! తమరు రేపు దయచేయు''డనెను. ముప్పురును లేచి వెళ్ళిరి. ధర్మారావుతో హరప్ప ''శాస్త్రిగారింక మన వద్దకు రానక్కఱలేదని చెప్పెను. రాజశేఖరశాస్త్రి వెడలిపోయెను. ఆరు నెలలు గడిచినవి. వ్యాధి యట్లే ఉన్నది. ఒకనాడు హరప్పనాయడు రైలులో చెన్నపురికి పోవుచుండెను. ఒక వ్యవహారము మీద పోవలసి వచ్చినది. ఆయన మొదటి తరగతిలో ఒక పరుపుమీద పండుకొని నిదురపోవు చుండెను. ఉత్తరీయము మొగమున కప్పుకొని యుండెను. కొంతసేపటికి మెలకువ వచ్చినది. ఎవరో యిద్దరు రెండవ వైపున కూర్చుండి మాట్లాడుచుండిరి. హరప్ప ఉత్తరీయము ముసుగు తీయక వినుచుండెను. మాట లిట్లు వినవచ్చెను. ''అయ్యా!మాకేమి మేము వైద్యులము. మీకు ధనమెట్టిదో మాకు విద్య అట్టిది. మీకు ధన గర్వమున్నచో మాకు విద్యా గర్వముండును. పెద్దాపురపు రాజులు, తెలుగు దేశము నందలి సంస్థలు మాంధాతృ ప్రతిమముగా పాలించిన ప్రభువులు, వారు శంబరదీవి మొదలు సముద్రతీరమున రెండు క్రోసుల పొడుగున పూర్వము పెద్దవనము వేయించి, ఓషధులు పెంచెడివారు. చెన్నాప్రగడవా రాస్థాన వైద్యులు, వారు మహా ప్రతిభులు, పెద్దాపురము వారి వియ్యంకులకు జబ్బు చేసిన దనగా, వీరు తమ ఆస్థాన వైద్యులను పంపించిరట! వియ్యంకులును జమీందారులే. వారు శయ్యమీద ఉండగా, వైద్యుడు బంగారపు ముచ్చె తొడిగికొని ఆ పాదము జమీందారు శయ్యమీద పెట్టి నాడి చూచుటకు చేయి యిమ్మనెనట. జమీందారు కోపగించి, చేయి వెనుకకు లాగికొనెను. వైద్యులు వెడలి పోయిరి. ఆరు నెలలైన తరువాత పెద్దాపురపు రాజు వియ్యంకుని చూచుటకు బోయెను. వ్యాధి అట్లే ఉండెను. ''మా వైద్యులు వచ్చిన తరువాత గూడ వ్యాధి అట్లే ఉన్నదేల?'' అని రాజుగారు ప్రశ్నించిరి. ఆయన ''ముచ్చెకాలు తెచ్చి సెజ్జమీద పెట్టెను. మేము వలదంటి''మనిరి. పెద్దాపురము ప్రభువు వారు ధన్వంతరి అపరావతారము. ఆయన సాక్షాద్విష్ణువు, మనము వట్టి మానవులము అందులకే వ్యాధి ఇట్లున్న'' దనెనట. వైద్యులు మరల వచ్చిరి. మరల నాయనముచ్చెకాలట్లే సెజ్జపైనుంచెను, నాడి చూచెను. ''ఆరు నెల లాలస్యమైనది గనుక, వ్యాధి కుదురుట కారురోజు లాలస్యమగు''నని యౌషధమిచ్చెనట ఆరు రోజులలో కుదిరెను. ప్రభువు విద్యలకీయవ లసిన గౌరవము విద్యల కీయవలెను. తనకు ధనమున్నదని గౌరవము తాను పోవుటలేదా?'' హరప్ప ముసుగుతీసి చూచెను. మాట్లాడుచున్నది రాజశేఖర శాస్త్రిగారు హరప్పను జూచి శాస్త్రిగారు ''అయ్యా తమరి నాయనగారికి వ్యాధి నెమ్మదించి[illegible] అండీ'' అనెను. హరప్ప ''తమరు క్షమించవలయును. నేను చెన్నపురి నుండి మరల ఎల్లుండి వచ్చెదను. అచట మా సౌధము అమ్మివేయుచున్నాము. తమరు నాల్గురోజులైన తరువాత మా కోటకు దయచేయవలయును'' అనెను. శాస్త్రిగారు, ''చిత్తము, చిత్త''మనిరి.•

(ఇంకా ఉంది)

# వారఫలం

## 12-8-1988 శుక్రవారం మొదలు 18-8-1988 గురువారం వరకు

★ **మేషం**: ఉద్యోగంలో పెంపు ఆశింతురా? మేలే. వృత్తి యందు వికాసం సాధింపదలతురా? అనుకూల సమయమే. ముద్రణా విధానాన వ్యాపారం సాగించుచున్నారా? అనుకూలమే. రాజకీయంగా ఏమాత్రం అనుకూలంగాదు. స్త్రీలకు: సుఖానందం, ఆరోగ్యవృద్ధి, స్వల్పాదాయం.

★ **వృషభం**: లావాదేవీలందు ఖరకాటం పడకండి. బాగా తెలిసిన వారితోనే పరిచయం ఏర్పరచుకోండి. వృత్తిని విడనాడకండి. రచనా వ్యాసంగాన సదవకాశాలు చిక్కునని గ్రహించి మెలగండి. వారం బాధాకరం కాకపోతుంది. స్త్రీలకు: వస్తు సేకరణకు, సంతానం కొరకు చేసే యత్నాలు ఫలించగలవ నుటకు గ్రహబలం గలవారం.

★ **మిధునం**: వృధాగా తాపత్రయపడి లాభం లేదు. పనులు సక్రమంగా జరుగలేదని బెంగపడరాదు. అయినవారి సంబంధం నిశ్చయం కాలేదని వాపోవరాదు. నూతన వృత్తి వికాసవంతం కాలేదని బాధ పడరాదు. స్త్రీలకు: ఉద్యోగవృత్తులందు శ్రద్ధ వహించుట శ్రేయస్కరం. ప్రభుత్వ పరంగా రావలసిన డబ్బు అందటం నిశ్చయం.

★ **కర్కాటకం**: విజయవంతమైన వారం. ఆటపాటల్లో ప్రావీణ్యత గలవారికి, కళారంగాన ప్రతిభా ప్రాభవములున్న వారికి, అన్నివిధాలా అనుకూలత యున్నది. చక్కని అవకాశాలు రానున్నవి. వ్యాపారం వృద్ధి చెందనున్నది. ఇరుగుపొరుగు సహాయమున్నది. స్త్రీలకు: ఆదాయం, విద్యా విధాన పెంపు, పత్రికా గౌరవం చేకూరుట నిశ్చయం.

★ **సింహం**: శతృత్వం కొనాడుచున్నది. ఏవో గొడవలు రావటానికి ఆస్కారమున్నది. అనవసర కాలక్షేపానికి దారి తీయవచ్చు. రాశి యందు స్థితుడైన 'కేతుగ్రహం' సామాన్యంగా వదలుతాడని అనుకోరాదు, అనవసర చికాకులు లేకపోవు. 'ఛాయాగ్రహం గదా!' అని వదలరాదు. గ్రహజపం అవసరం. స్త్రీలకు: రాబడి యందు లోపం ఉండదు గాని ఏవో చికాకులు తప్పవు.

★ **కన్య**: సామాన్యంగా జరుగవలసిన వ్యవహారాల కన్నా ఎక్కువగా జరగటం, ఆదాయం అభివృద్ధి నందటం, ఆరోగ్యం వృద్ధినందటం, నూతన వ్యాపారం చేపట్టగల మార్గాలు సమకూడటం జరుగుతుంది. విద్యా విషయంగా మేలు చేకూరుట, కళారంగాన అభివృద్ధి కనిపించుట వార విశేషం. స్త్రీలకు: ఉత్తముల సహవాసం, సాహచర్యం చేకూరుటకు ఆస్కారం గలవారం.

★ **తుల**: వారాంతాన బంధుమిత్ర సమాగమం. సుఖసంపదలు, వృత్తి యందు అనుకూలం, రాజకీయంగా ఏదో మేలు సాధించుటకు ఆస్కారం ఏర్పడుతుంది. ఉత్తరాల మూలంగా పలువిషయాలు గ్రహిస్తారు. స్త్రీలకు: నూతన వ్యక్తులతో పరిచయం, వ్యాపార లాభం.

★ **వృశ్చికం**: విధీ విరామం ఎరుగక శ్రమించినా లాభం లేదు. ఆలోచించి ఆలోచించి, ఒకానొక వ్యాపార విషయాన బాధ పడుతారు. ప్రభుత్వ పరంగా కొందరకు మేలు జరుగవలసి ఉన్నా, జరుగక యిబ్బంది పడుతారు. స్త్రీలకు: ప్రత్యేకించి వ్యాపార దక్షులయిన వారికి అనుకూలం. ఉద్యోగమయితే, 'ప్రమోషన్' రావచ్చు, గ్రహించాలి.

★ **ధనుస్సు**: కానివారున్నారు, లేనిపోని మాటలతో కాలక్షేపం, అనుకూలురతో తగాదాలు రావచ్చు. శుభ కార్యాలోచనలకు సమయంగాదు. ఏ కార్యం సానుకూలం అగుటకు 'శని' భగవానుడు అనుకూల్యుడు గాడు. వృత్తి వికాసం చెప్పదగిన సమయంగాదు. స్త్రీలకు: బంధు మిత్రులతో తగాదాలు రావచ్చు. ఆదాయమందు లోపం కనిపించవచ్చు.

★ **మకరం**: మాటా మంచితనంతో వారమంతా మసలుకోనకపోతే యిబ్బందులు రావచ్చు, చికాకులు రావచ్చు, ఒకవేళ గొడవలు కూడా రావచ్చు. అప్పు సప్పులు యివ్వటం, పుచ్చుకొనటం ఈ వారం శ్రేయస్కరం గాదు. అప్రయత్నంగా ధనం లభించినా అంతకు అంత వ్యయం చేయక తప్పదని గ్రహించాలి. స్త్రీలకు: వృత్తి వికాసం, రాజకీయంగా మేలు, ఆదాయాభివృద్ధి.

★ **కుంభం**: శ్రేయోదాయకమైన వారం. విద్యావంతులకు చక్కని అవకాశాలుంటాయి. రాజకీయంగా అనుకూలత సంభవించుట గమనింపదగిన వారాంశం. వ్యాపార సంబంధంగా మీ ప్రయత్నాలు సర్వానుకూలంగా కొనసాగుతాయి. స్త్రీలకు: వృత్తి రీత్యా పెంపు, ఉద్యోగించే వారికి 'ప్రమోషన్' లభించవచ్చు. గమనించాలి.

★ **మీనం**: ఎలాటి సందేహం లేక, మీకు చెందవలసిన సైకం అంది తీరుతుంది. మీ యింట శుభం జరుగుట నిశ్చయం. 'జాయింటు' వ్యాపారంలో పొరపాట్లు జరుగవచ్చు, కుమ్ములాట జరుగవచ్చు శాంతంతో కార్యసాధన గావించుకొనటం శ్రేయం. స్త్రీలకు: సభా మర్యాద, పత్రికా మర్యాదలకు ఆస్కారం. అవివాహితులకు సదవకాశాలు. ఉత్తర ప్రత్యుత్తరాల వలన పలు విషయాలు, అనుకూలమైనవి గ్రహింపగలుగుతారు.

— విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి

'ఉత్తరాలు' శీర్షికకి
రాసేవారు
తమపేరు, పూర్తి చిరునామా
తెలుగు లిపిలో రాయాలని
మనవి చేస్తున్నాము.
—సంపాదకుడు.



# దూరదర్శనం

లత

## దలైలామా ఇంటర్వ్యూ

సోమవారం (4–7–88) నాడు దలైలామాతో ఇంటర్వ్యూ ప్రసారం చేశారు. దలైలామా టిబెట్ ప్రజలకి మత గురువే కాదు, రాజు కూడా. ఈ పధ్నాలుగవ దలైలామా తన పొటాలా భవనం వదిలి, దేశం వదిలి చైనా యుద్ధం అప్పుడు అంటే 1963, 64 ప్రాంతాలలో భారతదేశం ఆశ్రయం కోరి వచ్చారు. అప్పుడు పంచన్‌లామా చైనీస్‌తో కలిసినట్ట్లు గుర్తు. దలైలామా ఎన్నుకో బడతాడు. చనిపోయిన దలైలామా పోలికలు ఉన్న పిల్లవాడు ఆయన వస్తువుల్ని గుర్తు పట్టటం లాటివి కొన్ని చేస్తే ఆ పిల్లవాడిని ప్రజలు ఎన్నుకొని పొటాలా రాజభవనానికి తీసుకొచ్చి దలైలామా ట్రైనింగ్ ఇస్తారు. ఈ దలైలామా శాంతిప్రియులు. ప్రపంచ ప్రజలు ఒకరితో ఒకరు అలా ఉంచి ప్రకృతితో కూడా కలిసి పోవాలని సందేశం ఇచ్చారు. నవ్వుతూ ఆయన చెప్పిన డార్జిలింగ్ టీ ఇష్టం అన్న మాట బాగుంది. మంచి ప్రోగ్రాం.

దలైలామాతో ఇంటర్వ్యూ లాటి కార్యక్రమాలు కొన్నాళ్ళన్నా ముందుగా ఎనౌన్స్ చేయాలి. బౌద్ధుల మాట అలా ఉంచి ఆయన పునర్జన్మ ఒప్పుకునే ప్రధమ బౌద్ధుడు.

## నిర్మల

ప్రేమచంద్ నవలకు నాటకీకరణ

నిర్మల వయసయిన వ్యక్తికి భార్య, అయినా పిల్లల్నీ ఇంటినీ చూసుకుంటుంది. ఇంట చేరిన వెధవాడపడుచు ఒకావిడ– ఇంటి మర్యాదను గురించి నిర్మలకు బోధిస్తూ ఉంటుంది. ఉన్న పిల్లలలో పెద్దవాడికి డబ్బు లివ్వకపోతే కోపం– అందుకని ఆ ఇంట్లో ఉన్న యువకుడు– నిర్మలకు సవతి మరిది అతనికి మిఠాయి తిన బెట్టిందని చిన్న తమ్ముడి చేత చాడీలు చెప్పిస్తాడు. అంతవరకు జరిగింది. అనాధాశ్రమం అనే పేర ఇది తెలుగులో అనువాదం అయినట్లు గుర్తు. స్వాతంత్రానికి చాలా పూర్వపు కథ– బాగుంది– ఆ నాటి పరిస్థితుల్ని బాగా చూపారు.

## ఉడాన్

సమర్పణ నటన కవితా చౌదరి.

కల్యాణి పెద్ద ఇలాకాకి ట్రాన్స్‌ఫర్ అయింది. అక్కడ పోలీసులు యధావిధిగా భాగ్యవంతుల భూస్వాముల పక్షం. వారిని చివాట్లు పెట్టి– నీటి సమస్య ఉన్న గ్రామంలో ప్రజల తగాదాలు తీర్చి గ్రామ అధ్యక్షుడికి నీళ్ళ సమస్య చెపుదామని వెళ్ళి ఒక యువకుడిని చివాట్లు పెట్టి– ప్రేమలో పడ్డది. ఈ నాటకం మొదట ఎంత చిరాగ్గా ఉందో ఇప్పుడంత సరదాగా ఉంది. కవితా చౌదరి నటన ఇప్పుడు బాగుంది. ఢిల్లీ నుంచి వచ్చే నాటకాల్లో ఇంతెజార్– మొదటిది. ఉడాన్ రెండోది.




అయ్యో! ప్రేక్షక దౌర్భాగ్యం వల్లనో, శని వక్రించటం వల్లనో– ఈ మధ్య ఒక మహానాడులో వచ్చిన శనివారం నాడు తప్ప సినిమా వేళకు కరెంటు పోతుంది. పగలు రెండున్నరకి పోయి సాయంత్రం ఆరున్నరకి వస్తుంది– మళ్ళీ ఎనిమిదింటికి పోయి తొమ్మి దింటికి వస్తుంది– ఆ కారణంగా తెలుగు సినిమా ముందు గంటా చివరి అరగంటా కత్తిరించ బడుతుంది. అంటే టి. వి. ఇచ్చే రెండుంపావు గంటలలో గంటన్నర పోతే ముప్పావు గంటా సినిమా చూస్తాం అనుకోవద్దు– అప్పుడు హైద్రబాద్‌లో పోవటం వలన అంతరాయం క్షమించాలి అక్షరాల అయిదు నిముషాలూ– ఈ భాగం ఫలానా వారిస్తున్నారు గనక వారి గొడప రెండు నిముషాలూ, వార్తలకి ముందు అయిదు నిముషాల ప్రకటనలూ– మొత్తం పన్నెండు నిముషాలూ పోతాయి. నలభయి అయిదు నిముషాల్లో పన్నెండు నిముషాలు పోతే 33 నిముషాలు మాత్రమే మనం సినిమా చూడగలం. ఒక విజయవాడ వంశీకుంజం ప్రాంతాల్లోనే కాదు ఆంధ్ర దేశం అంతా అలాగే ఉంది.

తరువాత ఆధారూట్ ఆధా సచ్ అని ఒక హిందీ నాటిక వస్తున్నది. ఈ వారం సిగ్నేచర్ ట్యూన్ దానిదే గాని– మామూలుగా వచ్చే వెకిలి హాస్యపు నాటిక రాలేదు. ఏదో వచ్చింది– కనక అది మారిందని నా అభిప్రాయం– అంతేకాదు "నదీ కినారే" అని డైలాగు చెపుతూ బోంబేలో ఉన్న అపార పారావారమైన అరేబియా సముద్రాన్ని చూపించారు. ఏమి టి. వీ. ఢిల్లీ కూడా ఇలాటి చెత్త నాటకాలు చూపిస్తూ అందులో తప్పులు చూపిస్తుంటే.... మన కర్మ అంతే మరి.

## రామాయణ్

రామాయణంలో ముఖ్య ఘట్టమైన రామ రావణ యుద్ధం ముగిసింది. రావణ వధ జరిగింది– యుద్ధ చిత్రణ మంచి సరదాగా ఉంది– విభీషణుడు అమృతభాండం నాభి దగ్గర ఉందని చెప్పాడు– సరిగ్గా అప్పుడు కరెంటుపోయి– రావణుడు చనిపోయిన తరువాత అంటే రెండు నిముషాలకు వచ్చింది. కనక ఈ రోజు ఎలక్ట్రిసిటీ స్తంభాలు లాటివి రావణుడితో పాటు యుద్ధంలో మోక్షం పొందకుండా నిలిచి ఉన్నాయి. రావణుడి ఆత్మ రాముడిలో లీనం అవుతుంది. రాజోచిత మైన చివరి సంస్కారం చేయమని– లంక లంకా వాసులదే అని చెప్పి రాముడు పరివారంతో వెళ్ళి పోయాడు. రావణుడి కుటుంబం దుఃఖపడు తుండగా ఈ వారం అయింది. నిజంగా అరుణ్ గోవిల్ చక్కగా నటిస్తున్నాడు– రామాయణం అయిపోతుందంటే బెంగగా ఉంది– చక్కని మాటలు. భారతీయుల పూర్వ సంస్కారం ఎంత గొప్పది. అది రాముడితో ఉంది.

తిరుమల రామచంద్ర

# సిలబస్ పరీక్షా విధానాలు మారాలి:— డాక్టర్ బ్రహ్మానందతో గోష్ఠి

ఫిబ్రవరి మొదటి వారంలో సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజస్‌లోనూ (మధురై), మార్చి ఆఖరు వారంలో మైసూరులోను బి. ఎ. ఎం. ఎ. స్థాయిలో సిలబస్ పునర్నిర్మాణానికి సంబంధించిన శిక్షణ శిబిరాలలో పాల్గొని వచ్చిన డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానందగారిని ఇటీవల కలుసుకొనడం తటస్థించింది. వారితో ఆ విషయాలపై జరిపిన ...లో నేను తెలుసుకొన్న విషయాలను ...ంక్షిప్తంగా తెలియ జేస్తున్నాను...

ప్రశ్న : బ్రహ్మానంద గారూ! నమస్కారం. మీరు వెళ్ళి వచ్చిన శిక్షణ శిబిరాల ఉద్దేశ్యమేమిటి? ఎక్కడెక్కడి నుంచి ప్రతినిధులు వచ్చారు?

డా. బ్రహ్మ : బి. ఎ., ఎం. ఎ. స్థాయిలో మాతృ భాషా సాహిత్యాలకు సంబంధించిన (దక్షిణాత్య భాషల) శిక్షణ శిబిరాలు ఇవి. ఈనాడు చిన్న తరగతుల్లో ఎలా వున్నా, బి. ఎ. స్థాయి తరువాత అటు సిలబస్‌లోను, ఇటు పరీక్షా విధానాల్లోను, అనేక లోపాలున్నాయి. లోపాలున్నాయని గుర్తించడమే తప్ప వాటిని ఎలా సవరించాలో ఏ విశ్వవిద్యాలయమూ ఆలోచించని దశలో మైసూరులోని భారతీయ భాషా కేంద్ర సంస్థ ఒక ప్రయోగం చేపట్టదలచింది. అదే ఈ శిక్షణ శిబిరం.

తెలుగు, కన్నడ, తమిళ, మలయాళ భాషా సాహిత్య పాఠ్య ప్రణాళికలను దాదాపు 50 విద్యా సంస్థలు, విశ్వవిద్యాలయాల నుంచి తెప్పించి క్షుణ్ణంగా పరిశీలించి, వాటిని శాస్త్రీయ ప్రమాణాల మేరకు పునర్నిర్మాణం చేయడానికి కొంత మంది నిపుణుల చేత శిక్షణోపన్యాసాలిప్పించి, ఆ నేపథ్యంలో ఆ శిబిరంలోని ఉపాధ్యాయుల చేత తమతమ సిలబస్సులను ఎలా సవరించాలో సూచించాలని సంస్థ భావించింది. అందుకే దక్షిణ భారతం మొత్తం మీద 40 మందిని ఆహ్వానించింది.

ప్ర : మన రాష్ట్రం నుంచి ఎవరెవరు పాల్గొన్నారండీ?

డా. బ్ర: తెలుగుకు సంబంధించినంత వరకు శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం నుంచి నేను, మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి డాక్టర్ అక్కిరెడ్డి, హైదరాబాద్ యూనివర్శిటీ నుంచి డాక్టర్ రామనరసింహం పాల్గొన్నామండి.

ప్ర : సిలబస్ సవరణ అంటున్నారే. ఇంత వరకు మీరు చెబుతున్న సిలబస్సంతా తప్పా?

డా. బ్ర : మాకు కూడ మీలాగే అనిపించిందండీ. ఇంతకూ, మన సిలబస్సును తప్పుపట్టే హక్కు వీరికెవరిచ్చారు??— అని కూడా గొణుక్కున్నాం. కాని, సంస్థ ఉద్దేశం ఆక్షేపణ కాదని ఫార్మాట్ (స్వరూపం) విషయంలో మాత్రమే శాస్త్రీయ ప్రమాణాలకు అనుగుణంగా లేమని భావించడం వల్ల ఆ ప్రమాణాల మేరకు మేమే వ్రాసుకోవాలని చెప్పడం వారి ధ్యేయమని గ్రహించాము. సిలబస్ తిరిగి వ్రాయడం ఎందుకంటే, దానిలో స్పష్టతలేదు. వాటిలోని అంశాల మీద వివరణ వుండదు. ఇది విద్యార్థికీ ఉపాధ్యాయునికీ, పరీక్షకునికీ క్లేశదాయకమే.

ప్ర : ఇదేదో మాడర్న్ లింగ్విస్టిక్స్ లాగ వుంది. అర్థం కావడంలేదు. ఒక్క ఉదాహరణ ఇవ్వగలరా?

డా. బ్ర. : (నవ్వి) వినండి. తిక్కన విరాటపర్వం ప్రథమాశ్వాసం ఫలానా పద్యం నుంచి ఫలానా పద్యం వరకు— అని సిలబస్సులో వ్రాస్తామనుకోండి. ఆ పాఠం ఎందుకు చెప్పాలి. ఎంత చెప్పాలి. ఏఏ విషయాలను వివరించాలి. వాటి మీద ఎలా ప్రశ్నలు వేయాలి. అనే సూచన పాఠ్యాంశాల వివరణలో వుండాలి. ఇదీ స్పష్టత అంటే.



డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానంద

ప్ర : ప్రశ్నల విషయంలోనూ చర్చించారా?

డా. బ్ర : సిలబస్ అస్పష్టంగా వున్నప్పుడు ప్రశ్నలూ అస్తవ్యస్తంగా వుండడం సహజం. ద్రౌపది పాత్ర పరిశీలనము గావించునది— అనే ప్రశ్నకో, తిక్కన కవితాతత్త్వమును వివరించునది— అనే ప్రశ్నకో ఎంత సమాధానం వ్రాస్తే పదికి పది మార్కులు వస్తాయో ఏ మేస్టరు చెప్పగలడు? పోనీ ఆ పరీక్షకుడే సమాధానం వ్రాసినా, మరొక పరీక్షకుడు ఎన్ని మార్కులు వేస్తాడో చెప్పగలరా? పది వేస్తాడా?? దీన్నిబట్టి, మార్కులు ఇవ్వడంలో సబ్జక్టివిటీ ప్రధానమౌతుందని స్పష్టం. దీనికితోడు శిష్య వాత్సల్యం, పక్షపాతం, కక్కుర్తి, శత్రుత్వం తోడయితే ఈ నాటి విశ్వవిద్యాలయ పరీక్షలు రూపుదాల్చాయి. వీటిని అరికట్టాలి. ఎలా అరికట్టగలమంటే, తొలుత సిలబస్సుని స్పష్టంగా రచించడం ద్వారామాత్రమే.

ప్ర : ఒకనమూనా సిలబస్ తెలుపుతారా?

డా. బ్ర : ప్రయత్నిస్తానండీ. దీన్ని గురించి భారతిలో కొన్ని వ్యాసాలు వ్రాద్దామనుకుంటున్నాను. మొదట సిలబస్‌లో ఏ సాహిత్య విభాగం చెబుతున్నామో, దాన్ని గురించిన వుద్దేశ ప్రకటన వుండాలి. సిలబస్ అంటే కేవలం పుస్తకాల లిస్టుకాదు. అదొక వాల్యుబుల్ డాక్యుమెంటు. అది విద్యార్థికి, ఉపాధ్యాయునికీ, పరీక్షకునికీ— ముగ్గురికీ గైడ్‌గా వుండాలి. అందుకే ఉద్దేశ ప్రకటన అన్నాను.

ఒక కోర్సు తీసుకోడానికి వచ్చే విద్యార్థి నుంచి ఉపాధ్యాయుడు ఏ అర్హతలను ఆశిస్తాడో (ఎంట్రీ బిహేవియర్) వాటిని స్పష్టం చేయాలి. ఉదాహరణకు— ఎం. ఎ. స్థాయిలో తెలుగు వ్యాకరణం చదువ దలచుకొన్న వారికి బి. ఎ. స్థాయిలో మూలతః బాలప్రౌఢ వ్యాకరణాల పరిచయం వుండాలి. అది లేకుండా బి. ఎస్సి. నేపథ్యంతో వచ్చి చేరే విద్యార్థికి వ్యాకరణం బోధించాలంటే, ఉపాధ్యాయుడు కొన్ని రోజులపాటు ప్రత్యేక శిక్షణ ఇచ్చి, వారిని కూడ బి. ఎ. స్పెషల్ విద్యార్థుల స్థాయికి తీసుకురావాలి. దీన్ని

రెమిడీ కోర్స్' అంటారు. పాఠ్యాంశాల ఉద్దేశాలను ప్రకటించే విధానాలు మూడు రీతులు : ఒక అంశాన్ని చదవడం ద్వారా విద్యార్థులకు సామాన్యంగా అబ్బే సామర్థ్యాలేమిటి? విశేషంగా ఏవి అబ్బుతాయి? క్లాసు గది అవతల వానిలో ఆ పాఠ్యాంశాలు ఏ మార్పులను తీసుకు వస్తాయి. ఈ మూడింటిని గురించి స్పష్టంగా వ్రాయాలి. దీన్నిబట్టి ప్రతి పాఠ్యాంశాన్ని ఒక నిర్దిష్టమైన ధ్యేయంతో ఏర్పరచాలని అర్థం. ఉదాహరణకి తెలుగు వ్యాకరణం తెలుస్తుంది అన్నది సామాన్య లక్ష్యమైతే, సుప్రసిద్ధమైన తెలుగు వ్యాకరణ చరిత్ర వ్యాకరణంలోని పరిచ్ఛేదాలు తెలుస్తాయన్నది విశేష లక్ష్యం, ఎలా తెలుస్తాయో పాఠ్యాంశాలను వర్గీకరించి ప్రదర్శించడంలో వుండాలి. ప్రతి యూనిట్ పాఠ్యాంశానికి నిర్దిష్టమైన కాలవ్యవధిని నియమించుకోవాలి. ఏ విషయాన్ని ఎంత లోతు వరకు చెప్పాలన్న విషయంలో స్పష్టమైన సూచనలుండాలి: ప్రతి అంశానికి సంబంధించిన పాఠ్య గ్రంథాలు, రెఫరెన్సుల పట్టిక వుండాలి.

ప్ర : ఇన్ని విషయాలను వ్రాయడం వల్ల ఇంకేదైనా లాభం ఉందా?

డా. బ్ర : ఈ విషయాలు ఆధారంగానే తరగతి స్థాయినిబట్టి ప్రశ్నలో తేడాలు కల్పించి ప్రశ్నించడానికి అవకాశం కలుగుతుంది. ఉదాహరణకు : తిక్కన పాఠం చెబుతున్నాం. కథ– వర్ణన– శిల్పం ఇవి బి. ఎ. స్థాయిలో వుండగా సమకాలీన చరిత్ర– సంస్కృతి– ధర్మాద్వైతం– హరిహర తత్త్వం– శాంత రసం మొదలైన లోతులు ఎం. ఏ. స్థాయిలో వుంటాయి. ఈ లోతుల్ని సిలబసులో సూచించినప్పుడే, ప్రశ్నలలోను లోతులు వస్తాయి. లేకపోతే అన్ని పేపర్లలోను ఒకే విధంగా వివరించండి, వర్ణించండి అని అడుగుతూ పోతూంటారు. ఈ అశాస్త్రీయతను అరికట్టడం కోసమే సిలబస్సును స్పష్టంగా నిర్వచించాలనడం.

## హైదరాబాద్ నోట్‌బుక్

ప్రశ్న : ఇలా సిలబస్సు మారినప్పుడల్లా బోధన పద్ధతులూ మారుతూ పోవూ?

డా. బ్ర : ముఖ్యమైన ప్రశ్న వేశారు. తప్పకుండా మారుతాయి. పేపరును బట్టి బోధనా పద్ధతులుంటాయి. పాఠం చదివి చెప్పడం, సారాంశాన్ని ఉపన్యసించడం, వ్యాకరణం, ఛందస్సు మొదలయిన అంశాల్లో ఎక్సర్సైసులు, ట్యుటోరియల్స్, ప్రతి యూనిట్ పూర్తయిన తరువాత విద్యార్థులు ఎంత వరకు అర్థం చేసుకొన్నారో పరిశీలించడానికి చిన్న పరీక్షలు పెట్టడం, సెమినార్లు, చర్చలు, సదస్సులు నిర్వహించడం, కవులతో, విమర్శకులతో పరిచయం చేయించడం, సుప్రసిద్ధ చారిత్రక గ్రంథాలయాల సందర్శన– ఇవన్నీ బోధన పద్ధతులలో భాగం అవుతాయి.

ప్ర : మరి వీటన్నిటికీ తిప్పుతూంటే పాఠాలు పూర్తవుతాయా?

డా. బ్ర : సరిగ్గా ఈ అంశంలోనే మనందరం చాల పొరపాటు చేశాం. పాఠం చెప్పడం, వినడం మాత్రమే కాదు. విద్యార్థి అవగాహనలో ముందు చెప్పిన విషయాలన్నీ భాగం కావాలి. దీన్ని అనుసరించి, ఐదు ప్రశ్నలు వందమార్కులు అన్న పద్ధతిలో తూకం వేయడం కాకుండ, ఇది వరకు చెప్పిన అన్ని పద్ధతులలోను విద్యార్థి సామర్థ్యాన్ని అధ్యాపకుడు లెక్కకట్టాలి. క్లాసు గదిలోపల, బయట శిష్యుణ్ని విలువకడుతూ వుండాలి.

ప్రశ్న : మరి అలాంటప్పుడు గురువు ఎంత చెబితే అంతే అవుతుంది కదా?

డా. బ్ర : అలా కాకుండా ఉండడం కోసమే ప్రతి దశలోను ఆబ్జెక్టివిటీకి ప్రాధాన్యం ఇవ్వడం. చిన్న ప్రశ్నలు, సంగ్రహ వ్యాఖ్యలు, సమస్యల సాధన– ఇలాటి కొత్త విషయాలను ప్రవేశపెట్టడం ద్వారా గురువుగారి 'దురభిమానాలకు' కూడ అడ్డుకట్ట వేయడానికి అవకాశం వుంది. గురువులకు, శిష్యులకు మధ్య స్నేహబంధం వుంటుంది. కసి, ద్వేషం వుండవు. అందుకే ఈ ప్రయత్నం.

ప్ర : మరి మీరందరూ అలాటి సూచనలు చేశారా??

డా. బ్ర : అక్కడ సమావేశమైన అధ్యాపకులు తొలి విడతగా తమతమ పాఠ్య గ్రంథాలను 13 ప్రమాణాల దృష్ట్యా సవరించే ప్రయత్నం చేశారు. మేము ముగ్గురం తెలుగు సిలబసుకు సవరణలు సూచించాము. వీటన్నిటినీ మరొక కమిటీ మ సవరించింది. ఈ సిలబసును ముద్రించి అ. కళాశాలలకు నమూనాలుగా పంపుతారు. దానినిబట్టి సిలబస్సు మార్చుకోవచ్చు. ఇవి సలహాలు మాత్రమే.

ప్రశ్న : అబ్బ! చెప్పినంత సేపు చెప్పి చివరికి నీళ్ళు కుమ్మరించారండీ! సలహాలు అంటే, ఎవరు వింటారు సార్?

డా. బ్ర : తమ సమస్యలను పరిష్కరింప జేసే పద్ధతులను ఎవరు కాదంటారండీ! తప్పకుండా హర్షిస్తారు. ఆ విశ్వాసంతోనే ముందడుగు వేస్తున్నాం.

వారి ప్రయత్నం సఫలం కావాలని ఆశిస్తూ సెలవు పుచ్చుకున్నాను.

**ఉపశ్రుతి :**

టి. వి.లో ఏదో తెలుగు సినిమా వస్తూంది. కేకలు, ఏడ్పులు వినిపిస్తున్నాయి. అబ్బబ్బా !! తెగ కేక వేస్తున్నాడే ఎవడు వాడు??– అని గట్టి, విసుక్కున్నాను. కేకలేసేవాడే హీరో– అన్నాడు ఐదేళ్ల ఫల్గున. మరి ఏడ్చే ఆవిడ?– అనడిగాను. ఎందుకేడుస్తారు?? కష్టాలు వస్తే ఏడుస్తారు. ఆ ఏడ్చేది హీరోయిన్– అన్నాడు ఫల్గున. ఈ వయస్సుకే నీ కింత తెలివి తేటలున్నాయి. పెద్దయితే ఫాల్కే అవార్డు నీదేరా!!– అన్నారు పక్కన వున్న ఓ పెద్ద మనిషి.

## ఈకాలం పిల్లలు

( 64 వ పేజీ తరువాయి)

ఉండడం ఆవిడ తప్పు. అందుకే ఎదిరించాడు. ఆ సార్‌కి తనే గొప్పగా లెసన్ చెప్తానని హెడ్‌స్ట్రాంగ్! అతనికి బాగా బుద్ధి చెప్పాడు. పాపం...." అని ఈ కుర్రాడికి హీరోయిజం ఆపాదించి ఆరాధించడం....

ఇంక ఆడపిల్లలు వారి స్వంత ఆలోచనలు ఇలా హీరోయినిజం, లేక నాయికా లక్షణాలు తమకు తామే ఆపాదించుకోడం మరీ హాస్యాస్పదంగా ఉంటుంది. సాటి స్త్రీని అర్థం చేసుకొనే సంస్కారం ఏ పిల్లకి అలవాటవుతుందో ఆమె ప్రగతి మార్గాన ప్రయాణించ గలదు. "అబ్బే! నీలా కాదు, నేను వేరు, నా తరహా వేరు, నా పద్ధతి వేరు. అసలు నేను పెరిగిన విధంగా నువ్వు పెరగవు. పెరగలేవు" అని తోటి పిల్లను ముందూ వెనక అపహాస్యం చేయటం ముఖ్య లక్షణం. దానికి పెద్దవారు, "అవును. మేం నీకు ఒక్కర్తెకే పండగకు డ్రస్ కుట్టించాం. మేం కొనుక్కోలేదు. ఫలానా వారు అతి చవకరకంది కొన్నారు. అదీ ఏడిస్తే!" అని సమర్థించడం. అంతేకాదు పిల్లలు ఇలా అందులో ఆడపిల్లలు ఇలా ఇంకో ఆడపిల్ల గురించి అనడం వినడమే కొంత నేరం. దానిని ప్రోత్సహించి ఏదో ఒకనాటికి తమకి మెడకో ఉచ్చులా తయారయే ప్రమాదం ఉందని తెలుసుకోక పోడం మరింత తప్పు.

పతివ్రతల కథలు, పురాణాలు చదివించి ఆడపిల్లకి సాత్విక స్వభావం నేర్పించ నక్కర్లేదు. నొప్పింపక, తానొవ్వక అన్నట్లు ఆడపిల్లను తయారు చేయాలి. అలాగే ఒక పని చేసే టప్పుడు దాని ఫలితాలు మంచికి తెచ్చేవిగా ఉండాలనే ఆలోచనను మగపిల్లాడి కుండేట్లు చెప్పాలి. ఇటువంటి పిల్లలు, స్నేహితుల మధ్య, బంధువుల మధ్య గుర్తింప బడతారు. ముందు ముందు కుటుంబానికీ, జీవిత భాగస్వాములకీ కష్టం కంటే సుఖం ఎక్కువ పంచిస్తారు. జీవితాల్లో నాయికా నాయక లక్షణాలివే!

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667




# ఈ సారి పుట్టిన రోజుకు మీనాకు అన్నిటినీ మించిన కానుకను ఇచ్చింది ఫెయిర్ అండ్ లవ్‌లీ.

ఈసారి పుట్టిన రోజుకు మీనాకు అన్నిటినీ మించిన కానుకను ఇచ్చింది ఫెయిర్ అండ్ లవ్‌లీ.

గత రెండు నెలలుగా మీనా ఈ రోజుకోసం ఎదురుచూస్తూ ఏర్పాట్లు చేసుకుంటోంది. ఆ ఏర్పాట్లలో ఫెయిర్ అండ్ లవ్‌లీ కూడా ఓ ప్రముఖ పాత్ర వహించిందనుకోండి. ఫెయిర్ అండ్ లవ్‌లీ సహజంగా, మృదువుగా పనిచేసి ఆమె ఎల్లప్పుడూ కలలు కంటున్న మెరిసే, సునుపైన వంటి చాయను ఆమెకు సమకూర్చింది. అందంగా ప్యాక్ చేయబడిన కానుకను అందిస్తూ రవి వెన్నెలను ఆస్వాదించే చకోరంలా మెచ్చుకున్నది ఆమెకు సమకూరిన ఆ పసిడి చాయనే. ప్రశాంతమైన ఆమె ముఖంలో ఓ చిరునవ్వు. ఇదే సమయంలో ఆమె హృదయంలో ఫెయిర్ అండ్ లవ్‌లీ పట్ల కృతజ్ఞతా గీతికల గానం.

మీనా లాగే మీరూ ఇతర్లు గుర్తించేలాంటి మెరిసే చాయను సమకూర్చుకోవచ్చు ఫెయిర్ అండ్ లవ్‌లీతో.

### ఓ ముఖ్యమైన వైజ్ఞానిక విజయం

ఫెయిర్ అండ్ లవ్‌లీ...మీ వంటికి సహజమైన రీతిలో మెరుగైన చాయనివ్వడానికి కీవిలో వుంది



ఫెయిర్ అండ్ లవ్‌లీ వాడక ముందు



ఫెయిర్ అండ్ లవ్‌లీ వాడిన తర్వాత

ఓ సాటిలేని ఫార్ములా. ఇది ముఖ్యంగా రెండు విధాల పనిచేస్తుంది. ఒకటి, ఇది చర్మం అడుగున పనిచేసి



శరీరం స్వతహాగా లోలోనే నల్లబడటాన్ని అరికడుతుంది—ఇంకే క్రీమూ చెయ్యలేని తీరులో. రెండు. దీని డబల్ సన్‌స్క్రీన్ చర్య, నల్లబరిచే సూర్యకిరణాల నుంచి చర్మాన్ని కాపాడుతుంది. అంచేత 6 నుంచి 8 వారాల్లో పైకొచ్చే కొత్త చర్మ పొరలు మరింత మెరుగైన చాయ కలిగి వుంటాయి. మీరు ఫెయిర్ అండ్ లవ్‌లీని నియమానుసారంగా రోజుకు రెండుసార్లు ఉపయోగిస్తూంటే, మీ వంటి ఛాయ ఎంతో అందంగా, మృదువుగా, సహజమైన మెరుపుతో అలాగే నిలిచి వుండటం ఖాయం.

### ఉపయోగించే పద్ధతి

ముఖం, మెడ, చేతులు కడుక్కున్నాక, వాటి మీద ఫెయిర్ అండ్ లవ్‌లీ క్రీము చుక్కచుక్కలుగా రాయండి. ఇప్పుడు వేళ్లతో ఎగువకు రుద్దుతూ నెమ్మదిగా మాలిష్ చేయండి ఫెయిర్ అండ్ లవ్‌లీ పనిచేయడం ప్రారంభించగానే మీకు కొద్దిగా జిమజిమలాడవచ్చు. భయపడకండి, అది తొందరగా తగ్గిపోతుంది.

### సులభంగా లోనికి ఇంకుతుంది

ఫెయిర్ అండ్ లవ్‌లీ ఇంతకు ముందుకన్న ఇప్పుడు మరింత మృదువైనది, నేవళమైనది. ఇది చర్మం అంతటా మరింత సమానంగా పరుచుకొని, మరింత సులభంగా లోనికి ఇంకుతుంది త్వరలోనే ఆ తేడాని మీరు అనుభూతి చెందుతారు...కంటితో చూస్తారు కూడా!

మీరు ఫెయిర్ అండ్ లవ్‌లీ గురించి ఇంకా ఏమైనా అడిగి తెలుసుకోవాలనుకుంటే, ఈ చిరునామాకు వ్రాయండి. శ్రీమతి కవితా కుమార్, ఫెయిర్ అండ్ లవ్‌లీ అడ్వయిజర్, పి. ఓ బాక్స్ 758, బొంబాయి 400 021.

ఫెయిర్ అండ్ లవ్‌లీ

వంటి చాయని మెరుగుపరిచే క్రీమ్




## వంటి చాయను మెరుగుపరుస్తుంది సహజంగా, మృదువుగా...ఇతర్లు గుర్తించేలాగ!

LINTAS FAL 59 2720 TL

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# గిన్నీసు బుక్ రికార్డులో ఎక్కిన బాల క్రీడాకారుడు



"గ్రోపింగ్ ఇన్ డార్క్‌నెస్" అనేది మనతత్వము. చీకట్లో వెతుకులాటకు మనము అలవాటు పడ్డాము. గాలిలో దీపం పెట్టి దేవునిపై భారము వేసే మనస్తత్వము మనది. కృషి తక్కువ ఫలితం ఎక్కువ ఆశిస్తాము. పాశ్చాత్య నాగరిక అనుకరణ అనే అపోహల మధ్య మన సమాజం నడుస్తుంది. పిల్లలను ఆటలకు దూరముగా యుంచి, పతకాలు లభించలేదని విచారిస్తాము. విదేశాల్లో పిన్న వయసు నుండి పిల్లలను ఆటలు, వ్యాయామ క్రీడల్లో ఆసక్తి కలిగిస్తే మనలో వి కొద్ది మంది 16 ఏళ్ళ వయసులో శ్రద్ధ చూపుతారు. విదేశాల్లో పిల్లలకు ఆసక్తి కలిగిన క్రీడల్లో తల్లితండ్రులు ప్రోత్సహించి, మంచి క్రీడాకారునిగా రూపొందునట్లు కృషి చేస్తారు. ఎంత ప్రమాదకరమైన క్రీడ అయిన తమ పిల్లలు ఆసక్తి చూపితే తల్లితండ్రులు విరికి మందు పొయ్యక, మనోనిబ్బరము కలిగించి, ధైర్యముగా పాల్గొనునట్లు అనుమతిస్తారు. అందుకే వారు పతకాల విజేతలు అయితే, మనము పతకాల విజేతల జాబితాలో కనిపించము.

నీటిపై తేలుచు, అద్భుతమైన నైపుణ్యము ప్రదర్శించిన చిన్నారి బాలుని గురించి యావత్తు ప్రపంచం కొనియాడుచున్నది. ఫ్లోరిడాకు చెందిన యీ పసివాని పేరు పార్క్స్ బానిఫే. మూడు నెలల వయసులోనే నీటిపై ఆడుకొనుటలో సరదా చూపాడు. అతని సరదా తీర్చడానికి తల్లితండ్రులు ఒక 'ఆట' కనిపెట్టారు. అది నీటిలో గాక, యింటిలి గదిలో 'ట్రైనర్ స్కీస్' (నీటిపై 'స్కీయింగ్'కు ముందు నేలపై నేర్చుకొనుటకు ఉపయోగించు స్కీయింగ్ కాలి జోళ్ళుపై శిక్షణ యిచ్చేవారు. అలవాటు అయిన తర్వాత బహిరంగ ప్రదేశములో తరీఫీదు యిచ్చారు. పార్క్స్ బెనీఫే వయసు ఆరు నెలల 29 రోజులు యున్నప్పుడు మొదటిసారిగా నీటిపై శిక్షణ ప్రారంభించాడు. నీటి ముంపు నుండి రక్షణకై ప్రత్యేక రకమైన 'లైఫ్- జాకట్' రూపొందించారు. దీని వలన నీటిలో పడిన తేల డమే కాక ముఖముపై వైపు యుండునట్లుగా, 'నెక్ బ్రేస్' వలన తల కదలకుండా, నీటిలో మునగకుండా కాపాడును. తల్లి బెట్టీ బానీఫే కుమారుడు 'స్కీయింగ్'లో ప్రావీణ్యత పొందుటకు ప్రత్యేక శ్రద్ధ వహించినది.

ఇప్పుడు పార్క్స్ బెనీఫే వయసు అయిదు ఏళ్ళు నీటిపై పెద్దవారితో సమానముగా అద్భుతాలు చేయకలడు. ఒకే 'స్కీ' ఉపయోగించి నీటిపై తేలి ఆడుచూ ఉంటాడు. 'స్కీయింగ్' మొదలు పెట్టిన తర్వాత ఆ ఒక ఆ 'స్కీ' కూడా ఉండదు. పెద్ద వారి వలె వాటర్ స్కీ వదలి వేసి కాళ్ళకు ఏమి లేకుండా నైపుణ్యం చూపుతున్నాడు.

నేడు ప్రపంచములో అతి పిన్న వయసులో 'వాటర్ స్కీయర్'గా గుర్తింపు పొందుటయే గాక, గిన్నీస్ బుక్ రికార్డులో కూడా ఎక్కాడు. ఈ అద్భుత నైపుణ్యాన్ని, ధైర్యాన్ని మనలో పెద్దవారు సహితము చూపలేరు అనుట అతిశయోక్తి కాదు.

పిల్లలలో గల ప్రతిభను గుర్తించి, వారికి మనోనిబ్బరం కలిగించి తీర్చిదిద్దవలసిన బాధ్యత పెద్దలకు ఉన్నది. మన పిల్లలలో కూడా అతని వలె ఆసక్తి, ప్రతిభ యున్నవి. కాని లోపించినది పెద్దల ప్రోత్సాహం. మనలో పిల్లలు 'నీటి పంపు' వద్దకు వెళ్ళిన జలుబు, జ్వరము వస్తాయి అని భ్రమతో ఎంతో మంది విద్యావంతులైన తల్లితండ్రులు కలరు. పెద్దలు పిల్లలకు ధైర్య వచనాలు పల్కవలసినది పోయి విరికి మందు నూరిపోయుట మన ఆచారము. ఇక యీ పిల్లలు పెద్దవారు అయి పతకాలు సాధిస్తారు అని ఎలా ఆశించగలము?

అంతర్జాతీయ స్థాయిలో పతకాలు సాధించాలంటే పిన్న వయసు నుండి శిక్షణ అవసరము.

—ముకరమ్




## అల్ట్రాసోనిక్ క్రిమి కీటక నిరోధి

ఇన్నోసిస్ ఎలెక్ట్రానిక్స్ ప్రయివేట్ లిమిటెడ్ సంస్థ ఇటీవలే క్రిమి కీటకాదులని తరిమివేసే ఒక సాధనాన్ని ప్రవేశపెట్టారు.

దీనిపేరు ఇన్నోసిస్ అల్ట్రాసోనిక్ పెస్ట్‌రిపెలర్ : మోడల్ 2000.

ఇది ప్రాణులని చంపదు. దానిలో నుంచి వెలువడే శబ్దం మానవుల చెవులకి వినపడదు కాని పురుగులు వగయిరా ఆ శబ్దాన్ని విని పారిపోతాయి.

దాని వెల రు. 495. పన్నులు అదనం. దానిని కంప్యూటర్ గదులలో, హోటళ్లలో, బాంకులలో ఇంకా ఇతర ప్రదేశాలలో నెలకొల్పవచ్చు.

## నెఫ్జా సంగీత, నృత్య కళా పరిషత్

నెఫ్జా ఫిలిం జర్నలిస్టు అసోసియేషన్ వారు జులై రెండవ వారంలో అఖిలభారత స్థాయిలో కూచిపూడి, భరత నాట్యం, రికార్డు డ్యాన్సులలోను, లలిత సంగీతం, సినిమా పాటలు, హిందీ సినిమా పాటల పోటీలు నిర్వహిస్తారు. పై పోటీలకు సినీ సంగీత దర్శకులు, సినీ నృత్య దర్శకులు న్యాయ నిర్ణేతలుగా వ్యవహరిస్తారు. వివరాలకు:- నెఫ్జా నాటక కళా పరిషత్, నియర్ అనితాహాలు, నెల్లూరు-524003కి రాయవచ్చు.

## ఎర్రన పీఠము సిద్ధాంత వ్యాస రచన పోటీ

ఒంగోలు ఎర్రనపీఠం వారు "ఎర్రన రచనలు - సమాజ చిత్రణము" అనే అంశంపై 150 అరఠావు పేజీలకు మించని సిద్ధాంత వ్యాసాలను ఆహ్వానిస్తున్నారు. ఉత్తమ వ్యాసానికి మూడువేల రూపాయల నగదు బహుమతి ఇస్తారు. ఈ పోటీక వ్యాసాలని పంపేవారు మూడు వ్రాత ప్రతులని శ్రీ ధారా రామనాథశాస్త్రి, కార్యదర్శి, ఎర్రనపీఠం, మామిడిపాలెం, ఒంగోలు- 523002 అనే చిరునామాకి 31 డిసెంబరు, 1988 లోగా అందేటట్లు రిజిస్టర్డ్ పోస్టులో పంప గోరుతున్నారు.

## గడియారం వెంకటశేషశాస్త్రి అవార్డు

కడప రచనా సాహిత్య వేదిక తరపున ఏర్పాటు చేయబడిన మహాకవి స్వర్గీయ గడియారం వెంకటశాస్త్రి అవార్డుకి 1 జనవరి, 1985 నుంచి 31 డిసెంబరు, 1987 వరకు ప్రచురించబడిన కావ్యాలు, కవితా సంపుటాలని ఆహ్వానిస్తున్నారు. ఈ అవార్డు విలువ అయిదు వందల రూపాయలు. కావ్యం లేదా కవితా సంపుటి ఒకే రచయితది అయి ఉండాలి. అనువాదాలు, పునర్ముద్రణలు పరిశీలింపబడవు. రచయితలు, ప్రచురణ కర్తలు, సాహితీ మిత్రులెవరైనా పుస్తకాలని పంపవచ్చు. కానీ గ్రంథకర్తకే అవార్డు ఇవ్వబడుతుంది. అవార్డు కోసం ఒక్కొక్క పుస్తకాన్ని నాలుగేసి ప్రతుల చొప్పున శ్రీ జె. ఎస్. మూర్తి (విహారి) ఎ- 1-9, ఎల్. ఐ. సి. క్వార్టర్స్, కడప- 516004 అనే చిరునామాకి 31 ఆగస్టు 1988 లోగా అందేలా పంపాలి.



## ఇంద్రజాలికుడు బోసుకి జాతీయ బహుమతి

సొసైటీ ఆఫ్ ఇండియన్ మెజీషియన్స్ వారు 1987 సంవత్సరానికి భారత ఐంద్రజాలిక రంగంలో విశేష కృషి చేసిన పదముగ్గురు ఐంద్రజాలికులకు మే 31న మేజిక్ అవార్డులను బహూకరించారు. ఈ అవార్డు గ్రహీతలలో విజయవాడలోని స్టేట్ బాంక్ ఉద్యోగి శ్రీ బోస్ ఒకరు. దక్షిణ భారతదేశంలోని ఇంద్రజాలికులలో ఈ బహుమతిని గెలుచుకున్నది ఈయన ఒక్కరే. ఆయన ఇంద్రజాలంపై వివిధ పత్రికలలో వ్యాసాలను, ఒక పుస్తకాన్ని రచించారు. 'ఇంద్రజాల ప్రపంచం' పత్రికకు ఆయన గౌరవ సంపాదకులు. శ్రీ బోస్ ఆంధ్రప్రదేశ్ మెజీషియన్స్ అసోసియేషన్‌కు ఉపాధ్యక్షులుగా కూడా ఉన్నారు. □

మహారాష్ట్రలోని పూనా సమీపంలో సనస్‌వాడి అనే గ్రామంలో ఇస్పాత్ ప్రొఫైల్స్ ఇండియా లిమిటెడ్ అనే కొత్త పారిశ్రామిక సంస్థ త్వరలో ఉత్పత్తిని ప్రారంభించనున్నది. ప్రైవేట్ రంగంలో రైలు పట్టాలను తయారు చేయనున్న మొట్ట మొదటి సంస్థగా ఈ సంస్థ అత్యంత ఆధునిక యంత్ర పరికరాలను వినియోగించుకుంటోంది. రైలు పట్టాలతో పాటు ఈ కర్మాగారంలో హెచ్-దూలాలు, స్లీపర్ బార్‌లు, స్టెయిన్‌లెస్ స్టీలు వస్తువులు, మిశ్రలోహాల వస్తువులు కూడా తయారవుతాయి. ఫొటోలో ప్రపంచంలోనే మొట్ట మొదటిసారిగా వాడబడుతున్న ఆధునిక యంత్రాన్ని చూడవచ్చు. కరుగుతున్న ఉక్కు ద్రవాన్ని మరమనిషి సాయంతో ఎత్తే ధారను కూడా చిత్రంలో చూడవచ్చు.





"మరణ మృదంగం"లో చిరంజీవి, రాధ

# సినిమా

(45 వ పేజీ తరువాయి)

## కృష్ణ దర్శకత్వంలో "ముగ్గురు కొడుకులు"

"స్మగ్లర్ల దగ్గర డబ్బు లూట్ చేసి, ఆ డబ్బును పేదవాళ్ళకు పంచే మోడర్న్ రాబిన్‌హుడ్ పాత్ర నాది. రమేష్‌బాబు నిరుద్యోగ యువకుడు. మురళీ మోహన్ పోలీస్ ఆఫీసర్. ఊటీలో మే 11 నుంచి జూన్ 2 వరకు జరిగిన షెడ్యూల్‌తో ఎనభై శాతం, జూన్ 20 నుంచి 30 వరకు మద్రాసులో మిగతా భాగం పూర్తయింది," అన్నారు కృష్ణ. ఈయన స్క్రీన్‌ప్లే, కూర్పు, దర్శకత్వంలో జి. నాగరత్నమ్మ నిర్మించిన రత్నా మూవీస్ పై ద్వితీయ చిత్రంలో రాధ, సోనమ్, మహేష్‌బాబు, గుమ్మడి, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు, గిరిబాబు, అల్లు రామలింగయ్య, చలపతిరావు, ప్రభ, బేబీ ప్రియ తతిమా తారాగణం. పరుచూరి సోదరుల రచన, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, శ్రీను- తార- శివశంకర నృత్యాలు, విజయన్ సాహసాలతో జి. హనుమంత రావు, జి. ఆదిశేషగిరిరావు నిర్మాణ సారథులు. ఈ చిత్రంలో అల్లూరి సీతారామరాజుగా మహేష్ ఏకపాత్రాభినయం అదనపు ఆకర్షణ.

## జూలైలో "ప్రాణస్నేహితులు"

"ఓ పేద యువకుడు, ఓ సంపన్న యువకుడు విచిత్ర పరిస్థితుల్లో స్నేహితులవుతారు. పరస్పరం ప్రాణ త్యాగం చేయడానికైనా సిద్ధమయ్యే వరకు అభివృద్ధి చెందుతుంది వారి మైత్రి. ఇలా వారి మనోబలం, ధనబలం ఏకమవడం ప్రత్యర్థులకు గిట్టదు. వీరి మధ్య అగాథాన్ని సృష్టిస్తారు. పంతాలు పట్టింపులు మొదలవుతాయి. చివరికి యదార్థం బయటపడి ఆ స్నేహితులిద్దరూ ఏకమవుతారు. జూలైలో విడుదల. తల్లీ కూతుళ్ళుగా రాధ ద్విపాత్రలు నిర్వహించింది". అన్నారు కృష్ణంరాజు. ఈయన ప్రధాన పాత్ర నిర్వహిస్తూ, సమర్పించే గోపీకృష్ణా కంబైన్స్ వారి పై చిత్రంలో శరత్‌బాబు, మురళీమోహన్, బాలయ్య, కోట శ్రీనివాసరావు, సారథి, ఎ. జె. వి. ప్రసాద్, అరుణ, సాగరిక, లక్ష్మీప్రియ, మాస్టర్ సురేష్, సతీష్ బేబీ, ప్రసన్నలక్ష్మి నటించారు. డి. ప్రభాకర్ మాటలు, భువనచంద్ర పాటలు, రాజ్‌కోటి సంగీతం, డి. ప్రసాద్‌బాబు ఛాయ, సుగంధ రమేష్ సంయుక్త దర్శకత్వం, జ్యోతి ప్రసాద్- వెంకటప్రసాద్- శ్రీనివాస్ ప్రొడక్షన్, డి. వెంకటరత్నం కూర్పు, యు. వి. సూర్య నారాయణరాజు నిర్మాణ సారథ్యంలో యు. శివకుమారి నిర్మించిన ఈ చిత్రానికి వి. మధుసూదన రావు దర్శకుడు.

## వి. ఎస్. ఆర్. స్వామి రూపొందించే "మరో భారతదేశం"

"రాజమండ్రి సమీపాన కోటిపల్లిలో జూలై మూడవ వారం నుంచి ఒకే షెడ్యూల్లో షూటింగ్ ముగుస్తుంది. కె. ఆర్. విజయతో పాటు మధు ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన ఏడుగురు విద్యార్థులు నటిస్తారు", అన్నారు ప్రముఖ ఛాయా గ్రాహకుడు వి. ఎస్. ఆర్. స్వామి. ఈయన స్క్రీన్‌ప్లే, ఛాయ, దర్శకత్వంలో ఉయ్యూరు బసివిరెడ్డి నిర్మించే ద్వాదశీ క్రియేషన్స్ వారి పై చిత్రానికి శాతవాహన మాటలు, వేటూరి పాటలు రాశారు. నిర్మలాస్వామి, భీమిరెడ్డి వెంకటరెడ్డి నిర్మాతలు. □



"కాలరుద్రుడు"లో త్యాగరాజన్